# నిజం

ఆరు అంకాల నాటకం

రాచకొండ విశ్వనాథ శాస్త్రి




చంద్రం బిల్డింగ్స్ విజయవాడ - 4.

Publication No : 1088

Number of Copies : 2000

తెలుగులో ప్రచురణ హక్కులు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారివి. తక్కిన అన్ని హక్కులూ రచయితవి.

Editions : First Edition 1962 September.
Second Edition 1968 March.
Third Edition 1971 July.
Fourth Edition 1978 February.
Fifth Edition 1984 November.

Title : NIJAM (Telugu)

Author : RACHAKONDA VISWANADHA SASTRI.

Publishers : VISALAANDHRA PUBLISHING HOUSE
Chandram Buildings,
Vijayawada-520 004.

*Branches :*

VISALAANDHRA BOOK HOUSE
Anantapur, Vijayawada, Guntur,
Visakhapatnam, Hyderabad,
Tirupati, Hanamakonda.

Subject : DRAMA

***Price : 9-00***

---

Printers : Balaji Art Printers, Vijayawada-520 014.

# రచయిత మనవి

నేను మొదట కథలు రాసినప్పుడు సరదాకోసమూ, గొప్పకోసమూ తప్ప మరెందుగురించీ రాయలేదు. మనం కూడా కథలు రాసేం, అవి పత్రికల్లో పడ్డాయి-అంటే నాకు పెద్ద గొప్పగా వుండేది. కాని రాను రాను ఆ పంథా మారిపోయింది. వయసుతో పాటు అనుభవంతో పాటు మనసు కూడా మారుతుం దనుకుంటాను. ఈ నాటకం నేను నా గొప్పకి కాని నాకు ఊసుపోక కాని రాసిందికాదు. ఇందులో జరిగిన అన్యాయాలవంటి అన్యాయాలు నిజ జీవితంలో అదే స్థాయిలో నిత్యం జరక్క-పోయినా ఏదో ఒక స్థాయిలో మాత్రం నిత్యం జరుగుతూనే వున్నాయి. ప్రస్తుతం మన దేశంలో ప్రతిరోజూ ప్రతిచోటా కూడా ఎందరో కొంద రమాయకులు వాళ్ళు చెయ్యని నేరాలకి శిక్ష లనుభవించడం జరుగుతోందని నేను ఖచ్చితంగా, ఘంటాపథంగా, ఛాలెంజి చేసి చెప్పగలను. కాని, ఆ మాత్రం ఈ మాత్రం డబ్బూ, పలుకుబడీ, పదవీ, హోదా కలవాడెవడూ మాత్రం ఆ పరిస్థితుల్లో పడ్డు, ఇరుక్కోడు. ఒకవేళ, పడినా ఇరుకున్నా పైకి తప్పించుకో గలడు. మరైతే ఆ విధంగా అన్యాయానికి గురి అవుతున్న దెవరు? "మిగతా అలగా జనం !" ఆ విధంగా అన్యాయానికి గురవుతున్నది వాళ్ళు. వాళ్ళ గురించే 'దీనులు, హీనులు, పతితులు, భ్రష్టులు, బానిసలు, పీడితులు' అని చెప్పి, కవులు రిఫర్ చేస్తుంటారు. వాళ్ళు ఉన్నారనే విషయాన్ని పెద్ద లంతా వప్పుకొంటారు. వాళ్ళని ఉద్ధరించవలసిన ఆవశ్యకత ఉన్నదని కూడా వప్పుకుంటారు. కానీ, వాళ్ళని బాగు చెయ్యడంకోసం పెద్దలెవ్వరూ ఏమీ

చెయ్యడం మాత్రం కనిపించదు. లంచాలు జేబుల్లోకి వెళ్తున్నాయి, లాభాలు బ్యాంకుల్లోకి వెళ్తున్నాయి. రాజకీయ వేత్తలు ఖద్దరు బట్టలు తొడుగుకొని పార్లమెంటుకి వెళ్తున్నారు. దేశంలో అంచర్నీ ఉద్ధరించడానికి ఆర్థిక మంత్రులు కోట్లమీద అప్పుకోసం ప్రతి దేశానికీ వెళ్తున్నారు: దేముడు చెప్పిన న్యాయాన్ని నిలబెట్టేందుకు స్వాములూ, మౌలీలూ, బిషప్పులూ రోజూ ఉపన్యాసాలకి వెళ్తున్నారు. కాని ఏ పాపం ఎరగని వాళ్ళుమాత్రం జెయిళ్ళలోనూ, జెయిళ్ళ బైటా కూడా మగ్గుతూనే వున్నారు: పాపంలా పెరిగిన పెద్దవారు ఎన్ని పాపాలు చేసినా వారే పెద్దవారుగా ప్రభువులుగా వుంటున్నారు. ఈ పరిస్థితుల్లో ఈ సంఘంలో పేదవాడికి న్యాయం దొరకదు కాక దొరకదు. తన కన్యాయం జరిగితే ఎదుర్కొందికి పేదవాడికీ సంఘంలో అవకాశం లేదు కాక లేదు. ఈ పరిస్థితి మారాలని నా కుంది. అందుకే ఈ నాటకం రాసేను.

రాచకొండ విశ్వనాథ శాస్త్రి

21-9-62

# కృతజ్ఞత

ఈ నాటకం నేను గురజాడ కళా కేంద్రపు సభ్యులకి అంకితం చేసేను. ఇప్పుడు ఆ సంస్థ లేదు. సభ్యులు మాత్రం వున్నారు. వారు : 1. నటకోవిద శ్రీ చాగంటి సన్యాసి రాజుగారు (విశాఖపట్నం), 2. శ్రీ ఇవటూరి సాంబశివరావుగారు, 3. శ్రీ ఆకెళ్ళ కృష్ణమూర్తిగారు. 4. శ్రీ వాశిరెడ్డి వెంకటప్పయ్యగారు, 5. శ్రీ పులుగుర్త శ్రీహరిరావుగారు 6. శ్రీ మంగిపూడి రామస్వామి శాస్త్రిగారు, 7. శ్రీ కోరాడ జగన్‌గారు, 8. శ్రీ వడ్డిరాజు వెంకట కృష్ణారావుగారు, 9. శ్రీ సంకు పాపారావుగారు, వారి ప్రోత్సాహం వల్ల నేను ఈ నాటకం రాయగలిగేను. వారికి నా కృతజ్ఞత.

ఎవ్వరూ కూడా ఈ నాటకం ప్రదర్శించరేమోనని నేను మొదట్లో కొంతగా భయపడ్డానా ? భయపడ్డాననే అనుకుంటాను. కాని, మచిలీపట్నపు న్యాయవాదుల సంఘం వారు ఇది తొలిసారిగా ప్రదర్శించి నాకు కొంత ఉత్సాహం ఇచ్చేరు. వారందరికీ నా కృతజ్ఞత.

నేను కొన్ని చిక్కుల్లో వున్నప్పుడు శ్రీ నాట్యభారతి (విశాఖపట్నం) సంస్థవారు ఈనాటకం విజయవంతంగా ప్రదర్శించి నాకు సహాయం చేసేరు. ఆ సంస్థ సభ్యులందరికీ నా కృతజ్ఞత.

ప్రచురణ నిమిత్తం పంపించగానే, నాటకం బాగున్నదని చెప్పి, నన్ను ప్రోత్సహించి, వెంటనే ప్రచురించి, రెండవకూర్పు కూడా తీసుకు వస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి నా కృతజ్ఞత.

తెలుగు పాఠకులు నన్ను కొంతగా అభిమానించేరని నేను తలుస్తున్నాను. వారికి నా కృతజ్ఞత.

రాచకొండ విశ్వనాథశాస్త్రి

14—11—1967,

విశాఖపట్టణం.

# 14-2-1965న మచిలీపట్నం అడ్వకేట్స్ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ వారు 'నిజం' నాటకం ప్రదర్శించినప్పటి నటబృందం

| | | |
|---|---|---|
| సార్వభౌమరావు | : | శ్రీ విన్నకోట ఉదయభీమరాజు B.A.,B.L. |
| సుందరరావు | : | శ్రీ కృత్తివెంటి గోపాలకృష్ణమూర్తి B.Sc.,B,L. |
| సత్యం | : | శ్రీ కలపటపు రాజేంద్రప్రసాద్ B.Sc.,B.L, |
| సోమసుందరరావు | : | శ్రీ పేర్ని కృష్ణమూర్తి M.A.,L.L.B. |
| మధుసూదనరావు | : | శ్రీ పట్టా శివరత్నప్రసాద్ B.A.,B.L. |
| కృష్ణారావు | : | శ్రీ ఆరేపల్లి శ్రీహరిరావు M.A.,L.L.B. |
| జడ్జి | : | శ్రీ కోకా నారాయణస్వామి B.A.,B.L. |
| ప్రాసిక్యూటర్ | : | శ్రీ చిత్తర్వు సూర్యనారాయణ B.Sc.,L.L.B. |
| సబినస్పెక్టర్ | : | శ్రీ తలుపుల హనుమంతరావు B.A.,B.L. |
| ప్రాసిక్యూటర్ జూనియర్ | : | శ్రీ కానూరి సీతారామశాస్త్రి B. Com., B.L. |
| బెంచి గుమాస్తా | : | శ్రీ ఎస్. టి. జి. భాష్యకార్యులు B.A.,B.L. |
| కోర్టు ప్యూను | : | శ్రీ పాలపర్తి సీతారామారావు B.A., B.L. |
| డిఫెన్స్ లాయర్ | : | శ్రీ కలపటపు సీతారామారావు B.A.,L.L,B. |
| సుశీల | : | శ్రీమతి విజయనగరం కుసుమ కుమారి |
| దర్శకత్వం | : | శ్రీ పాలపర్తి సీతారామారావు B.A., B.L. |

# పాత్రలు

## సత్యం :

'లా' చదువుతున్నాడు. వయసు : ఇరవై పైన పాతిక లోపు.

## సుందరరావు :

సార్వభౌమరావుగారి కొడుకు. ఆర్మీలో ఆఫీసరుగా వున్నాడు. సత్యం కంటే రెండేళ్ళు పెద్ద.

## మధుసూదనరావు :

పాలిటిక్స్ ఆనర్స్ ఆఖరి ఏడాది చదువు తున్నాడు వయసు సత్యం వయసే వుంటుంది.

## కృష్ణారావు:

మధుసూదనరావు క్లాసుమేటు. అదే వయసు.

## సుశీల :

సార్వభౌమరావుగారి యింట్లో వుంటుంది. అతనికీ, ఈమెకీ సంబంధం వుందని అందరికీ తెలియదు. అతని (చనిపోయిన) వంటమనిషి కూతురు. చాలా అందంగా వుంటుంది. పాతికేళ్లుంటాయి.

## సోమసుందరరావు :

పాతిక సంవత్సరాలుంటాయి. స్టూడెంటు కుర్రవాళ్లా వుంటాడు: కాని కాడు. దిక్కూ మొక్కూ లేకుండా ఊళ్లో జులాయిగా, బేవార్సుగా, రౌడీగా తిరుగుతూ వుంటాడు. చదువుకున్న జులాయి వాళ్ళతో కలసి మెలసి వుంటాడు. చదువుకోలేదు గాని, మాట్లాడ్డం, దాదాపు, చదువుకున్న వాళ్ళల్లాగే మాట్లాడతాడు.

## సార్వభౌమరావు :

పార్లమెంటు మెంబరు, పవర్ ఫుల్ మనిషి. చూడ్డానికి డాబుగా, గంభీరంగా వుంటాడు. సుశీలని విడువలేడు. యాభయ్యేళ్ళ వయసుంటుంది. బలంగా వుంటాడు.

## కిష్టప్ప :

పోలీసు సబ్ యిన్స్పెక్టరు. ముప్పయేళ్లుంటాయి.

## జడ్జి :

సెషన్స్ జడ్జి, యాభయేళ్ళ వయసు. తను తెలివైన వాణ్ణని తెలిసినవాళ్ళా వుంటాడు. హైకోర్టు జడ్జిగా ప్రమోషన్ వస్తుందని ఆశ పెట్టుకున్నవాడు.

## బెంచిగుమస్తా :

బక్కగా వుంటాడు.

ప్రాసిక్యూటరు :

నలభై అయిదేళ్ళుంటాయి, 'నీకు కనికరం లేదమ్మా' అని అతన్తో చెప్తే ఆశ్చర్యపోతాడు.

డిఫెన్సు లాయరు :

ముసలివాడు. "ఈ రోజుల్లో న్యాయానికి నిలబడి లాభం లేదని" తెలుసుకున్నవాడు.

కోర్టు బంట్రోతు : గా చాలా కాలంనుంచీ వున్నాడు.

స్టెనో గ్రాఫరు :

ముక్తసరి మనిషి, మెకానికల్ మనిషి, ఐక్కగా వుండడు.

డాక్టరు :

ఏ వయసు వాడైనా కావచ్చు, పాతిక దాటేక.

వీరుకాక, జెయిల్ సూపర్నెంటూ, జిల్లా మెడికల్ ఆఫీసరూ, జెయిల్ డాక్టరూ, మేజిస్ట్రేటూ, ఇద్దరు రిజర్వు పోలీసులూ, (తుపాకులతో, వాటి మీద బాకులతో సహా) జెయిల్ వార్డర్లిద్దరూ, కోర్టులో ప్రాసిక్యూషన్ సాక్ష్యం విని, అదంతా మిగిలిన సాక్షులకి అందివ్వటానికి యిద్దరు చారులూ, కొంతమంది లాయర్లూ, పౌరులూ—వగైరా పాత్ర లుంటాయి.

(ఈ నాటకంలో పాత్రలన్నీ కల్పితాలు. నిజ జీవితంలో యెవ్వరినీ ఉద్దేశించినవి కావు.)

# ఈ నాటకం ప్రదర్శించాలంటే :

కొంత తగ్గించుకోవలసుంటుంది. అలా తగ్గించుకోవలసిన భాగాలు దీని తరవాత పేజీలో సూచించడం అయింది. ఆ ప్రకారం అయినట్లయితే మూడో అంకం పూర్తిగా తీసేయడం అవుతుంది. అవకాశం వున్న సమాజాలవారు అది కూడా ప్రదర్శించుకోవచ్చు.

ఈ నాటకంలో ఎక్కువ పాత్రలున్నాయి. అయితే మొదటి సీనులో కనిపించే సత్యం ఆ సీను తరువాత తిరిగిరాడు. అదే విధంగా సుందర్రావు కూడా రెండో అంకం మధ్యలో వెళ్ళిపోయి మరి కనిపించడు. ఆయా వేషాలు వేసేవారు అటు తరువాత సీనుల్లో వేరే వేషాలు-జడ్జీగా, ప్రాసిక్యూటర్‌గా లేక డిఫెన్స్ లాయరుగా-వేయడానికి వీలుంటుంది. అదే మాదిరిగా [మూడు] నాలుగు అంకాల్లో వచ్చే రిజర్వు పోలీసువారు ఆఖరి సీనులో జెయిలు వార్డర్లుగా మారొచ్చు.

రెండో సీనులో గోడ గడియారం ఉంచినట్లయితే, ఆ గడియారం సోమసుందర్రావుని సార్వభౌమరావు చెప్పిన ప్రకారం పక్కగదిలో పెట్టి, సుశీల గడియ వేసిన సమయానికి-సరిగ్గా ఆ సమయానికే 12 గంటలు కొట్టాలి. ఆ సీను మొదలు పెట్టిన దగ్గర్నుంచి సరిగ్గా ఆ క్షణం వచ్చేవరకు ఎంత టైం పడుతుందనేది రిహార్సల్స్‌లో చూసుకోవలసి వుంటుంది. కుదరదేమోననే అనుమానం వుంటే ఆ సీనులో గడియారం ఉండక పోవడం మెరుగు.

కేసు విచారణ సీనుల్లో కోర్టు హాలు జనంతో (ముఖ్యంగా స్టూడెంట్సుతో) కిటకిట లాడుతున్నట్టు చూపించ గలిగితే బావుంటుంది. ముందుగా చెప్పి ఆడిటోరియంలో ఉన్నవారిని కొంతమందిని అప్పుడు స్టేజి మీదకి రప్పించుకోవచ్చు.

# ప్రదర్శనకు తగ్గించుకోవలసిన భాగాలు

## స్టెనో గ్రాఫరు, డాక్టరు పాత్రలు

పేజీ 3 : 8 వ పంక్తినుండి 14 వపేజీలో 12 వ పంక్తివరకు.

పేజీ 5 : 20 వ పంక్తినుండి 17 వ పేజీలో 4 వ పంక్తి వరకు.

పేజీ 20 : 6 వ పంక్తినుండి 21 వ పేజీలో 3వ పంక్తి వరకు.

పేజీ 27 : 21 వ పంక్తినుండి 30 వ పేజీలో 13 వ పంక్తి వరకు.

పేజీ 31 : 19 నుంచి 20వ పంక్తి వరకు

పేజీ 31 : ఆఖరి రెండు పంక్తులలో "మిస్టర్ మధూ............? "ఇష్టం లేదన్నావ్."

పేజీ 33 : 4 వ పంక్తి నుండి 6వ పంక్తి వరకు.

పేజీ 33 : 7 వ పంక్తిలో "ఇంతకీ మాలతెవరు ?"

పేజీ 91 -123 : 3 వ అంకం అంతా.

పేజీ 141 : క్రిందనుండి 17 వ పంక్తిలో "దాని కొడుక్కి....;" నుండి 23 వ పంక్తి వరకు.

పేజీ 145 : 10 వ పంక్తిలో "కాని నన్నాయన...." నుండి 13 వ పంక్తి వరకు.

పేజీ 145 : చివరి రెండు పంక్తులు.

పేజీ 150 : 9 వ పంక్తిలో "అతను కనిపిస్తే...." నుండి 13 వ పంక్తిలో "కితకితలు పెట్టేవి" వరకు.

పేజీ 150 : 5 వ పంక్తిలో "నా నేరాలు...." నుండి 151 వ పేజీ 1 వ పంక్తిలో "క్షమించకండి" వరకు.

పేజీ 152 : 22 వ పంక్తిలో వ్రాసి : "తమరు మన్నిస్తే...." నుండి 166 వ పేజీ 12 వ పంక్తిలో "ప్రాణం తీసే డితను" వరకు.

# 1

సమయం : మధ్యాహ్నం. సుమారు పన్నెండు గంటల సమయం.

స్థలం : ఊరికి చాలా అవతల, నల్లచెరువు అవతల స్థలం. చిట్టడవిలా వుంటుంది.

ముగ్గురు యువకులు చల్లగా వున్నచోట కూర్చొని వుంటారు. పక్కన ఒక తుపాకి వుంటుంది. ముగ్గురూ కూడా కొంచెం అలసట పడినట్టుంటారు.

[సుందరరావు : (సిగరెట్ కేస్ విప్పి) ఇందరా, సత్యం.

సత్యం : ఏమిటి? (అవి ఏదో ఆలోచిస్తూ అన్నాడు)

సుందరరావు : సిగరెట్టు. ఏం? కనిపించలేదా? కళ్ళజోడు కావాలా?

సత్యం : నా కొద్దు.

మధుసూదనరావు : ఏ దొద్దు? సిగరెట్టా? కళ్ళజోడా?

సత్యం : గొప్ప విట్టు !

సుందరరావు : ఒద్దా సిగరెట్టు ?

సత్యం : కడుపులో ఏమైనా పడితేగాని పొగ భరించలేను. నా కిప్పుడొద్దు.

మధుసూదనరావు : వీడు చెడ్డ సీరియస్ మనిషండీ, సుందరంగారూ! సిగరెట్టొద్దనడానికి అంత సీరియస్‌నెస్ ఎందుకు చెప్పండి ? వీడు నవ్వినా సీరియస్‌గానే నవ్వుతాడు. మరింక లవ్ చేస్తే ఎంత సీరియస్‌గా జేస్తాడో చూడాలి.

సుందర : (ఈలోగా తనొక సిగరెట్ తీసుకొని మధుసూదనరావుకి ఒక టిస్తూ) కాల్చండి.

మధు : నే నెప్పుడో కాని కాల్చనండి. మనం తెల్లారుజామున అయి దింటికి కదా బయల్దేరాం? ఇప్పుడెంతయింవండి?

సుందర: పన్నెండు దగ్గర.

మధు : చూడారా! ఇప్పటికప్పుడే ఆరు కాల్చేశాను. (అంటూ సిగరెట్లు తీసుకున్నా దప్పుడేను) ఎన్నడూ లేదు.

సత్యం: ఆరయేయి కద. మరొక చేడుప్.

మధు : కాల్చమంటావా ?

సత్యం: సీరియస్‌గాను.

మధు : అయితే కాలుస్తాను. ]

(సుందరరావు, మధుసూదనరావు సిగరెట్లు అంటిస్తారు.)

సుందర : ఒరే సత్యం ! కారెక్కడ పెట్టేవురా ? చాలా దూరం వుంచే వేటి?

సత్యం : లేదు.

సుందర: మరైతే వెళ్ళిన వాడింకా రాడేం ? ఓసారి కేకెయ్ !

మధు : నే పిలుస్తానుండండి. (అని) క్రిష్ణ ! ఒరే క్రిష్ణ! (అంటూ గట్టిగా కేక వేస్తాడు)

కృష్ణారావు: (దూరం నుంచి) కమింగ్ !

సుందర: వేగిరం రమ్మనండి.

మధు : (గట్టిగా) త్వరగా రా !

కృష్ణ: (దూరం నుంచి) వస్తున్నా.

సుందర: ఒరే సత్యం! వీడు అక్కడే కొంత లాగించేదం లేదుకద?
సత్యం: లాగించడు. నువ్వు తంతావని భయం వుంది.
సుందర: తంతారంటే ఎవడికైనా భయం వుంటుంది.
మధు: సుందరంగారూ! మీరు మిలిటరీలో వున్నారు కదా! మీకూ భయమే?
సత్యం: భయం అందరికీ వుంటుంది. భయపడ్డా నిలబడ్డవాడే ధైర్యవంతుడు.
సుందర: ఆర్మీలో వుంటే భయం పోతుంది.
సత్యం: నీ ఆర్మీ గొప్పలు నా దగ్గర చెప్పకు.
మధు: నాకు ఆర్మీవాళ్ళంటే చెడ్డ జెలసీస్మండీ! మీకు అంతరాత్మా గింత రాత్మా వీటి భయం ఏమీ వుండదనుకుంటాను, ఏమంటీ సుందరం గారూ?
సత్యం: చంపేవాడికి అంతరాత్మ ఎప్పుడూ అడ్డురాదు.
మధు: నేనే పని చేసినా అంతరాత్మని Consult చేసిగాని చెయ్యను.
సత్యం: వెధవా! నీకు అంతరాత్మంటూ లేదు. ఉన్నా దనుకొంటున్నావంటే. వుంటే మాలతిని పెళ్ళాడే వుందువు.
సుందర: మాలతెవరు?
సత్యం: అదంతా వేరే కథలే.
మధు: ఏం లేదండీ సుందరంగారూ!
[సుందర: అయామ్ సారీ! అడగన్లెండి.
మధు: వీడికి నేనంటే జెలసీ అండీ సుందరంగారూ! క్రిష్ణా, మీరూ అన్నా కూడా జెలసీనే వీడికి.

సత్యం : పోరా యిడియట్ !

మధు : కొడితే కొట్టు, తిడితే తిట్టు, ఆ మాట మాత్రం నిజం. నిజం చెప్ప డానికీ నేను భయపణ్ణు.

సత్యం: భయపడితే నువ్వు నిజం చెప్పనే లేవు.

సుందర: సత్యానికి నేనంటే ఎందుకండీ జెలసీ ?

మధు : మీకు డబ్బుందనీ, మీరు గొప్పవాళ్ళనీ-అందుకు.

సుందర: వాడికి మాత్రం డబ్బులేదూ? ఏమిరా లేదూ నీకు డబ్బు?

మధు : వాడికే ముంటుంది? వాడి మేనమామ కుంది. మేనల్లుడంటే ప్రొఫెసర్ గారికి అభిమానం కాబట్టి యిల్లిచ్చి, డబ్బిచ్చి, కావలిస్తే కారు కూడా యిస్తున్నాడు.

సత్యం: ఒరే మధూ! నీ మాటబట్టి ఏం తెలుస్తుందంటే, నీకే నేనంటే జెలసీ ! ఏమిరా సుందరం, అదే తెలుస్తోం దవునా?

సుందర: ఏమో నాకదేం తెలీదుగాని, ఒరే సత్యం, నీకు మాత్రం డబ్బున్న వాళ్ళంటే యిష్టం లేదురా. ఆమాట నిజం. నే నెన్నాళ్ళయిందిరా ఈ వూరొదిలేసి? థర్డుఫారం పాసవగానే బెంగుళూరు పోయేను. అక్కణ్ణించి ఆర్మీకి పోయేను. ఇక్కడికి ఏడాది కోసారి కదా ఒస్తు న్నాను. నువ్వూ క్రిష్ణగాడు-మీ యిద్దరినీ తప్ప నా కీ వూళ్ళో ఎవ్వరూ తెలీదు. ఎప్పుడొచ్చినా మీ యిద్దర్నే కద కలుస్తున్నాను? మన ఫ్రెండు చెప్తే నాకు గుర్తొస్తోంది. నే నెప్పుడొచ్చినా నా ఎదుట నువ్వు డబ్బున్నవాళ్ళని దెప్పకుండా వుండలేదురా.

సత్యం: నాకు డబ్బంటే యిష్టంలేదు: కాని మనుషులంటే యిష్టం లేక పోలేదు.

సుందర : అయితే, మన కొత్త ఫ్రెండు చెప్పినమాట నిజమే! సరే కాని, అయితే మీరంటే ఎందుకండీ మనవాడికి అంత ఈర్ష్య?

మధు : మాలతి నన్ను లవ్ చేసిందని, అందుకు!

సత్యం : నిన్ను చూస్తే నాకు ఈర్ష్య కాదురా వెధవా! అసహ్యం. ]

సుందర : ఓహో! మన ఫ్రెండు మధుగారు చిన్న రోమియో అన్నమాట. చెప్పేవు కాదింతవరకూను. మైడియర్ సర్! అయితే మీ రివాళ దేవదాసు పాత్ర కూడా వహించి తీరవలసిందే.

మధు : నేనేం తీసుకోనండి, ప్లీజ్! నన్ను క్షమించండి.

సుందర : వీల్లేదు. మీ కివాళ ప్రారంభోత్సవం జరిపించి తీరుతాం. ఏమిరా సత్యం? జరిపించుదామా?

సత్యం : అభ్యంతరమేంటి బాబూ! (అని వెటకారంగా అంటాడు)

మధు : నా కొద్దండీ!

సుందర : సేవించి తీరాలి.

సత్యం : చచ్చినట్టు.

సుందర : మనవాడింకా రాడేం?

మధు : నే కేకేస్తా నుండండి.

సుందర : వేగిరం వెయ్యండి. యుగంలా వుంది క్షణం.

మధు : ఒరే క్రిష్టా! (అని గట్టిగా పిలుస్తాడు)

కృష్ణారావు : (కొంత దగ్గర్నుంచి) ఒస్తున్నా!

మధు : (గట్టిగా) వేగిరం!

సుందర : జల్టీ!

కృష్ణారావు : కమింగ్ కమింగ్ (అంటాడు కొంత దగ్గర్నుంచి)

సుందర : వైతో! మరింక సర్దుకుకూర్చోండి.

మధు : నన్ను దయచేసి పార్టీలోంచి తప్పించేయండి సార్!

సుందర : మీ అర్జీ కొట్టిపారేశాం. తాగి తీరవలసిందే. ఏమిరా సత్యం! అంతేనా?

సత్యం : సువ్వలా అంటే వాడికి గొంతు ఎండిపోతుంది. ఆ వాటర్ బాటిల్లో కాస్త మంచినీళ్ళియ్యి.

మధు : ఆ వాటర్ బాటిల్ చాలా బావుందండీ. అదికూడా మిలిటరీ సప్లయే కదండీ?

సుందర : మిలిటరీ సప్లయే. మార్కు ఉంది చూడండి. కాని మీరు టాపిక్ మార్చాలని చూస్తున్నారు. మీ రెంత తప్పించుకుందామని ప్రయత్నించినా లాభంలేదు. తీర్థం తీసుకు తీరాలి—

సత్యం : అవును. తీసుకుతీరాలి. అందులోనూ అది లెఫ్టినెంట్ సుందరం గారి ఆర్డరు! పురపాలక సంఘాధ్యక్షులు, పార్లమెంటు సభ్యులు, అర్బన్ బ్యాంకు డైరెక్టర్లు, శ్రీ ఇలెక్ట్రికల్స్ సోల్ ప్రొప్రయిటర్లు అయిన శ్రీశ్రీశ్రీ సార్వభౌమరావుగారి సుపుత్రులు, లెఫ్టినెంట్ సుందరంగారి మాటకి ఎదురూ, తిరుగూ లేదు.

మధు : సార్వభౌమరావుగారి మాటెంతో ఈయన మాటా అంతే నంటావా?

సత్యం : కాదామరి?! వారు నిల్చోమంటే మనం నిల్చోవాలి, కూర్చో మంటే కూర్చోవాలి.

సుందర : సిగరెట్టు కాల్చమంటే కాల్చాలి. తాగమంటే తాగాలి.

మధు : (నవ్వుతూ) బ్రాతెల్ హౌసుకి వెళ్ళమంటే ?

సత్యం : చెప్పాలి. వారేం చెయ్యమంటే మనం అది చెయ్యాలి. వారు మనల్ని బతకమంటేనే మనం బతకాలి. చావమంటే చావాలి. జయ విజయీభవ దిగ్విజయీభవ ! కరెక్టేనా?

సుందర : వెఁవిఁట్రా కరెక్టు? ఏధవా!

సత్యం : భవ భవ అన్న మాట.

సుందర : నన్నా అడుగుతావు? నా కింగ్లీషే సరిగ్గా రాదు.

మధు : చూసేరా? మిమ్మల్ని చూస్తే మనవాడి కెంత జెలసీనో!

సుందర : మిస్టర్ మధూ! ఫర్ హెవెన్స్ సేక్! మీ జెలసీ లన్నీ ఒక్క క్షణం అలా వుంచండి. మన భారత వీరకుమారు డొస్తున్నాడు. రారా క్రిష్ణా!

కృష్ణ : (ప్రవేశిస్తూ) సామాన్లు పట్టుకోండ్రా నాయనల్లారా! మొయ్యలేక చచ్చేను.

సుందర : ఆ రెండు సీసాలూ ముందు నా చేతికిలా ఇయ్యి. కార్కు విప్పగానే ప్రాణం లేచిరావాలి. (రెండు విస్కీదాటిల్సూ తీసుకుంటాడు. తీసికావి రుమాల్తో శుభ్రంగా తుడుస్తాడు.)

మధు : అమ్మో! రెండు దాటిల్సే!

సుందర : ముందొకటి ఓపెన్ చేదాం.

కృష్ణ : ఈ సోడాలు అలా ఓ వార పెట్రా మధూ! మొద్దూ!

సత్యం : ఆ తినుబడి పదార్థాలన్నీ యిలా యిక్కడికి రానీ.

కృష్ణ : మూటలన్నీ మీమైతే మరి నేనేమైనట్టు?

సత్యం : గాడిదైనట్టు. తే యిలా తే!

కృష్ణ : ఒరే చంపేస్తారా సత్యం!

సత్యం : సత్యాన్ని చంపడం నీ తరంకాదు.

కృష్ణ : (సుందరం భుజం తట్టి, తినుబడి పదార్థాల బుట్ట పక్కన పెట్టు కొంటూ) మిలిటరీ మైటంతా నా సైడుంది. జాగ్రత్త!

సత్యం : ఆ బుట్ట అలా మధ్యనిపెట్టు (అని నలుగురి మధ్యా బుట్ట పుంచేడు.)

[కృష్ణ : ఒరే! నన్ను గాడిదన్నావు. బుట్ట లాక్కున్నావు. ఇన్‌సల్టా, ఇంజరీ రెండూనూ! నే నూరుకోను, నువ్వివాళ చసి! మరింక రాసుకో! (అని ఉత్తుత్తి కోపంలా అభినయిస్తాడు) ]

సుందర: అరే క్రిష్టా!

కృష్ణ : జీ హుజూర్!

సుందర: సత్యంగాడిది తప్పులేదురా!

కృష్ణ : సత్యం గాడిదా?

సుందర: [నవ్వి] కాదు. నువ్వు.

కృష్ణ : నువ్వూనా?

సుందర: చస్ !

కృష్ణ : నన్నిలా ఇన్‌సల్ట్ చెయ్యడం?

సుందర: గాడిదలు మూటలు మోయును. నువ్వొ మోసేవు. అందేత నువ్వె గాడిదవి. వాణ్ణి చసి చేస్తా నన్నావు. నన్ను చెమ్ మరి.

కృష్ణ : నేను నిన్నేం అనను.

సుందర: ఎందేత?

సత్యం : ఎందేతో చెప్పనా?

సుందర: చెప్పు.

సత్యం : గాడిద వెనక కాళ్ళనే తంతుంది. ముందున్న వాళ్ళ నేమీ చెయ్యదు

కృష్ణ : ఒకే సత్యం ! నీ తెలివితేట అమోఘం. కాని నా దెబ్బ చాలా బలం. అది తెలుసుకో.]

సుందర: ఆరే క్రిష్ణా ! బ్రెడ్డూ వగైరా తియ్యి. పేపర్లలా పరువు. ఫిష్ టిన్నేవీ? 'ఓపెన్' చెయ్యి వేగిరం.

కృష్ణ : అక్కడే చేసేను. అంతా రెడీ ! ఇదిగో టంబ్లర్స్. మరింక నీదే ఆలస్యం.

సుందర: సిగరెట్స్నేవీ ?

కృష్ణ : అవీ తెచ్చేను.

సత్యం : ఒకే, కారు మళ్ళీ లాక్ చేసేవా?

కృష్ణ : చేసేన్రా బాబూ !

మధు : మేష్టరుగారూ ! సుందరంగారూ !

సుందర: అన్నీ అందరికి సర్దుతున్నావురా క్రిష్ణా?

కృష్ణ : కనులు పండువుగాను ! చూడు.

సుందర: శాభాష్! నమ్మిన బంటువిరా క్రిష్ణా!

కృష్ణ : జీ.

సుందర: అయితే మిష్టర్ మధూ! మీరు సిద్ధంగా వుండాలి.

మధు : క్షమించండి సార్.

సుందర: క్షమించను.

మధు : నా కిష్టంలేదండీ.

సుందర: ఇష్టం లేకపోయినా సరే.

మధు : ఒద్దండి ! ఒద్దు సార్ ! నా కొద్దు.

కృష్ణ : రహస్యంగా రమ్మని పిల్చి, అగాగు పడికట్టుకున్నా నందిట ఆఖరి కెవర్తోను, అలా వుంది నీ వాటం! దీనికే జడిసిపోతే, ఒరే వెధవా, నువ్వింక జీవిత పోరాటంలో ఎందుకు పనికొస్తావు ?

సుందర: గోల్డెన్ వర్డ్స్.

సత్యం : క్రిష్ణగాడు పార్లమెంటులో ఉండాల్రా సుందరం. 'ప్రొహిబిషన్' మ్యూజియుమ్లో రద్దు.

కృష్ణ : థాంక్యూరా సత్తిగా! మరింక కానీరా మధూ!

మధు : నా కొద్దురా బాబూ! నవ్వితే నవ్వేవుకాని-అంతరాత్మ ఒప్పు కోదురా.

కృష్ణ : వెధవా నీ కంతరాత్మ అంటూ వుంటే, వేగిరం చంపే ! నా కప్పు చెప్తే మ్యూజియమిషాలపని, దాన్నలా వదిలేసి దార్లోకి దిగు.

మధు : దిగన్రా బాబూ!

కృష్ణ : వెధవా! జాన్సన్ ఏమిటన్నాడో మర్చిపోయేవురా? హీరో అవా లంటే బ్రాంధీ తాగాలన్నాడా లేదా ?

మధు : పోరా ! నా కొద్దురా. నువ్వన్నీ యిలాగే !

కృష్ణ : ఒరే చచ్చు పెద్దమ్మా ! నీకు వీరుడివి కావాలని కోరిక లేదా ! వీరుడివి కావాలంటే విస్కీనే తాగాలి. దేవతలకు అమృతం! వీరులకు విస్కీ ! ఏమిరా సుందరం? అవునా ?

సుందర: కాదు మరి!

కృష్ణ : ఏమిరా సత్తిగా? అవునా !

సత్యం : అవునంతేన్రా ! యజ్ఞాలూ యాగాలూ పోయేయి. కత్తులూ కటార్లూ పోయేయి. సమ్మెలూ, సత్యాగ్రహాలూ పోయేయి. మనం మరింక

పీఠం పీఠం హీరోయిం రావాలండే, మందు కొట్టి మునింటికి వెళ్ళాలంతే !

సుందర: ష్రుట్ వాలా. హాకీ బాగా పోయేయిరా, సత్యం ! మర్చిపోయేవు.

కృష్ణ : మహరం(గ్రా. మనవ్వా వాళ్ళాగేను ! ఈ న్నగా చెప్పుడూ మూడ్ పాడుచేస్తాడు. అందుకే వీణ్ణిచూస్తే నాకసహ్యం. మాధవి గురించీ, మాలతి గురించీ, మెర్లిన్ మెన్రో గురించి మాటాడుకొంటూ ఎంతో సంతోషంగా హాయిగా మనం ఉంటాం అనుకో. అప్పుడు ఏ టాపిక్ తెస్తాడో తెలుసా?

సుందర: ఏం తెస్తాడు ?

కృష్ణ : విశ్వమానవ కల్యాణం ! సర్వమానవ సౌభ్రాతృత్వం ! ఆ టాపిక్ తెచ్చి మాట్లాడుతాడు. మరింక చూసుకో మనమెలా ఉంటుందో.

సుందర: సైబీరియా వెళ్ళినట్టుంది.

కృష్ణ : అందుకే వీడి మాటలు వింటుంటే నాకు రిస్కు తెగ వొస్తుంది. చేతలు చూస్తే బాబుది, సుక్కే మన వైపే ! అక్కడికైతే, వాడి ఉద్దేశం ఏమిటనుకున్నావ్: వాడు తాగితే వాడు దేవదాసు: మనం తాగితే మనం మందుభాయీలం. నాచ్ గర్లు దగ్గరకెళ్తే వాడు విప్ర నారాయణుడు, మనం రాసపత్తులకు రాసలం, జూదానికి వాడు ధర్మ రాజు: మనం శకుని మామలం. అదీ వాడభిప్రాయం. వాడిదంతా పెద్ద సుపీరియర్ ప్లేన్. ఎంత సుపీరియర్ ప్లేన్ అయినా, చెడ్డచెడ్డ సేవిరా బ్రదర్, కాదంటావా ?

సత్యం : కాంగ్రాచులేషన్స్‌రా. నన్ను బాగా స్టడీ చేసేవు. అవును, చెడ్డ చెడ్డే ! చెడ్డకో రాజీకొచ్చేను. దెబ్బతింటాను. నాకు తెలుసు.

కృష్ణ : నిజం చెప్పేనా లేదా ?

మధు : చెడ్డని వీడు బాగా స్టడీ చెయ్యగలడండీ, సుందరంగారు.

సుందర: మిస్టర్ మధు ! మీరు తీసుకుంటారా, తీసుకోరా అమృతం?

మధు : చెప్పేను కదూ.

సుందర: అయితే మేమూ మానేస్తాం. మానేద్దాంరా. మానేద్దాంరా.

కృష్ణ : మానేద్దాం.

సత్యం : ఒరే మధూ! ఒక్క గుక్క తాగు, కంపెనీకి, ఊ, కానియ్ !

కృష్ణ : నలుగురితోపాటు నారాయణ.

సత్యం : నిన్నేం పెద్ద దుర్మార్గం చెయ్యమన్లేదు కదరా.

కృష్ణ : నిన్నేం పేకాటాడమన్నామా?

సుందర: అబద్ధా లాడమన్నామా?

సత్యం : కొంపలు కూల్చమన్నామా?

సుందర: కమాన్ మిస్టర్ మధూ ! మరింక మీరు కాదనటానికి వీల్లేదు.

మధు : ఒద్దు సార్ !

సుందర: ప్లీజ్ షటప్ ! చనువు తీసుకున్నానని మరోలా అనుకోకండి. మీరు మళ్ళీ కాదన్నారంటే మీకు బలవంతాన ఈ బుడ్డికి బుడ్డి పట్టించేసి, మేం ముగ్గురం కార్లో వెళ్ళిపోతాం. కాసుకోండి.

మధు : అదికాదు సార్ !

కృష్ణ : కానీరా మధూ ! వాడికోపం వచ్చిందంటే వచ్చిందే. అన్నంత పనీ చేసేస్తాడు.

సత్యం : కొంచెం తీసుకోరా.

మధు : అయితే....అతి కొంచెం. నా కెక్కువద్దు.

సత్యం: రైటో !

సుందర: జయ్ కొత్రా కృష్ణా !

కృష్ణ : జయ్ శ్రీ మధుగారికీ....

సుందరం అండ్ సత్యం: జయ్ !

(ఇప్పట్నుంచి సీసా విప్పడం, గ్లాసులో పోసుకోవడం, సోడాలు కలపడం జరుగుతుంది)

సుందర: (మధూని ఉద్దేశించి) మీలాటివాళ్ళని ఆర్మీకి తీసుకుపోవాలండీ.

కృష్ణ : అంతరాత్మ నాన్సెన్సంతా అక్కడ పిండిపారేస్తారు. తాగూ అంటే తాగు; చంపూ అంటే చంపు. అంతే! నోరెత్తడానికి వీల్లేదు.

సుందర: (విస్కీ సీసా ఒక చేతిలో వుండగా, రెండో చేత్తో తుపాకి తీసి) మందూ, మందుగుండూ రెండూ వుంటేనే కథ నడుస్తుంది. (తుపాకి ప్రక్కన పెట్టేస్తాడు).

సత్యం: మందుగుండు మీది, రక్తమాంసాలు మావి.

కృష్ణ : తీసేత్రా వీడి థీరీ! ప్రపంచ శాంతిమీద మనకింక ఓ గంట సేపు చింకి లెక్చరు ఇస్తాడు. నాకు తెలుసు.

సుందర: సోడా సరిగా పాళంగా పట్టేరా. మధూకి మాత్రం సోడా ఎక్కువ్వెయ్.

కృష్ణ : జీ !

సుందర: అంతా రెడీ !

కృష్ణ : రెడీ ! ఇంక కార్యక్రమం ప్రారంభిద్దాం.

సుందర: (గొంతుక సవరించుకొని) డియర్ ఫ్రెండ్స్, ఎన్డ్ ఫెలో మూజర్స్ !

కృష్ణ : నా ప్రియమైన స్నేహితులారా, సుందు మిత్రులారా!

సుందర: వుయ్ షెల్ నౌ స్టార్టు డౌట్ ఆన్ దిస్ ఆల్కహాలిక్ అన్వే న్చర్ !

కృష్ణ : మనం ఇప్పుడు హంమకొట్టడానికి ముందడుగు వేస్తున్నాం. కదన రంగంలో కురుకుపున్నాం.

సుందర: బిఫోర్ వుయ్ బిగిన్ ది అడ్వాన్స్, ఐ యామ్ హాపీ టు టేక్ ఇన్ టు అవర్ ఫోల్డు దిస్ అవర్ న్యూ ఫ్రెండ్ మిస్టర్ మధు.

కృష్ణ : మనం కొద్ది క్షణాల్లో అటాక్ ప్రారంభిస్తాం. ఈ శుభసమయంలో కొత్తమిత్రుడు మధుగాడికి మన 'వెల్కమ్'. వారు-అంటే మన మధూగాడు-మందు 'గాంగ్'లో చేరడం మా అందరికీ ఆనంద దాయకంగా ఉంది. ఒక్కసారి అందరూ చప్పట్లు కొట్టండి.

అందరూ : (చప్పట్లు కొడతారు)

సుందర : ఇవాళ ఎన్నో తారీకు?

సత్యం : మే నెల ఇరవై మూడో తారీకు.

సుందర : అన్ దిస్ ట్వెన్టీథర్డు డే ఆఫ్ ది మన్తు ఆఫ్ మే....

కృష్ణ : ఈమే నెల ఇరవై మూడో తారీకు.

సుందర : అవర్ గుడ్ ఫ్రెండ్

కృష్ణ : మన సుమిత్రుడు

సుందర : మిస్టర్ మధు

కృష్ణ : మన మధుగాడు

సుందర : షెల్ నో ఆల్ అబౌట్ ఆల్ ది బాటిల్డ్ మిస్టరీస్.

కృష్ణ : సీసా రహస్యాలన్నీ తేటతెల్లముగా తెలుసుకొనును.

అందరూ: (చప్పట్లు కొడతారు)

మధు : నాకేమిటో భయం వేస్తోందండీ.

కృష్ణ : అపశకునం పలక్కురా బాబూ !

మధు : భయంగా ఉందిరా.

కృష్ణ : అందుకే కొట్రా విస్కీ. కొడ్తే భీరులు ధీరులవుతారు.

సుందర: మనుషులు మహా మనుషులవుతారు.

సత్యం : ఎలుకలు పందికొక్కు లవుతాయి. మరేం భయపడకు.

సుందర: (గ్లాసు చేత్తో ఎత్తుతాడు. అందరూ ఎత్తుతారు) టు ది హెల్త్ ఆఫ్ మిస్టర్ మధు (అందరూ గ్లాసులు క్లిక్ చేస్తారు. తాగుతారు)

కృష్ణ : ఆహా ఏమి వాసన్రా ! గుమ్ గుమ్.

సత్యం: ఏమిరా మధూ, ఎలా వుంది ?

మధు : అదోలా వాసనేస్తోందిరా.

కృష్ణ : వెల్లుల్లి వాసనా ?

మధు : అటువంటిదే.

కృష్ణ : ఉల్లి చేసిన మేలు తల్లి చేయదు. మరేం ఫరవాలేదు. అలా నెమ్మదిగా చప్పరించు. 'ఇంజ' నచే హీ ఎక్కుతుంది.

సుందర: కిక్కు 'స్లో'గా ఎక్కనీయండి.

సత్యం: చలికాలంలో కుంపటిముందు కూర్చున్నట్టు లేదురా ?

కృష్ణ : ఇంకొంచెం వేస్కోతే, రగ్గేసుకు మాలత్తో మాట్లాడి నట్టుంటుంది.

సుందర: మాలతి గురించి ఇప్పుడు చెప్పండి మిష్టర్ మధూ !

[మధు: ఏం లేదండి. వీళ్లేవో నన్నొట్టినే ఏదోలంటారు. నేను మాలతి నేం చెయ్యలేదు.

సత్యం: పిచ్చాస్పత్రికి పంపించే వంతే! ఎధవా నోర్మయ్ !

కృష్ణ : ఆమ్మో! ఈ మధుగాడిలా మెత్తమెత్తగా ఉన్నాడనా! వీడికో గొప్ప దేంజరు, ఒరే సత్తిగా, వీడు మొన్న ఏం చేసాడో తెలుసా ?

మధు : నేనేమిటి చేసేను ! ఏం చెయ్యలేదు.

కృష్ణ : వీడు కొంపత్తీసే కొరివేకాదు : త్రైరు మాస్టర్ జనరల్ కూడాను. మొన్న మా ఇకనామిక్స్ లెక్చరర్ ఇంటికి ఏం మోసుకెళ్ళాడో తెలుసా ?

సత్యం: ఏవిట్రా మోసుకెళ్ళేవు ?

మధు : చీపుళ్ళు !

సత్యం: హోరి ఎధవా !

మధు : కొండ చీపుళ్ళు దొరకలేదంటే తెప్పించి ఇచ్చేను. మరైతే క్రిష్ణగాడు ఏం మోసుకువెళ్ళేడో అడగరేం ?

సుందర: నువ్వేం మోసుకెళ్ళేవురా ?

కృష్ణ : (దుఃఖం నటిస్తూ) చెప్పలేన్రా బాబూ !

సత్యం :<br>సుందర: } చెప్పాలి.

కృష్ణ : చెప్పజాలను.

మధు : చేసిన పాపం చెప్తే పోతుంది. చెప్పు ఎధవా !

కృష్ణ : అయితే చెప్పమంటారా ?

సుందర: చెప్పు. ఏం మోసుకెళ్ళేవు ?

కృష్ణ : పిడకల్రా నాయన్లారా, పిడకలు !

సుందర: |
సత్యం : | (నవ్వుతారు)
మధు : |

కృష్ణ : ఏం చెయ్యడంరా బాబూ! ఇంత మహాపట్నం ఉందికాని పెధవది ఈ పాటి పేడా దొరకదు. ఆ పాటి పిడకలూ దొరకవంటూ వాడి పెళ్ళాం వాటికోసం వేటాడి వేటాడి విసిగిపోయింది. అలిసి పోయింది.

మధు : అలిసిపోతే మనవాడు వెళ్ళి బండెడు పిడకల్తో పీద తీర్చేడు.

కృష్ణ : ఏంచేస్తాం ? నుదుట రాసిపెట్టేడు బ్రహ్మదేవుడు.

సుందర: ఏమని ?

సత్యం : పిడకలు మొయ్యమని.

సుందర: అయితే ఇకనామిక్సంటే పిడకలూ, పీపుళ్ళు అన్నమాట.

మధు : మామూలు పీపుళ్ళు కావు. కొండ పీపుళ్ళు. వాటికోసం వెతకలేక చచ్చేను.

సుందర: మరైతే పాలిటిక్సంటే ఏమిటి ?

మధు : ఇచ్చకాలూ, పోటీలూను.

కృష్ణ : చెవి కొరికేస్తేకాని వాడికి తనివి తీరదు.

మధు : మనం వాడి చెవులు కొరికేస్తే, వాడు తిన్నగా వెళ్ళి అవతల వాళ్ళ పీకలు తీసేస్తాడు-అంటే-మార్కులు కోసేస్తాడు.

కృష్ణ : అలాగే హిస్టరీ అంటే ఏమిట్రా మధూ ? కొంచెం చెప్పుము.

మధు : హిస్టరీ అంటే మందులు.

కృష్ణ : వాడికి పెళ్ళామనే మహావృక్షం వుంది. చూడ్డానికి ఆడ భీముడంటే ఆడ భీముడు. ఆ మహావృక్షాన్ని వాడు మందులు పోసి పెంచు తున్నాడు.

మధు : మందులు మనం కొనాలి.

కృష్ణ : పెళ్ళాన్ని వాడు పెంచాలి.

సత్యం : మరింక మా 'లా' వాడున్నాడు !

సుందర: "లా" అంటే ఏమిటి ?

సత్యం : డబ్బు ! వాడికి మరేం అక్కర్లేదు. డబ్బిస్తే, మందులూ, పిడకలూ చీపుళ్ళూ, చీరలూ అన్నీ వాడే కొనుక్కుంటాడు.

సుందర: వాడికి చీరలెందుకూ ?

సత్యం : వాడికి పిడకలు మాత్రం ఎందుకూ? పొయ్యికి పిడకలూ, పెళ్ళానికి చీరలూను.

మధు : చీపుళ్ళెవరికి ?

కృష్ణ : నీకు ? వీపు మీదికి.

సుందర: మిష్టర్ మధూని ఏం అనకండ్రా, మిష్టర్ మధూ ! మీ మాలతి [గురించి చెప్పేరు కారు.]

కృష్ణ : మాలతి గురించి నన్నడుగు. టూకీగా టకటకా చెప్తాను.

సత్యం : మరేంలేదు. భగ్నప్రేమ. పగిలినగుండె. చెదిరిన మనసు. అదీ ఆమె వృత్తాంతం.

కృష్ణ : మరింక మధూగాడి సంగతి చెప్పాలంటే !

మధు : నీ సంగతి నిజంగా చెప్పాలంటే కొంపల్మిస్తే కోరివ్వి.

కృష్ణ : మధూగాడు చాపకింద నీరు.

మధు : క్రిష్ణగాడు జేబులోని తేలు.

సుందర : (చప్పట్లు కొట్టి) బ్రిలియంట్ ! బ్రిలియంట్ !

సత్యం : ఒరే రాస్కెల్, మీ ఇద్దరికి ఆలయాలు కట్టించాల్రా !

సుందర : ఆలయా లెందుకూ ?

సత్యం : నిజం చెప్పినవాడు భగవంతునితో సమానం. వెధవలిద్దరూ ఎంత నిర్భయంగా నిజం పలికేస్తున్నారో చూడు.

సుందర : అవా అన్నావు ? బ్రిలియంట్ ! బ్రిలియంట్ !

కృష్ణ : ఓహోహో ! అక్కడికీ సత్తిగాడు పెద్ద మహాత్మాగాంధిగారైపోయి నట్టు ! ఒరే! సుందరం! వీణ్ణి నమ్మకురా. వీడికి నువ్వంటే ఇష్టం లేదు. నన్నడుగు నే చెప్తాను.

సుందర: పర్మిషన్ ఇచ్చేను. ఏం చెప్తావో చెప్పు.

మధు : వీడేం చెప్తాడు ? అబద్దాలప్ప ! సుందరంగారూ, మీరువెళ్ళి ఒక్క సారి చూడండి. మా పాలిటిక్స్ లెక్చరర్‌కి చెవులుండవు. వీడే కొరికేసేడు. వీడి చాడీలు విని వాడు రోజూ నాకడి పీక కత్తిరించేస్తు న్నాడు. వీడు జేబులోని తేలు.

కృష్ణ : చాపకింద నీరు వెధవా నోర్మూయ్ ! నీ కూడా సత్తిగాళ్ళాగే చెప్పలేనంత జెలసీ.

సత్యం : ఒరే కరటక దమనకులూ ఊరుకోండి.

కృష్ణ : చెప్పేది చెప్పనివ్వడురా సుందరం, ఈ మధుగాడూ! నే చెప్పే దేమంటే ఈ సత్తిగాడికి నువ్వంటే జెలసీ.

[మధు : అదే నే నంటున్నదీను.

సత్యం : పిల్లికి ఎలక సాక్ష్యం]

సుందర: [మిస్టర్ మధూ' నేనంటే సత్యంగాడి కిష్టంలేదని ఇందాకట్లా అన్నావు.] ఎందుచేత [ఇష్టం లేదన్నావ్] ?

కృష్ణ : నువ్వు! సార్వభౌమరావుగారి కొడుకువి. ఒక్కడే కొడుకువి. నీకు తల్లిలేదు. అన్నదమ్ములేరు. అప్పచెల్లెళ్ళు లేరు. మరింక మీ బాబు ఆస్తంతా నీకే వస్తుంది కద !

సుందర: అది నా అదృష్టం.

సత్యం : ఒరే సుందరం ! చెప్తున్నా విను. నాకు మనుషులంటే ఇష్టం. డబ్బంటే ఇష్టం లేదు. నిన్ను నాచు చుట్టేసినట్టు చుట్టేసింది డబ్బు. వీళ్ళకి నాచు కావాలి. నాకు మనిషి కావాలి క్రిష్టగాడికైతే, నాకు తప్ప మరోటక్కర్లే లేదు.

మధు : నాకు రెండూ కావాలి.

కృష్ణ : అవున్రా సత్తిగా. సుందరంగాడు గొప్పవాడు కాబట్టి వాడివెనకాతల తిరుగుతున్నాను. అంతేనా నీ అభిప్రాయం ?

సత్యం: ముమ్మాటికి అంతే.

మధు : బాగా ఇచ్చేవురా సత్యం, క్రిష్ణగాడికి డోసు !

కృష్ణ : షటప్ రా మధూ ! షటప్ అంటే షటప్! ఎవడు తంతానంటేవాడి సైడుండే వెధవ్వి నువ్వూ మాటాడ్డమే ?

సుందర : చాలించండి. మరింక ఈ టాపిక్ ఎవరూ తేవద్దు. మిస్టర్ మధూ గ్లాసు పట్టండి.

మధు : మళ్ళానా ?

సుందర: లాగించండి.

సత్యం : వాణ్ణి అడక్కండి. గ్లాసు నింపడమే నీ పని. తాగరా మధూ.

మధు : మీ ఇష్టం అయితే ! నా తప్పేంలేదు. ఏం జరిగినా మీదే తప్పు.

కృష్ణ : అవతల వాడిమీద తప్పు తోసేడానికి. వీడు గురువు - మాలతిని కొశన్లో ఏంచేసేడు ? నాది కాదు మా అమ్మది తప్పంతా అన్నాడు.

సుందర: మాటికి మాటికీ ఈ మాలతి మాట తెస్తున్నారు. ఎవరు, ఏమిటి సంగతి ?

కృష్ణ : ఎవరా మాలతి ? ఏమా కథ ? అంతేనా నువ్వడిగేది.

సత్యం : (కృష్ణని ఉద్దేశించి) క్రూడ్ ఫెలో !

కృష్ణ : చాలించండి చాలించండి. 'సత్యమేవ జయతేగారూ ?' మీ పాటి కల్చరు మాకు లేకపోలేదు.

సుందర: [ఇంతకీ మాలతెవరు ?] నాకు చెప్పేరుకాదు. చెప్పి తీరాలిప్పుడు.

మధు : మాలతి నన్ను లవ్ చేసిందండి.

సత్యం : సిగ్గులేదూ, వెధవా. చెప్పుకుందికి ?

మధు : సిగ్గెందుకూ ? నాదేం తప్పులేదు.

కృష్ణ : మాలతి మా జూనియరు. అసలే వెర్రిది.

మధు : వెర్రిదా ?!!

కృష్ణ : ఎంత వెర్రిది కాకపోతే నిన్ను లవ్ చేస్తుంది ? ఒరే, సుందర్ ! ఆ వెర్రిది వీణ్ని లవ్ చేసింది. వీడికోసం మొదట బీచి కొచ్చింది. తరువాత వీడితో సినిమాకొచ్చింది. ఆఖరికి యింటికొచ్చి పెళ్ళాడ మని కూర్చుంది. దాన్తో ఈ వెధవ తారెత్తిపోయేడు. తారెత్తిపోయి కిస్తా యిచ్చేసేడు.

సుందర: ఆఖరికి 'కిస్తా' యిచ్చేసేడన్నమాట ! శభాష్ మిస్టర్ మధూ !

మధు : వీడి సలహా కూడా నేను పాటించానో లేదో అడగండి. అలా చెయ్యాలీ అని వీడే అంతా చెప్పేడు.

కృష్ణ : వెధవా ! నువ్వడిగితే చెప్పేనా ? అడక్కుండా చెప్పేనా ?

సత్యం : ఒకణ్ని మించిన రాస్కెల్ మరొకడు.

కృష్ణ : ఆఖరి కేం చేసేడో తెలుసా ?

సుందర: ఎలా ఒప్పుకున్నాడు.

కృష్ణ : 'మా అమ్మ ఒద్దంది, నన్నేం చేయమంటావ'న్నాడు. ఆ పిల్ల యింటికొస్తే చాలు. ఇంట్లోంచి పీనుగు పోయినట్టు ఏడుస్తూ కూర్చునేది వీళ్ళమ్మ. దానితో పిల్ల బాజోట్ ! తిన్నగా పెళ్ళి పోయింది అదే పెళ్ళిపోవడం ....

సత్యం : ఎక్కడికని అడగండి.

సుందర: ఎక్కడికి ?

సత్యం : పిచ్చాసుపత్రికి. అంత రాస్కెల్ వీడు ! వీడికి (కృష్ణని చూపించి) ఆ రాస్కెల్ సలహా ! చాపకింద నీరొకడు, జేబులోని తేలొకడు. బాగా పెట్టుకున్నారు. వెధవల్లారా, పేర్లు ! మాలతంటే వీడికి ఇష్టమే నట : కాని అమ్మంటే ఎంతో భక్తిట. మాలతిని చేసుకుంటే. అమ్మ నూతిలో పడిపోతాన్రా నాయనా, అందిట. అలా అని చెప్పి వాళ్ళమ్మ నూతిలో పడిపోయినట్టు, కాటికావిణ్ని మోసుకు పోయి నట్టూ, అక్కడావిడ కాలి బూడిదై పోయినట్టూ వలవల ఏడ్చే సేడు, వెధవ ! ఇలాంటి వెధవల్ని షూట్ చెయ్యాలా ఒద్దా !

సుందర: నువ్వు 'సిల్లీ ఫెలో'విరా సత్యం ! మధ్యని నీ కెందుకంతకోపం !

కృష్ణ : హియర్ హియర్ !

మధు : ఈ వెధవకి నే నంటే జెలసీ !

సత్యం : ఈసారి 'జెలసీ' అన్న మాటన్నావంటే తంతాను. మాలతి అక్కడ పిచ్చాసుపత్రిలో రోజూ ఏం చేస్తుందో తెలుసా ? ఇవిగో మధూగాడి గుడ్లు ! పీకేస్తాన్ పీకేస్తాన్ అంటూ గోడలు బక్కి రేస్తోందిట.

కృష్ణ : ఓర్ నాయనో ! నువ్వక్కడికి వెళ్ళకురా మధూ !

మధు : నాన్సెన్స్ ! లవ్ చెయ్యమని దాన్ని నేనేం అడగలేదు. అదే నన్నిలా తినేసింది.

సుందర: ఒరే సత్యం ! నీ గ్లాసు అలానే వుండిపోయింది.

సత్యం : సారీ బ్రదర్ సారీ ! (అంటూ తాగి) టౌను హాలులో పెద్దలు కొందరు ....

కృష్ణ : రౌన్డు టేబిలూ చుట్టూ చేరి ....

మధు : బౌన్సు గ్లాసుతో బౌనౌ నంటూ ....

సత్యం : సీసా ఖాళీ చేసేరయ్యా ! ఏమిటీ ? ?

సుందర: రమ్మా ! జిన్నూ ! బ్రాంకీ ! విస్కీ !

అందరూ: విస్కీ ! !

సుందర: మిస్టర్ మధూ ! మరికొంచెం లాగించు గురూ !

మధు : వేయించండి కొంచెం ! చాలు ! మరికొంచెం అంటారా ? వేయించం డయితే. ఊఁ ఊఁ ! చాలు ; బస్ ! కావి చూడండి సుందరంగారూ! మాలతి, మాలతుందే, మాలతి విషయంలో నాదేం తప్పులేదు. నా అంతరాత్మ నడిగేను.

కృష్ణ : అడిగితే ఏమిటంది ?

మధు : 'నీదేం తప్పులేదు మధూ' అందీ నా అంతరాత్మ. ఎవ్రైమైనా నాకేం ఫరవాలేదు. నా అంతరాత్మ నన్ను తిట్టిందంటే మాత్రం మరింత నేను నేను నేను....ఏం చెప్తున్నానూ ?

కృష్ణ : అంతరాత్మ తిడితే ఏమవుతుం ?

మధు : తిడితే మరింక నేను బతకలేను.

సత్యం : ఈపాటికి చచ్చిపోవలసిందయితే నువ్వు.

మధు : ఈ వెధవ సత్తిగాడి మాట నెవరూ నమ్మకండి. మాలతి పెళ్ళి చేసుకోనంది. 'క్షోను పొమ్మన్నాను?' అలా అనడం తప్పా ? ఈ సత్తిగాడ్ని చేసుకోనంటే, కుంటాడా ? మిమ్మల్ని కుంటామంటే కుంటారా ?

కృష్ణ : ఏం(విం(ట్రా కుంటడం రాస్కెల్ ?

మధు : చేసుకో వొద్దు వొద్దంది నా అంతరాత్మ : నా దెంత మాత్రం తప్పు లేదు. కావలిస్తే చూసుకోండి ! నా అంతరాత్మ, క్లీన్, ఎంత క్లీన్‌గావుందో చూసుకోండి. మరకలేమైనా వున్నాయేమో భూతద్దం రప్పించి వేసి చూసుకోండి ! ఈ సత్తిగాడి మాటలు నమ్మకండి.

సుందర: మిష్టర్ మధూకి అందుకుందిరా ....

సత్యం : ఏమిటి ?

కృష్ణ : తారాజువ్వ ! !

మధు : మీరాగండంతా ! మిష్టర్ సుందర్ ! ఈ సత్తిగాడి మాటలు, ప్లీజ్ డోన్ట్ బిలీవ్ ! నమ్మకండి. వీడో రాస్కెల్. వీడి బాబు చస్తే వీడి మావ( వీణ్ణి పెంచి పోష్ పోషించాడా లేదా ?

సత్యం : అయితే ?

మధు : అలా ఆగు !

కృష్ణ : ఆగి విను !

మధు : పోష్ పోషంచేడు. చదువు చెప్పించేడు. కారు, కారడిగినా యిస్తున్నాడు. కారడిగితే ఎవరు యిస్తారు చెప్పండి. మీరిస్తారా ? అరే కిషన్‌కా భయ్యా, నువ్విస్తావా ?

కృష్ణ : కారూ, పెళ్ళాం- ఈ రెండున్నూ అరువు యివ్వబడవు. టర్మ్స్ కాష్ ! నగదు బేరం తప్ప మరో బేరం లేదు.

సుందర: అరే బాస్టర్డ్ ! షటప్ !

కృష్ణ : మాఫ్ కీజియే సర్కార్ ! కారు కాని కారు సర్కారు ! గొప్ప జోకు జోకేను. బ్యూటీ.

సుందర: నోరు మూస్తావా ? తన్నమన్నావా ?

కృష్ణ : శరణు, శరణు.

మధు : మిలటరీ తిరగబడితే నీకు శరణెక్కడ ?

కృష్ణ : అప్పుడు సత్యంగాడి శరణుంటుంది ? ఏంరా సత్తీ ?

సుందర: వాడికే దిక్కు లేకపోతే నీ కెక్కడ ?

సత్యం : ఆ వెధవ నీ కాళ్ళు పట్టుకు పిసకరిస్తాడు. కాని నన్ను శరణ డగడు.

మధు : వీడు- ఈ సత్యంగాడు-వీ డన్ని యిలాటి వెధవ మాటలే! అంటే నేనూ క్రిష్ణగాడూ నీ పైసా నీ సీసా నీ వేషం చూసి సేవ దాసులం అని వా డభిప్రాయం, వీడు రోగ్ !

సత్యం: నోరు ముయ్యండి వెధవల్లారా !

మధు : మావఁ మీద బతికేస్తున్నాము కాని, మావఁ కూతుర్ని మాత్రం పెళ్ళాట్టం.

సుందర: వీడి మావఁ కూతురంటే, ఆ జాంబవతీ కన్యేనా ?

సత్యం : షటప్ !

మధు : బాగా చెప్పేరు. ఏదీ చిన్న 'షేకు !' (అని సుందరరావుతో చేసు లొకసారి కలిపేడు) ఆ అమ్మాయే !

కృష్ణ : చీకటిలోనే చూడవలెను.

మధు : ముసుగువేసి చూపించవలెను.

కృష్ణ : గొరిల్లా ఆర్మీకి పంపించవలెను.

సుందర: గొరిల్లా కాదురా రాస్కెల్, గెరిల్లా గెరిల్లా !

సత్యం : ఓరా పిల్ల సంగతి ఎత్తేరంటే తంతాను.

మధు : పాపం డబ్బు కావాలి కాని, కూతురక్కర్లేదట.

కృష్ణ : దేశ దేశ సేవ చేస్తాట్ట. అందుకోసం యిప్పుడప్పుడే పెళ్ళిచేసు కోట్ట.

మధు : ఇలాంటి కిటుకులు మనకి తెలీవుట్రా క్రిష్ణా ! ఈ సత్యంగాడి సంగతి నన్నడుగు. నే చెప్తాను. వీడు ...

కృష్ణ : దుర్మార్గపు వెధవ.

మధు : కాదు, ఓర్వలేని వెధవ.

సత్యం : ఒప్పేసుకున్నాను. చాపకింద నీరుగాళ్ళనీ, జేబులో తేలుగాళ్ళనీ చూసి నేను ఓర్వలేను.

మధు : ఒప్పుకోక ఏం చేస్తావు ?

కృష్ణ : ఒరే సుందర్ ! నేనోటి చెప్తాను విను. నువ్వూ, నేనూ సత్తిగాడూ ఎప్పటి స్నేహితులం ? అయిదో క్లాసులో-ఆ తరవాత నువ్వు దెంగుటూరు వెళ్ళనే వెళ్ళిపోయేవు - అయిదో క్లాసులో నిన్నోసారి వాడు తన్నేడు. జ్ఞాపకం వుందా ?

సుందర: నేను కూడా వాణ్ని తన్నేను.

సత్యం : ఉడుక్కుని రాయి విసిరి కొట్టేవు వెధవా !

సుందర: షటప్.

కృష్ణ : అయినా వీణ్ని క్షమించి తరవాత మనతో స్నేహం చెయ్యనిచ్చేం. అవునా ?

సుందర: అవును.

కృష్ణ : మనం ఫ్రెండ్సవేంనా ?

సత్యం : కాదని ఎవడన్నాడు ? మళ్ళీ మిమ్మల్ని ఎప్పుడైనా తన్నేనా ?

కృష్ణ : నువ్వలా వుండరా !

మధు : కిషన్ భయాంని మాటాడన్నేరా సత్తిగా !

కృష్ణ : ఫ్రెండ్సులో మనకీ మనకీ జెలసీ వుండొచ్చురా ! నీ షావరు పార్ల మెంటు మెంబరయేడు, లక్షాధికారయేడు. నువ్వు ఆర్మీ ఆఫీస రయేవు. కావలిస్తే రిజైనిచ్చేసి కాలుమీద కాలువేసి కూర్చోగలవు. అది నీ అదృష్టం.

మధు : కరెక్టు !

కృష్ణ : వాడినాబు వాడి చిన్నప్పుడే కునికేసేడు. అప్పుడు వీడు మాంవ పంచని చేరేడు. అది వాడి దురదృష్టం.

మధు : కరెక్టు. అయినప్పుడు వాడికెందుకా జెలసీ ?

కృష్ణ : ఇప్పుడు నే నున్నాను.

సత్యం : ఎందుకు వుండడం ?

మధు : నువ్వుండ్రా సత్తిగా ! చెప్పరా కిషన్ ! వినంతి మిస్టర్ సుందర్ !

కృష్ణ : ఇప్పుడు నే నున్నాను. నేను పాపరు వెధవని, కుచేలుడి కొడు కుని. నువ్వు రారాజు కొడుకువి. రాక్ ఫెల్లర్ తమ్ముడివి. అయితే, నువ్వంటె నాకు జెలసీ వుందా ?

సుందర: లేదు లేదు. నువ్వు నాకు డియరెస్టు ఫ్రెండువి.

సత్యం : వీడు నీకు తైరుపోస్తాడు. వీడి బాబు నీ బాబుకి తైరుపోస్తాడు. తైరు అనగా మస్కా. మస్కా అనగా కాకా. కాకా అనగా క్రౌ కాచింగ్ ! అదీ సంగతి.

కృష్ణ : బాబుల సంగతి తే కొరే !

సత్యం : తెస్తాను. ఏం చేస్తావు ? నీ ఫాదరు ఈ సుందరంగాడి ఫాదర్ శ్రీశ్రీశ్రీ సార్వభౌమరావుగారికి రోజూ రెండు శేర్ల చిక్కటి తంజావూరు తైరు పోస్తాడు. గోదావరి జిల్లా అసలు మస్కా రాస్తాడు, పొద్దున్నా, సాయంకాలవూను, రెండు పూట్లానూ.

కృష్ణ : షటప్ ! నీ సంగతి నేను చెప్పలేనా ?

సుందర: వాడి ఫాదర్ సంగతి ఎత్తకురా సత్యం !

సత్యం : ఎత్తుతాను. ఏం చేస్తాడు వాడు ?

మధు : ఏం చెయ్యలేడు కాబట్టి వాడిమీద దాబు చెయ్యగలవు. అంతేనా ?

కృష్ణ : నేను తల్చుకుంటే, వీడు అరనిమిషంలో మసి ! అరనిమిషంపట్టదు. ఇరవై మూడుంపావు సెకండ్లలో మసి !

సత్యం : పోరా పోరా, జేబులో తేలూ ! 'జేబులో తేలు' గొప్ప పేరు ! బాగా పెట్టుకున్నావురా !

కృష్ణ : చూడ్రా నువ్వు మసి కాకపోతేను. స్పేర్ చేసిన కొద్దీ మా మీద 'రైడ'యి పోతున్నావు. అరే సుందర్ ! నువ్వు వాడికి ఫ్రెండు వేనా ? వాడికి చనువిచ్చి నెత్తి కెక్కించుకున్నావా ? అయితే, వీడికి నువ్వంటే పీకల్దాకా వుంది కుళ్ళు. మీ ఫాదర్ పార్లమెంటు మెంబరైతే వీడి ఏడుపు ఏం చెప్పను ?

సత్యం : సుందరం అంటే నా క్కోపం లేదు.

కృష్ణ : కాని, వాడి నాయన్ని చూస్తే మాత్రం అక్కసు. అంతేనా ?

సత్యం : అది పరమ సత్యం. ఈ ఒక్కసారికి నిజం పలికేవు.

కృష్ణ : చూసేవా : మీ ఫాదర్ ఓట్లు కొనుక్కున్నాట్ట. దొంగ వోట్లు వేయించుకున్నాట్ట. పేటలు పేటలుకి పీపాల్తో సారా పట్టించేసి, జయ్ కొట్టడం మాత్రం గాంధీ మహాత్మాకి జయ్ కొట్టేట్ట. శ్రీరామ చంద్రుళ్ళా కబుర్లు చెప్తాడు. కాని, రావణాసురుళ్ళా మీ సుశీలని....

సుందర: మా....మా....మా సుశీల పిన్ని ?

కృష్ణ : ఆఁ, మీ సుశీల పిన్నే ! ఆవిణ్ని పెంచిన వీలు చూసుకొని చిన్న పిల్లప్పుడే పాడుచేసి దగ్గర వుంచుకున్నాట్ట !

సత్యం : మరొకడా వయసులో వున్న పిల్లని పాడుచేస్తే దాన్నే — 'రేప్' రేప్ అంటారు. పదేళ్ళు జెయిలుంది, ఆ పనికి.

సుందర: (గ్లాసు ఎత్తిపెట్టి ఒక్కసారి తాగి) నువ్వివాళ మసిరా రాస్కెల్ !
(అన్నాడు సత్యాన్ని వుద్దేశించి)

కృష్ణ : మిమ్మల్ని ఎన్ని మాటలన్నాడో చూసేవా :

సుందర: నా సుశీల పిన్నిని....మా సుశీల పిన్నిని....

సత్యం : నీ కావిడ ఎటువంటి పిన్నిరా ఫూల్ ! నీ పాద రావిణ్ని, గతిలేని మనిషిని చేరదీసి. పాడుచేసి సాకుతున్నాడు. నీ వయసు దావిడ.

సుందర: షటప్ ! నాకంటే రెండేళ్ళు పెద్ద. మా ఫాదరు ఆవిణ్ని పెళ్ళాడితే ఆడతాడు. లేకపోతే లేదు. డఁఁర్కో ముష్ ముష్ ముష్టి వెధవలు, మా గురించి మాట్లాడ్డానికి వీల్లేదు, వీల్లేదంతే.

సత్యం : ఆడవాళ్ళని పాడుచెయ్యడం పెద్దమనుషుల లక్షణం కాదు. కావలిస్తే పెళ్ళాడమను !

కృష్ణ : ఆయన యిష్టం వచ్చినట్లు ఆయన చేస్తారు. నువ్వెవడివి చెప్పడానికి, మధ్యని :

సత్యం : నేను సత్యాన్ని.

సుందర: నోర్మయ్ !

సత్యం : నేను నిజం చెప్తాను.

మధు : ఒహో ! ఒహో !

కృష్ణ : గాంధీగారు ఆకాశంలోంచి దిగేరు !

మధు : మహాత్ములు మట్టిలోంచి పుట్టుకొచ్చేరు !

సుందర: మహాత్మా గిహాత్మా జాన్తానై ! నన్ను, మా ఫాదర్ని, మా కుటుంబాన్ని, మా బంధువుల్ని, స్నేహితుల్ని, ఆశ్రితుల్ని మాలో ఎవర్నయినా సరే, ఎత్తిపెట్టి ఎదిర్చిన వాడల్లా సఫా !

సత్యం : నన్నాపడానికి నీలాటివాళ్ళుపనికిరార్రా బ్రదర్ ! దేవుడు దిగొచ్చినా లాభంలేదు. నువ్వెంత ? నీ ఫాదరెంత ? నీ ఫ్రెండ్సు ఈ వెధవలెంత ?

సుందర: నిన్ను చంపేస్తారా రాస్కెల్ !

సత్యం : షటప్ ఇడియట్ ! నువ్వూ నీ ఫాదరూను. మీ ఫాదరని వాడి గురించి చెప్పుకుందికి సిగ్గువడాలి నువ్వు.

సుందర: ఒరే !

సత్యం : మీ ఫాదరు....

కృష్ణ : ఒరే సత్యం ! నువ్వు మితి మీరుతున్నావు.

సత్యం : మితిమీరి కొవ్వు బలిసి కండకావరంతో తిరుగుతున్నవాడు-నేను కాదు-వాడి ఫాదరు ! వాడి ఫాదరు ప్రజా ద్రోహి ! పబ్లిక్ ఎనిమీ నంబరు వన్.

కృష్ణ : ఒరే సత్తిగా ! డేంజరస్‌గా మాటాడుతున్నావ్ !

సుందర: పీ డీ రోజున సఫా !

సత్యం : కాని. వీడి ఫాదరు ఎంత పార్లమెంటు మెంబరయినా, ఎంతటి పెద్దపులయినా, అమాయకత్వానికి ఎన్నాళ్ళు కళ్ళు మూయ్యగలడు? ఎన్నాళ్ళు బంగారు సంకెళ్ళతో బంధించగలడు? స్నేహితులారా! ప్రియ మిత్రులారా! ఇప్పుడా సుశీలని సుందరంగాడు సాకుతున్నాడు!

మధు : ఒరే సత్యం! ఏం మాటల్రా ఇవీ? (అని గాభరా పడుతాడు)

కృష్ణ : హోరి రాస్కెల్ !

సుందర: నే....నేనా? మా పిన్నినా? సాకుతున్నానా?!! బాస్టర్డ్! ఏమిట్రా పేల్తున్నావ్?!!

సత్యం : నేను చెప్పేది నిజం! పరమసత్యం! సుశీల పిన్నిట, పిన్ని! సుశీల పిన్నిని సుందరంగాడు సాకుతున్నాడు.

మధు : ఒరే తప్పురా సత్యం !

సత్యం : నువ్వూరుకోరా రాస్కెల్! అమాయకత్వం వీలు చూచుకొని వీడి ఫాదరావిణ్ని పాడుచేశాడు. అమాయకత్వంలోనే యింకా అవిణ్ని వుంచేడు. అది వీలు చూసుకొని మరొక బోల్తా కొట్టించాడు. బోల్తా కొట్టించి వాడు డాకూ నంబర్ వన్! వాడి పేరు సుందరం నంబర్ టూ!

సుందర: నేనా? పిన్నిని పాడు చేసేనా? యు షెల్ పే ఫర్ దిస్? శిక్ష! శిక్ష! శిక్షనుభవిస్తావు. (సీసా ఎత్తి తాగుతాడు)

సత్యం : తాగిన వెధవలా మాటాడకు !

సుందర: నన్ను వెధవనన్నావ్!! నేను ఆర్మీ ఆఫీసర్ని. మా ఫాదర్ గురించి, మా పిన్ని గురించి, నువ్వు....నువ్వు....

సత్యం : నీ గురించి నేనేం అనడంలేదు. లోకంలో లక్షమంది సుందరం గాళ్ళున్నారు. నీ గురించి కాదురా బ్రదర్ నేనన్నది.

సుందర: అన్నావు. నిన్ను చంపేస్తాను.

మధు : మేష్టగారూ ! సుందరంగారూ ! తగ్గండి.

సత్యం : అరే సుందర్ భయ్యా! ? నీ పేరింటిగాడు మరోడున్నాడు. వాడు చిన్న సైజు గుండా, ఛోటా గుండా వాడు. వాడు వేరు, నువ్వు వేరు.

సుందర: నాన్సెన్స్ ! నోర్ముయ్, స్కౌండ్రల్ !

సత్యం : నీ పిన్ని—నీ కావిడ పిన్నీ కాదు. గాడిద గుడ్డూ కాదు—ఆవిణ్ని నీపొదరు మాయచేసి మోసం చేసేడు. అలాగ్గే వాడిప్పుడు మాయచేసి మోసంచేసి సాకుతున్నాడు.

మధు : ఆ మాటలు విత్ డ్రా చేసీరా సత్యం! చేసేస్తాడండీ సుందరంగారూ!

సత్యం : విత్ డ్రా చెయ్యను.

మధు : చేసేరా సత్యం ! నీకు వెయ్యి దండాలు.

సత్యం : నేను విత్ డ్రా చెయ్యను.

మధు : చేసీరా బాబూ ! నాయన్నాయన !

కృష్ణ : విత్ డ్రా చేసీస్తే మాత్రం ! లంజకొడకా అని తిట్టేసి లెంప లేసుకుంటే తీరిపోతుందా ! తెలియ కడుగుతాను.

సత్యం : నోరుమూసుకోరా తైరుపెధవా ! చంపేస్తాను.

సుందర: వాణ్నా బెస్ట్ ఫ్రెండ్ ! నువ్వు రాస్కెల్ వి. నా 'ఎనిమీ' వి, శత్రువ్వి !

మధు : ఒరే విత్ డ్రా చేసీరా ! సత్యం ! బాబ్బాబు !

సత్యం : షటప్ ! లెఫ్టినెంట్ అయితే నాకేం భయం అనుకున్నావా ? ఇక్కడుంది ఆర్మీ ఆఫీసర్లు నా కాలికింద బలాదూర్ !

సుందర : (విస్కీ సీసా ఎత్తిపెట్టి గడగడ తాగి) ఆఖరి సొంటుగుతున్నా నారే !

సత్యం : నీ ఆర్మీ ఆర్మీ అంతా నా కాలికింద బలాదూర్ ! నువ్వు నీ ఫాదరు నీ ఆర్మీ, అన్నీ, అంతా ఉప్పున ఊదేస్తాను. తోకలు పట్టుకు గిర గిర విసిరేస్తాను. డర్టీ డాగ్స్ ! బివేర్ ! ఖబడ్దార్ !

సుందర : సత్యం ! ! !

మధు : ఒరే సత్యం, బాబూ బాబూ ! !

సత్యం : సోర్మయంత్రా రాస్కెల్స్ ! మీరంతా రాస్కెల్స్ ! ఒత్తి రాస్కెల్స్ !

సుందర : చంపేస్తాన్రా ! నిన్ను చంపుతాను.

సత్యం : ఒరే సుందర్ ! నువ్వు మంచివాడివే. మీ ఫాదరు పాడు చేసేశాన్ను. కొంతవరకూ ఖాకీడ్రెస్సు పాడుచేసింది. మరి కొంతమటుకు ఈ పెధవ క్రిష్ణగాడు, ఈ విషపు పెధవ, పాడు చేసేడు. అంచేత అలా పాడయేవు.

కృష్ణ : "ఆఖరికి పింతల్లిని తగులుకున్నావు" అని ఆ మాటకూడా అను ! ఊఁ అదికూడా అను ! భయపడతావేం ? అను !

సత్యం : నిజం అయితే చెప్పడానికి భయపణ్ను.

సుందర : నీ కింక ఛాన్స్ లేదురా సత్తిగా ! ! చంపి తీరుతాను.

సత్యం : పోరా చేరూ ; నీతో నాకు మాటలేవింట ! (అని పక్కకి నడిచేడు)

సుందర : ఆగరా ; స్ స్ స్కౌండ్రల్ ! ఆగు.

సత్యం : పోరా పోరా (అంటూ పక్కకి వెళ్ళిపోతాడు)

సుందర : (విస్కీ పూర్తిగా సీసాలోంచి ఖాళీచేసి, రెండో దాంట్లోంచి కొంత తాగి. ఒక్కక్షణం యిటూ అటూ చూసి) ఆగరాస్ స్ స్కౌండ్రల్ ! ఆక్క పో పో పోతే చ్చంపుతాన్ !(అంటూ సత్యం వైపు పరుగెత్తేడు, చేతిలో విస్కీ బాటిల్ పట్టుకొని.)

మధు : సుందరం ! మిస్టర్ ! మేస్టగారూ !

కృష్ణ : ఒద్దురా సుందర్ ! నువ్వేం అనకు. మీ ఫాదర్తో చెప్తాం. ఒరే సుందరం.

(అని యిద్దరూ పరుగెట్టి ఆ పక్కనే ఆగిపోయి కళ్ళూ, చెవులూ మూసుకుంటారు. పక్కన విస్కీ సీసాతో తలమీద బలంగా కొట్టిన చప్పుడౌతుంది. పగిలిన సీసాపిడి చేత్తో పట్టుకొని, పక్కవాటుగా నడుస్తూ సుందరం తిరిగొస్తాడు. తలంట నెత్తురు కారుతుండగా "దొంగదెబ్బ ! దొంగదెబ్బ ! రాస్కెల్ ! రా రా....రా.... రాస్కెల్ !" అని పక్కదాకా వచ్చి సత్యం పడిపోతాడు)

సుందర : బాస్టర్డ్ ! నీచపు వెధవ. చంపి తీరుతాను !

కృష్ణ : సుందరం ! ఏం చేసేవు ? ఘోరం ఘోరం ! రక్తం ! సత్యం ! ఒరే సత్యం ! అమ్మో నెత్తురు.

మధు : బాబూ బాబూ బాబూ ! నే చూశ్నేను.

కృష్ణ : ఒరే సుందరం రాస్కెల్ (అని గట్టిగా ఊపి) ఏం చేశావో తెలుసా ? రక్తంరా! చూడ్రా చూడ్రా ! అమ్మో రక్తం ! వాటర్ బాటిలేది ? ఏదీ ఏదీ ? ఆఁ యిదిగో ! (అని వాటర్ బాటిల్లో నీళ్ళని సీదాగా సత్యం ముఖంమీద పోస్తాడు. నీళ్ళన్నీ పూర్తవగానే సత్యం కూడా పూర్తవుతాడు) ఒరే సుందరం ! చచ చచ్చిపోయేడ్రా (దూరాన్న మిల్లుకూత వినపడుతుంది)

సుందర : (చేతిలో సీసా పిడిని కింద జారవిడిచి తల పట్టుకుంటాడు)

మధు : (మిల్లుకూత విని) అదేమిటి ఎవరో ఏడుస్తున్నారు.

కృష్ణ : మిల్లుకూతరా వెధవా ! నువ్వేం గోలచెయ్యకు.

మధు : (వణుకుతూ) నేనేం చె చెయ్యలేదు. నాకేం తెలేదు.

కృష్ణ : ఊరుకోరా బాబూ ! కొంప మునిగింది.

మధు : ఊరుకుంటాను, నాకేం కనిపించలేదు నేనేం చూశ్నేదు.

కృష్ణ : నేనూ ఏం చూశ్నేదు ! మనకేం తెలీదు. ఇక్కణ్ణుంచి పోదాం ! రారా సుందర్ ! రా పోదాం !

సుందర : సత్యం, సత్యం, సత్యం ఎక్కడ ?

మధు : ఏమయేదో ఏమిటో నాకేం తెలీదు నే పోతాను. నేను పారి పోతాను. (అంటూ కదలబోతాడు)

కృష్ణ : ఎక్కడికి పోతావురా వెధవా ! ఆగలాగ !

మధు : మా అమ్మ బెంగ పెట్టేసుకుంటుంది. ఇంటికి పోతాను.

కృష్ణ : కదిలేవంటే చంపేస్తానారే !

మధు : వెధవా ! నువ్వే అంతా చేసేవు !

సుందర : ఏఁవిఁటి ? ఏం జరిగింది ? సత్యవేఁడి ? అదేమిటా నెత్తురు ! సత్యవేఁ ? నేనే చంపేసేనా ? నేనే? ? చంపిడవేంఁ ? ?

మధు : గట్టిగా అనకండి బాబూ బాబూ (అంటూ మళ్ళీ చెవులు మూసు కుంటాడు) ఇంటికి పోదాం క్రిష్ణా ! ఇప్పుడెలాగ ? ఆరు మైళ్ళుంది. ఎలా వెళ్ళడం ?

సుందర : గుడ్ గాడ్ ! గుడ్ గాడ్ ! ఘోరం ఘోరం ఘోరం చేసేను !

మధు : నాకు డ్రైవింగ్ రాదు. ఎలాగ ? సుందరం గారూ ! కారెక్కండి. పోదాం పోదాం !

కృష్ణ : (వాటర్ బాటిల్ కిందని పడేసి) వాడిప్పుడు ఏ చెట్టుకో పెట్టేస్తాడు.

మధు : మరైతే ఎలాగరా బాబూ ! ఎలాగండీ సుందరంగారూ.

సుందర : నన్ను మాటాడించకండి. నన్ను మాటాడించొద్దు.

కృష్ణ : సుందరం ! సుందరం ! పోదాం వేగిరం రా ! రారా మధూ పోదాం రా ! నే డ్రైవ్ చేస్తాను. రండి పోదాం.

మధు : నీకు డ్రైవింగొచ్చా ? అమ్మ-బతికేం. రండి పోదాం అయితే ! సుందరంగారూ ! మేవేం చూళ్లేదు. ఇక్కడికి వేం రాలేదు. మాకేం తెలీదు. రండిక పోదాం.

సుందరం : ఎక్కడికి ? స్టేషన్కా ? పోలీసులకి నన్నప్ప చెప్తారా ? గుడ్ గాడ్ ! నే రాను.

కృష్ణ : అక్కడక్కాదురా వెధవా ! ఇంటికి పోదాం మీ ఫాదర్తో అంతా చెప్దాం. ఇంటికి రా ! కారెక్కి పోదాం ! రా !

సుందర : మా ఫాదరు ఊళ్ళో లేడు. నేను రాను. రాన్రాను.

కృష్ణ : ఈ పాటికి రావాలి. మీ ఫాదరూ మా నాన్నా యిద్దరూ కలిసే వెళ్ళేరు. మధ్యాన్నం ఒస్తాం వస్తారు. ఈపాటి కొస్తారు. రా ! వెళ్దాం. పదరా మధూ ! రారా సుందరం ! ఆయనంతా సరిచేస్తారు ! రండి !

(అమ్మో అమ్మో అనుకుంటూ మధుసూధనరావు, గుడ్ గాడ్ అనుకుంటూ సుందరరావు రెండో పక్కకి నడుస్తారు. వాళ్ళ వెనకనే కృష్ణారావు కూడా వెళ్ళి మరొక అర నిమిషం పోయేక తిరిగి తొందరగా వచ్చి, వాటర్ బాటిలూ, తుపాకీ, ఒక విస్కీ సీసా తీసి పట్టుకుంటాడు. పట్టుకుని తిరిగి తొందరగా వెళ్ళి పోతాడు. తరువాత మళ్ళీ వచ్చి సోడాబుడ్లూ టంబ్లర్లూ పట్టుకు పోతాడు)

# 2

సార్వభౌమరావింట్లో అతని పడక గది.పందిరి మంచం వుంటుంది. గోడని ఒక నిలువుటద్దం, ఒక గోడ గడియారం వున్నాయి. ఒక వార బీరువా ఒకటుంది. ఎడమ పక్కని మరో గదిలోకి ద్వారం వుంది. కుడి పైపున ఈ పడక గదిలోకి పైనించి ప్రవేశం వుంది. గది యొక్క మిగతా అలంకరణంతా ధనికులూ సరసులూ అయిన వారి పడగ్గదుల అలంకరణలా వుంది. ఒక వార మేజా, దాని పక్క రెండు కుర్చీలూ వున్నాయి. ఒక వాలు కుర్చీ కూడా వుంది. మేజా మీద ఫోన్ వుంటుంది. సమయం సుమారు పన్నెండు గంటలు. పన్నెండింకా కొట్టలేదు.

పై నుంచి పడగ్గదిలోకి ఏదో ఆలోచిస్తూ ప్రవేశిస్తుంది సుశీల. ఆమె వెనకనే సోమసుందరరావు పిల్లిలా అడుగులు వేస్తూ వచ్చి ఆమె కళ్ళు మూస్తాడు. మూసిన చేతులు తీసేడానికి ఆమె ప్రయత్నిస్తుంది.

సుశీల : (తృళ్ళిపడి) ఎవరు ? ఎవరు ? అని (చేతులు తీసేడానికి ప్రయత్నిస్తుంది)

సోమసుందరరావు : చెప్పుకోవాలి : (నెమ్మదిగా గొంతుకమార్చి అంటాడు)

సుశీల : (మూసిన చేతుల్ని బలంగా లాగేసి, సోమసుందరరావు వైపు తిరిగి క్షణం నిర్ఘాంతపోతుంది. తరువాత గాభరా పడుతుంది) సుందరం ! !

సోమ : ఏమిటా గాభరా ! సుశీల్ని చూడ్డానికొచ్చాడు సుందరం ! ఏం ? రాకూడదా ?

సుశీల : వేగిరం వెళ్ళిపో ! !

సోమ : సుశీలా ! ఇవాళ నిన్ను తీసుకుపోడానికొచ్చాను. నువ్వు లేద్దీ నే వెళ్ళను.

సుశీల : వేగిరం వెళ్ళిపో సుందరం !

సోమ : వెళ్ళను.

సుశీల : ఇప్పుడాయ నొస్తారు.

సోమ : ఎవడొస్తాడు ?

సుశీల : బావ గారొచ్చేస్తారు. వెళ్ళిపో వేగిరం. ఆయన రాకముందే వెళ్ళు ! వెళ్ళవా ?

సోమ ! బా-వ-గా-రు ! ఇదిగో సుశీలా ! ఏడాదయింది. ఇంకెన్నాళ్ళు దాస్తావ్ ? దాస్తే అది న్యాయం కాదు. వాడు మంచో డన్నావు. సరే ఒప్పుకున్నాను. మంచోడికి అన్యాయం చెయ్యడం మరీమంచిది కాదు. ఇవాళ నిన్ను తీసుకు పోదాని కొచ్చాను. ముసిలాడితో యివాళ చెప్పి, "ఇదిగో సాంబశివం రావు గారూ ! బావగారూ ! నువ్వంటే నాకు విశ్వాసం వుంది. కాని ప్రేమ లేదు. అంచేత యిదుగో మా సుందరంతో వెళ్ళిపోతున్నాను" అని చెప్పి ! దాగుడు మూత లెన్నాళ్ళు ? నువ్వు చెప్పలేకపోతే నే చెప్పేస్తాను, రానీ. ముసిలాణ్ణి రానీ. అందాకా నే వెళ్ళను. (అని జోళ్ళు విప్పేసి మంచం మీద కూర్చుంటాడు)

సుశీల : ఒద్దు సుందరం ! ఒద్దొద్దు ! యిప్పుడు కాదు. తరవా చ్చెప్పొచ్చు. నన్నల్లరి పెట్టకు. నీ కిది న్యాయం కాదు. నే నొస్తాను. తప్పక వస్తాను. ఇప్పు డాయనతో నే చెప్పలేను. నువ్విక్కడ కూర్చొని నా పీకల మీదికి తేకు. నా మాట మన్నించు సుందరం ! వెళ్ళు !

సోమ : (మంచం ముందున్న స్టూలు మీద విప్పిన జోళ్ళు అక్కడే అలాగే వదిలేసి, మంచం మీంచి లేచి) సుశీలా ! నీ మాటలు వింటుంటే నాకలా వినాలనే వుంటుంది. విన్నాక మరి నీ కెదుట చెప్పలేను.

సుశీల : సుందరం ! వేగిరం వెళ్ళిక్కడ్నించి. నీకు పుణ్యం వుంటుంది. ఆయ విప్పుడొచ్చేస్తారు నా మాట విను. వెళ్ళిపో ! నీకు కాలేజీ లేదా ? కాలేజీకి వెళ్ళిపో ! చదువిలా ఎగ్గొట్టకూడదు.

సోమ : కాలేజీలేదు, గీలేజీలేదు. నీతో అన్ని సంగతులూ చెప్పేద్దామని వచ్చేను. ఇష్టం వుంటే ఒప్పుపుగాని లేకపోతే లేదు. మాటాడ్డాని కైనా నాతో రా యిప్పుడు.

సుశీల : ఇప్పుడుకాదు. ఇక్కడొద్దు. నువ్వు కాలేజీకి వెళ్ళిపో !

సోమ : ఇవాళాదివారం కాలేజీ ఉండదుకద. అయినా నాకు చదువొద్దు. నాకది రాదుకూడాను. నిజం చెప్తున్నాను.

సుశీల : అలా అనకు. చదువుకో. వెళ్ళు ! వెళ్ళు బాబూ !

సోమ : చదువున్నా లేకపోయినా నాతో వచ్చేస్తావా ?

సుశీల : ఒస్తాను. తరువాత మాట్లాడదాం ఇప్పుడు వెళ్ళిపో !

సోమ : (నవ్వుతూ) సెబాస్ ! వస్తావా ? మరి నువ్వుంటే నాకు చదువక్కర్లేదు, 'చదువూ ! నీకు గుడ్‌బై ! టటా లలా' అంతే ! మా ఫ్రెండు జానీగాడున్నాడు....

సుశీల : సుందరం !

సోమ : ....వాడికి లాటరీ బహుమతే పెళ్ళాం కూడా అక్కర్లేదు. అలా, నువ్వుంటే నాకింకేం అక్కర్లేదు. నువ్వు నా లాటరీ బిల్లవి !

సుశీల : సుందరం, పోలిపిల్లి వింటాడు. ఒస్తాడో ఏమిటో ?

సోమ : వాడెవడు ? నీ నౌకరేనా ? ముసిలాడు ముందు వరండాలో పడుకున్నాడు. మరేం భయంలేదు.

సుశీల : కాసేపట్లో బావగారొస్తారు. వచ్చే వేళయిందప్పుడే.

సోమ : ముసిలాడు నీకు బావెలా అవుతాడు ? పెంచినవాడు తండ్రి అవుతాడు. పెళ్ళాడేవాడు బావవుతాడు. వాడుకాదు నీ బావ, నేను !

సుశీల : సుందరం ! మెల్లిగా ! మెల్లిగా మాటాడు.

సోమ : (మెల్లిగా) నువ్వు నా లాటరీ బిల్లవి. నా కోవా బిళ్ళవి. నా జున్ను ముక్కవి.

సుశీల : ఆయ నొచ్చేస్తారు. ఏఁవిఁటీ మాటలు !

సోమ : నువ్వు జమునాకీ రాణివి ! నేను రాధాకా రాజుని: నే నిప్పేటానుని ! నువ్వు ఆలీను రాణివి !

సుశీల : సుందరం ! ఏఁవిఁటీ రౌడీ మాటలు !

సోమ : నేను రౌడీల రాజుని. రా పోదాం : ఇన్నాళ్ళూ రౌడీల రాజునే ! కాని మరింక అలా వుండను. ఇప్పుడె పోదాం. నీ కోసం మారిపోతాను. ఉద్యోగం చూసేను. రేపు ఫస్టు తారీకు నుంచి స్టార్టింగ్ !

సుశీల : ఉద్యోగం ఏఁవిఁటీ ? ఎవరికి ?

సోమ : నాకే ! ఇన్నాళ్ళు బేవార్సుగా తిరిగేసేను. ఇప్పుడింక అలా క్కాదు. మెకానిగ్గా పని చెయ్యగలను. చేస్తాను. రేపు ఫస్టునుండి రెడీ బాటరీలో వుంటాను.

సుశీల : మెకానిక్ ఏఁవిఁటీ ? రెడీ బాటరీ ఏఁవిఁటీ ? చదువుకోవా ఏఁవిఁటి ?

సోమ : చదువుకోను. నువ్వుంటే నాకు చదువక్కర్లేదు. రా పోదాం. రా వేగిరం ! సుశీలా, రా ! వస్తానన్నావు రా. రయ్యిఁ మని ఎగిరి పోదాం. రా !

సుశీల : ఎగిరిపోదాం. ఇప్పుడుకాదు. అసంవప్పంగా మాటాడకు. తరువాత మాటాడుకుందాం.

సోమ : ఎప్పటికప్పుడే అలానే అంటున్నావు. ఏదీ తేల్చవు. ఇప్పుడిప్పుడు ఒచ్చేస్తా నన్నావు. మళ్ళీ ప్లేటు ఫిరాయిస్తున్నావు. సుశీలా ! రా ! ప్లేటు మార్చకు. రా నాతో.

సార్వభౌమరావు : (ఇంట్లో కొంతదూరం నుంచి) అప్పన్నా ! సూకరాజూ ! ఎక్కడర్రా, రాస్కేల్స్ !

సుశీల : చచ్చేను. ఆయనొచ్చేరు !

సోమ : నాతో ఒచ్చి !

సుశీల : అమ్మో ! రాను : నువెళిపో ; నా మాట విను : నన్ను చంపేకు !

సోమ : రావా ?

సుశీల : రాను. తరువాత మాటాడదాం.

సోమ : రావా ? నన్ను చూస్తే ఇష్టవే౹ నన్నావు ! రా సుశీలా !

సుశీల : వేగిరం వెళిపో బాబూ !

సోమ : రావా ? నాతో రావా ?

సుశీల : రాను.

సోమ : ముమ్మాటికీ, రావా ?

సుశీల : రాను. ఇప్పుడ్రాను. అయనొచ్చేసేరు. సుందరం !

సోమ : హాయిగా వుండొచ్చు. రా పోదాం. ఒస్తానన్నావు ! రా పోదాం

సుశీల : ఇప్పుడు కాదు.

సోమ : ఇప్పుడు అటో ఇటో తెల్చుకోలేన్దానివి మరెప్పుడూ తేల్చుకో లేవు నామాటవిని నాతో ఒచ్చి నీ కోసం మంచివాణ్నవుతాను రా పోదాం! ఇక్కడుండొద్దు. రా పోదాం! నేనంటే ఇష్టవే౹కదా ? మరి రా పోదాం ! సుశీల రా పోదాం ! పనిచెయ్ అంటే పని, చదువుకో అంటే చదువు—ఏచ్చెయ్యమంటే అదే చేస్తాను. రా పోదాం ! నువ్వు ప్రాణాలిమ్మంటే రైట్ కరెక్టనేసి యిచ్చేస్తాను. రాపోదాం! సుశీలా, రా పోదాం రా ! సుశీలా !

సుశీల : వెళ్ళిపో సుందరం, నామాట విను. అయనొచ్చేస్తారు.

సార్వభౌమరావు : (ఇంకా దూరంనించే) సుశీలా !

సుశీల : అరుగో !

సోమ : రావా, అయితే.

సుశీల : నాకేద్దారి ? ఎలా ఇప్పుడు ?

సోమ : రావుకదూ, సుశీలా ?

సుశీల : రాను రాను ! రాను.

సోమ : ముమ్మాటికీ రావుకదూ ?

సుశీల : తరువాత మాటాడదాం. ఇప్పుడ్రాను.

సోమ : తరువాత మాటాడతావు. ఇప్పుడు రావు. అంతేనా డార్లింగ్ ? నీ కీ మేడా, ఈ గదీ, ఆ పరువు—ఇవి కావాలి. అవుంటేనే నేను కావాలి. ఏం అంతేనా ?

సుశీల : నన్నిలా చంపేకు సుందరం ! ఇది న్యాయం కాదు.

సోమ : అలా అయితే, రైటో ! గుడ్‌బై ; టటా ! అలా ! (అంటూ పైకి వెళ్ళదోయేడు)

సుశీల : (అతణ్ణి పట్టుకొని) కొంపముంచేవు. అలా ఒద్దు.

సోమ : నన్ను వెళ్ళనీ ! ఎక్కడికెలా వెళ్తేనేఁవిఁటి ?

సుశీల : నీకు పుణ్యం వుంటుంది. అలా మాటాడకు.

సా ర్వ : (దగ్గర్నుంచి) సుశీలా !

సుశీల : ఏం దారి భగవంతుడా ?

సోమ : (పక్కగది చూపిస్తూ) ఆ గదిలోంచి పైటికి వెళ్ళిపోతాను ! ఏం ?

సుశీల : ఆ గదికి మరో ద్వారంలేదు. ఎలా వెళ్తావు ? వెళ్ళలేవు.

సార్వ : (పైనుంచి) సుశీలా !

సుశీల : ఒస్తున్నా ? (అని, తరవాత మెల్లిగా) చచ్చేం సుందరం. చచ్చేం! ఎలా యిప్పుడు ? ఆఁ! రా యిలారా ! ఇలారా బాబూ! రా సుందరం! అందాకా బతికేం. ఇలారా ! ఏమిటవుతే అవుతుంది. ఏం చేస్తాం ? ఇలారా ! (అంటూ బీర్వా వారకి సుందరాన్ని తీసుకు వెళ్ళి) వుండు. అలా వుండు. కనిపించొద్దు ! అందాక అలా వుండు. నన్ను రక్షించు.

సార్వ : సుశీలా (అంటూ గదిలోకి వస్తాడు)

సుశీల : (బీర్వా దగ్గర్నుంచి హడావిడిగా ముందుకొచ్చి) వచ్చే వచ్చే !

సార్వ : ఒక్క రాస్కెల్ కూడా కనిపించడేం ?

సుశీల : రాస్కెలెవరు ? ఎవరూలేరే ? ఏఁవిఁటి సార్వ....

సార్వ : ఎవరూ లేరేమనే అడుగుతున్నాను. అప్పన్నేడి? నూకరాజేడి? పోలి పిల్లేడి? వెంకమ్మేది? ఎవరూ కనిపించరేం ? ఎక్కడ చచ్చేరంతా ?

సుశీల : నౌకర్ల మాటా అడుగుతున్నారు? ఏఁవిఁటో అనుకున్నాను. వాళ్ళంతా —ఏదో పండుగట; కుంచాలమ్మ పండుగట—పండుక్కి తీర్థానికి వెళ్తాం, రామన్నారు. పోలిపిల్లి వుండాలే. వరండాలో లేడూ ?

సార్వ : ముసిలివెధవ ! పడుక్కునుంటాడు జీతం దండుగ! మంచికి పోతే యింతే !

సుశీల : నే చూసుకోలేదు. ఉన్నాడు కదా అనుకున్నాను.

సార్వ : తలుపులన్నీ తెరచికూడా వున్నాయి. ఏ దొంగ ప్రవేశిస్తే ఎవరు చూద్దురు ? నువేం చేస్తున్నావు ? అన్నిసార్లు పిలిచేను.

సుశీల : ఏంలేదు. ఇప్పుడే ఇలా ఒచ్చేను. ఏ దొంగొస్తాళ్ళేండి. ఉండండి. మీకు పళ్ళరసం తెస్తాను. లేకపోతే, మీరు కిందికి రండి.

సార్వ : తరవాత స్నానానికి దిగాలికదా ? వేణ్నీళ్ళున్నాయా ? లేకపోతే వాణ్ని పెట్టమను, పళ్ళరసం వేగిరం తీసుకురా.

సుశీల : తీసుకొస్తా. పోనీ మీరు కిందకి రాకూడదూ ? ఎలా అలసి పోయున్నారో !

సార్వ : అలసిపోయున్నానని చూస్తూ, మళ్ళీ కదలమంటా వేమిటి ?

సుశీల : రసం తెస్తానుండం డయితే.

సార్వ : చప్పున.

సుశీల : ఇదిగో వెళ్తున్నా (అంటూనే కొంచెం ఆందోళనతో సార్వభౌమ రావు వెనక్కి బీర్వావైపు చూస్తుంది.)

సార్వ : ఏమిటలా చూస్తున్నావు ? (అంటూ తను కూడా వెనకకి తిరిగి చూస్తాడు.)

సుశీల : ఏంలేదు (అని గాభరాగా) ఒస్తా నుండండి.

సార్వ : ఆగు !

సుశీల : (గాభరా పడుతుంది) ఏమిటి ? ఏమిటయింది ?

సార్వ : ఏంలేదు. ఎందుకలా గాభరా పడుతున్నావు ? (అంటూ అనుమానంగా మళ్ళీ వెనక్కి తిరిగిచూసి)

సుశీల : ఏంలేదు. గాభరా పడ్డంలేదే ! ఎందుకో ఆగమన్నారు ! ఎందుకు ?

సార్వ : ఏంలేదు. అబ్బాయేడీ ?

సుశీల : నే లేచేసరికే లేరు. చీకటితోటే ఎక్కడికో వెళ్ళినట్టున్నారు. ఇంకా రాలేదు.

సార్వ : ఏ షూటింగో హంటింగో అయుంటుంది. సరే వెళ్ళిరా ! వేగిరం.

సుశీల : (వెళ్తూంది.)

సార్వ : చూడూ !

సుశీల : (ఆగి మళ్ళీ గాభరా పడుతుంది) ఏం ఎందుకు ?

సార్వ : ఎందుకలా పెద్దపులిన్చూసి బెదిరినట్టు బెదురుతున్నావు ? ఏంలేదు.

ఆ డ్రైవర్ని ఇంటికి పొమ్మను. నాలుగ్గంటలకల్లా మళ్ళీ రావా లన్చెప్పు. నాలుగో గంటంటే నాలుగో గంటే !

సుశీల : చెప్తా ! (అని తొందరగా వెళ్తుంది.)

(సార్వభౌమరావు షోణీతీసి మంచంమీద పడేశాడు. తరువాత కాసేపు అటూ ఇటూ తిరిగి, పందిరి మంచంమీద కూర్చోబోతూ, అక్కడి స్టూలుమీద జోళ్ళు చూసేడు. గదంతా కలయజూసేడు. బీర్వాపైపు చూసి, గది మధ్యకి వచ్చి, వంగొని బీర్వాకిందికి చూసేడు. మనిషి పాదాలు కనిపించినట్లుగా సార్వభౌమరావు ముఖం చూస్తే తెలుస్తుంది. అక్కడే. అలా విల్చొని ఆలోచిస్తూ వుంటాడు. అంతలో సుశీల తిరిగి వస్తుంది.)

సుశీల : (గాభరాగానే) డ్రైవర్ని పొమ్మన్నాను. నీళ్ళు కాచున్నాయి. స్నానం చేస్తారుగాని రండి అంతలో ఫ్రూట్ జ్యూస్ రెడీ అవుతుంది. ఏం అలా వున్నారు ? కోపంగా వున్నారేం ? పార్లమెంటుమీదా, ప్రజల మీదా లేక నా మీదా ఆ కోపం అంటాను ? ఇంకా భోంచెయ్యలేదు. అందుకే అలా వున్నారు. నాకు తెలుసు. (అంటూ దగ్గరికి వెళ్ళి. అతని భుజం దగ్గర తల పెడుతుంది.)

సార్వ : (ఎడంగా జరిగి) ఎవడు వాడు ?

సుశీల : ఎవరు ? (అంటూ బీర్వాపైపు చూసి, తరవాత అటూ యిటూ చూస్తుంది) ఎవరూ ? ఎవరూ లేరే !

సార్వ : (సోమసుందరం జోళ్ళున్న స్టూల్ని ఫెడేల్ మని తన్ని) ఎవడు వాడు ? ? ?

సుశీల : నాకు తెలీదు; నేను చూల్లేదు.

సార్వ : ఎవడ్రా నువ్వు ? ? బైటికి రారా పొంగలంజా.... (అని అంటూండ గానే)

సోమ : ....కొడకా (అంటూ ! పూర్తిచేసి చటుక్కున బైటికొచ్చి బైటికి వెళ్ళే గుమ్మంపైపు సార్వభౌమరా వుండడం చూచి, రెండో పక్క గదిలోకి పారిపోతాడు.)

సార్వ : పట్టుకో! అపాపు! (పక్క గదిలో సోమసుందరం వెళ్ళడం చూచి) చిక్కేడు. చిక్కేడు! తలుపు వెయ్! వెయ్ తలుపు ! ! ! (అని ఎంత

గట్టిగా, ఎంత అధికారయుతంగా అన్నాడంటే—అలా అనేసరికి, ఠక్కున మరబొమ్మలా ఆ గది తలుపు వేసేసి గడియపెట్టింది సుశీల. ఆ గడియ వేసేక,రెండు చేతులతో ముఖం కప్పుకుని కళ్ళు మూసుకొంది. ఏడుస్తోంది. గడియారం పన్నెండు గంటలు కొడు తుంది. పన్నెండు గంటలు మిల్లు కూత కూడ వినపడుతుంది.)

సార్వ : ఎవడువాడు ? అని (అటూ యిటూ పచారుచేసి) ఎవడువాడు ? (అని అటూ యిటూ మళ్ళీ పచారుచేసి) ఎవడు వాడూ, దొంగేకదూ ?

సుశీల : (కాదన్నట్లుగా తల ఆడించింది.)

సార్వ : రాక్షసీ ! ....హోసీ ! రాక్షసీ !

సుశీల : నన్ను చంపేయండి.

సార్వ : (నొక్కుకుపోయిన కంఠంతో నెమ్మదిగా బిగించి మాటాడుతూ) నిన్ను చంపాలనే తల్చుకుంటే అదేం పెద్ద పనేంకాదు. నిన్నూ వాణ్ణీ హతమార్చాలనుంటే, నన్ను దేముడు కూడా అడ్డుకోలేడు. నేను సార్వభౌమరావుని. నిల్చున్నపాట్న యిద్దర్నీ తీసికెళ్ళి పొయ్యిలోపెట్టి కాల్చగలన్నూ, నన్నడిగేవాళ్ళేడు. నేను సార్వభౌమ రావుని. మిమ్మల్ని కాలికిందవేసి జోడుతో పరపర నలిపేగలను. అది నాకేం పెద్ద కష్టమైన పనేంకాదు. ఆ పని చేస్తే నన్నడ్డగలిగిన వాళ్ళేడు. నేను సార్వభౌమరావుని ! (అంటూ తీవ్రంగా ఆలోచిస్తూ అటూ యిటూ పెద్ద పులిలా నడుస్తూ సుశీలని చూసి) ఎందుకా ఏడుపు ? (అంటూ ఆమె ముఖంమీది చేతులు తీసేస్తాడు.)

సుశీల : (భయంతో కొంచెం ఎడంగా వెళ్తుంది.)

సార్వ : ఎన్నాళ్ళనుంచి ఈ నాటకం ?

సుశీల : (తిరిగి ముఖం కప్పుకొంటుంది.)

సార్వ : చేరదియ్యడం నాది తప్పు. చేరదియ్యడం నాది తప్పేనా ?

సుశీల : (అవునన్నట్టుగా తలూపుతుంది.)

సార్వ : నువ్వెవర్తెవో, నీ బతుకేమిటో ఆలోచించుకున్నావా ?

సుశీల : (మళ్ళీ అలాగే తలూపుతుంది. ముఖం మీంచి చేతులు తీసి నిస్త్రాణగా నిలబడుతుంది. బోన్లో ముద్దయిలా.)

సార్వ : నీ తల్లి వంటపుట్టి. నీ తాత వంటపుట్టి, నీ తాత ముత్తాతలంతా

వంటపుట్టి వెధవలు! పెళ్ళయి నీ పన్నెండో యేట చచ్చిన ఆ మొగడు వెధవ వాడు వంట పుట్టి. నీ పద్నాలుగో ఏట నిన్ను పాడుచేసి లేవ తీసుకుపోయి బెజవాడ వీధుల్లో నిన్ను తిప్పి తిప్పి అమ్మజూసి, ఆఖరికి దిక్కూ మొక్కూ లేకుండా నిన్ను నడిబజార్లో వదిలివేసిన వెధవ వాడో వంట వెధవ. అవునా ?

సుశీల : అవును.

సార్వ : తల్లి చచ్చి, తండ్రి చచ్చి, మొగడు చచ్చి, అన్నదమ్ములంతా చచ్చి, లేవదీసుకపోయిన వెధవ నిన్ను చావమని చెప్పి వాడెక్కడో చస్తే నువ్వప్పుడు ఎలా వున్నావు ? ఇల్లులేక, బట్టల్లేక, బంధువుల్లేక తిండికి బియ్యపు గింజలో అరసగం లేక స్పృహతప్పి పెంటకుప్ప మీద పడున్నావు. కాకులు పొడుస్తూంటే, కాలూ చెయ్యీ పట్టుకు కుక్కలు పీకుతున్నాయి. వంట్లో రక్తమాంసాల్లేవు. కొన ఊపిరి ల్లేదు. అప్పుడు నీ కెవరు సాయం చేసేరు ? దేవుడు చేసేడా ?

సుశీల : (చెయ్యలేదన్నట్టు తల ఆడిస్తుంది.)

సార్వ : వాడు పెర్రివాడు కాదు. నేను పెర్రివెధవని కాబట్టి నీ యెడల దయ దల్చి, నీ అవస్థకి జాలిపడి. నిన్ను చూచి కనికరించి చేరదీసి తిండిచ్చి, బట్టిచ్చి, మందులిచ్చి, ప్రాణంపోసి, పెంచి పోషించి పెద్దదాన్ని చేసేను. చేసేనా లేదా ? దేముడు చెయ్యని పని చేసేనా లేదా ?

సుశీల : చేసేరు.

సార్వ : అన్నం మెతుకు నల్లగా వుంటుందో తెల్లగా వుంటుందో తెలీని ముష్టిదాన్ని యింట్లో పెట్టుకుని అన్ని ఖర్చులూ భరించి పాలూ పాయసం పోసి పెంచితే, ఈ క్షణం వరకూ నా ఖర్చుమీద పోత రించి పెరిగేవు. పెరిగి పెద్దదానివయి నీ అందం చూపించి నన్ను పాశం వేసి లాగేవు. పన్నిన వల యింకా బలంగా పన్ని నన్ను పర్మనెంటుగా మోసం చెదామనుకున్నావు.

సుశీల : నేను మోసం చెయ్యలేదు. అలా అనకండి.మీకు పుణ్యం వుంటుంది.

సార్వ : నువ్వు మోసం చెయ్యకపోతే మరెవరు చేసేరు మోసం ?

సుశీల : (జవాబివ్వదు.)

సార్వ : ఎవరు మోసం చేసేరు ?

సుశీల : (మాటాడదు.)

సార్వ : మాటాడవేం మోసం చేసిందెవరు? నీ అందం చూసి, నీ అమాయకత్వం చూసి, నీ యవ్వనమంతా కళ్ళు జిగేల్ మనగా చూసి, నీ బతుకంతా నా చేతిలో వుందికదా అనే వీలు చూసుకొని, నా ఆస్తి నా అధికారం, నా మేడా, నా కారూ చూపించి నేనే నిన్ను మోసం చేసేను. అంతేనా నీ అభిప్రాయం ? ....సరే....సరే....నీది కాదు మోసం ! నేనే మోసం చేసేను....అవునంతేకదూ! చచ్చిన పెళ్ళాం ముండ చావగా, నిన్ను నమ్మి, నీ చేతుల్లో నా ప్రాణం పెట్టి, పుస్తె కట్టి తెచ్చుకున్న దానికంటె ఎక్కువగా చూచుకొని నిన్ను కనకపు సింహాసనంమీద కూర్చో పెట్టి నేనే నిన్ను మోసం చేసేను....(అని కోపంతో) ముసిలి వెధవని మూణ్ణిమిషాల్లో బోల్తా కొట్టించేనని సంబరపడుతున్నావు కాబోలు. ముసిల్దయినా ఇది వెబ్బులి ! పంజా విసిరేనంటే దెబ్బ కనిపించదు. మనిషి మాత్రం....డౌన్ !

సుశీల : నన్ను క్షమించండి.

సార్వ : క్షమించమని అడగడానికి నీకు అర్హతలేదు. క్షమించడానికి నాకు అవసరమూలేదు. నాకు ద్రోహం చేసిన వాడికెవడికీ క్షమాభిక్ష నా దగ్గిర యింతవరకూ అసలుకి దొరకలేదు. కని పెంచిన తండ్రికే దిక్కులేకపోయింది. కంచంకోసం మంచం కోసం యింట్లో చేరి యింటి కెసరు పెట్టబోయినవానికి నీకా దొరుకుతుంది నా దగ్గిర క్షమాభిక్ష...! నే నింతవరకూ పొరపడ్డాను. నీదికాదు తప్పు. నాదే తప్పు! "దిక్కులేని వెధవలందరికీ ఇక్కడే అన్నదానం, వస్త్ర దానం, అన్ని రకాల దానాలూ చేయబడును" అని బోర్డు కట్టు కూర్చుంటే ఆకల్తో వున్న అవులూ వస్తాయి. పాలకోసం పాములూ వస్తాయి. బోర్డు కట్టు కూర్చోడం మొదటి తప్పు. కూర్చున్నాక, పాముల్ని రానివ్వడం రెండోతప్పు. కాని, ఇప్పుడు తెలుసుకున్నాను, చేసిన తప్పులన్నీను. ఇక ముందు ఇక్కడ ఈ యింట్లో పాములకి పాలు దొరకవు. అందుచేత, పిల్లా నీ ఆశలన్నీ అడియాసలు ! అపా యేడుపు !!

సుశీల : మీకు ద్రోహం చేసేను. నిజమే ! మీరు నన్ను పెంటలోంచి ఏరి తీసేరు. నాకు ప్రాణభిక్ష పెట్టేరు. అంతేకాదు. కాలు కందనివ్వకుండా పట్టు తివాసీలమీదే ఇన్నాళ్ళూ నన్ను నడిపించేరు. కాని మీకు ద్రోహం ···ద్రోహం నేను కోరి తలపెట్టలేదు.

సార్వ : ద్రోహం చేసేవ్ కదా !

సుశీల : నేను కోరి చెయ్యలేదు. నాకు మతిపోయింది. ఎవరో మంత్రించి నట్టయిపోయింది.

సార్వ : పాలూ వెన్నా దొబ్బెట్టి రోజూ పడుతూవుంటే, అవునవును, అలానే వుంటుంది. మంత్రించి నట్టుగానే వుంటుంది, మతి పోతుంది. మరింకేం కనిపించదు. కొవ్వెక్కి కళ్ళుమూసుకుపోతేకూడా అలానే వుంటుంది. కుర్రాళ్ళు మంచాలూ తప్ప లోకంలో మరింకేం కనిపించవు. మంత్రాలూ గింత్రాలూ నా దగ్గిర తీసి పెట్టు ! మంత్రం వేస్తే డాన్స్ చెయ్యటానికి నువ్వు పామువైతే కావొచ్చు కాని నేను కాను. ఇది పెద్దపులి. సరిగా నిలబడు ! ఊఁ అలా వెళ్ళి ఆ ఫోన్ తియ్యి! తియ్! తీసేవా ? త్రీ సిక్స్ డయల్ చెయ్యి! చెయ్! చేసేవా ? యిలా ఇయ్యి (అని ఫోన్ తీసుకొంటూ) యిదేమిటో తెలుసా ? మన గేటుకి ఎదురుగానే వుంది. (అని ఫోనెత్తి) నేను సార్వభౌమరావుని ! ఎవడక్కడ ? ట్రాఫిక్ హెడ్డువా? స్టేషన్లోంచే కారు కంట్రోలు చేస్తున్నా వేఁవిఁటి ? మీ 'ఎస్సయ్' వున్నాడా? లేడూ! మీ 'ఎస్సై' పిలిస్తే 'లేడు.' నే పిలిస్తే 'వున్నాడు.' నే పిలుస్తున్నానని చెప్పు. అర్జంటు వ్యవహారం! ....ఏఁవిఁరాకిస్టప్పా! ఇమీడియట్‌గా రావాలి. ఏఁవిఁటీ ? డి. హెచ్. బి . వా? గ్రేవ్ క్రైమా ? ఏదున్నా సరే, అదలా ఒదిలేసి నువ్విలా రావలసిందే ? ఒరే అబ్బాయ్! నువ్వు ప్రజా ప్రభుత్వ సేవకుడవి ! అవునా ? ఆ సంగతి మర్చిపోకు. మరి నే పిలిస్తే నువ్వు ఒచ్చి తీరవలసిందే ! (అని నవ్వుతో) ఎంచేతో తెలుసా? నేనే ప్రజ! నేనే ప్రభుత్వం ! అంచేత!....రైటో (అని ఫోన్ పెట్టేసి) ఒస్తున్నాడు.

సుశీల : ఎవరు ?

సార్వ : మా మీద తిరగబడితే మా కెవరొస్తారు సాయం ?

సుశీల : ఎవరు ? పోలీసులా ?

సార్వ : కాక మరెవరు ?

సుశీల : నన్నప్పజెప్తారా జెయిలుకి ?

సార్వ : చూదువుగాని.

సుశీల : మీరేం చేసినా సరే ! ఉండమంటే వుంటాను. పొమ్మంటే పోతాను జెయిలుకి వెళ్ళి ఏడవమంటే అక్కడకే పోయి ఏడుస్తాను.

సార్వ : నిన్ను జెయిలుకే పంపించాలనుంటే అదెంత పని ?

సుశీల : బావగారూ !

సార్వ : నన్నలా పిలిచావంటే నాల్క పీకించేస్తాను.

సుశీల : బావగారూ !

సార్వ : నోర్ముయ్ !

సుశీల : నన్నేం చేసినా చెయ్యండి. చదువుకొంటూన్నవాణ్ణి, ముందికి పోవలసిన వాణ్ణి అతన్ని విడిచిపెట్టండి. అన్నిటికి భ్రష్టమై పోయున్న దానిని నేను. నన్ను కావలిస్తే చంపేయండి.

సార్వ : నిన్ను ఇన్నాళ్ళూ పువ్వులా చూసుకొని పువ్వుల్తో పూజించుకున్నానా లేదా ?

సుశీ : (మాటాడదు)

సార్వ : పూజించుకున్నాను నిన్ను ! అవునా కాదా ?

సుశీల : అవును.

సార్వ : అదంతా నీ కిప్పుడు భ్రష్టుబతుకులా తోస్తోందికదూ ?

పోలిపిల్లి: (గదిపైనించి) అమ్మా పళ్ళరసం.

సుశీల : (గుమ్మందాకా వెళ్ళి రెండు గ్లాసులూ అందుకొని వస్తుంది)

సార్వ : నువ్వు తాకితే అది విషం! అలా ఉంచు.

సుశీల : (వెళ్ళి గ్లాసులు మేజామీద పెట్టి. కళ్ళు తుడుచుకొంటుంది)

పోలిపిల్లి : (పైనుంచి) బాబూ! ఇన్‌స్పెక్టరు బాబొచ్చేడు. తమరు కిందికి దయచేస్తారా? ఆ బాబునే ఇక్కడకి రమ్మంటారా?

సార్వ : వాణ్ణిలా రమ్మను.

పోలిపిల్లి: చిత్తం.

సుశీల : (గుమ్మందాకా వెళ్ళి నిలబడి, ఉండాలా ? లేక వెళ్ళిపోవాలా అన్నట్టుగా చూస్తుంది)

సార్వ : ఇక్కడ ఉండకపోతే ఎలా ? నాయకీమణి వుండాలి కదూ. అలా వుండు. ఏదో ఒకటి తేల్చేసుకుందాం.

సుశీల : (గదిలో ఒకవార కూర్చుంటుంది)

కిష్టప్ప : (ప్రవేశిస్తాడు. మామూలు దుస్తుల్లో వుంటాడు) ఏం బాబాయ్ ! ఏమిటంత అర్జంటు వ్యవహారం ? ఇంటి కెదురుగా స్టేషనుండడం కాదుగాని నన్నిలా చంపేస్తున్నారు మీరు. అవతలక్కడ యింత సేపూ మా డిఎస్పీ ఎలా కూర్చున్నాడో తెలుసా ? పీకలమీద మంగలి కత్తిలా కూర్చున్నాడు. అందులోనూ మని షెలాటివాడో తెలుసు కదా ? తల్లికి మొగుడు !

సార్వ : ఇంకా ఉన్నాడా పోయేడా ?

కిష్టప్ప : ముప్పైమూడు కూనీ సలాంలు కొట్టి మరీ సాగనంపేను. ఏం చేస్తాం ? తిట్టే తిట్లు మనసులో తిట్టేసుకోవడం, పైకి, కొట్టే సలాంలు ఖచ్చితంగా కొట్టడం. బతుకే అది కదా !

సార్వ : అదలా ఉంచు. ఇప్పుడు........

కిష్టప్ప : అవత లక్కడ కలెక్టరు పెళ్ళానివి వజ్రాల దుద్దులు పోయేయిట. మొగుణ్ణి సతాయించినట్టు ఆవిడ నన్ను సతాయించి చంపుతోంది. పోయిన దుద్దులు 'తెస్తావా తేవా' అంటూ నెత్తి మీదెక్కేస్తే ఎక్కణ్ణించి తేవడం ? ఏమైనా అంటే కలెక్టరు పెళ్ళాం ? ఆవిడ గార్ని చూసేరుకదూ ? బాబామియాగాడు ఆడవేషం వేసినట్టుంటుంది. ఆ అందానికి సాయం ఇంతకో పన్ను ! (అని చూపుడు వ్రేలు చూపిస్తాడు) మనిషి కనిపిస్తే చాలు, ఆ పళ్ళతో కటుక్కున కొరి కేస్తుంది. ఇందాకట్లా ఫోన్‌లోపిల్చి వార్నింగిచ్చింది-ఇవాళ సాయం కాలం లోపల ఆ దుద్దులు తెచ్చి అప్పజెప్పకపోతే, నన్ను డిస్మిస్ చేయించేస్తుందిట !

సార్వ : అంటే నువ్వేమిటన్నావు?-లేక నోరు మూసుకొ నూరుకున్నావా ?

కిష్టప్ప : ఊరుకుంటానూ ! ఒక్కటే చెప్పేను. అమ్మా ! నీకు సార్వభౌమ రావు గారు తెలుసు కదా అన్నాను. అంటే 'తెలుసు ! తెలుస్తే?'

అంది. తెలిస్తే చాలు, మరే లేదు. ఆయన మా బాబాయిగారు. అంతే సంగతన్నాను.

సార్వ : అంటే, ఏమిటంది ?

కిష్టప్ప : అంటే, ఇంకా వేరే అనడం ఒకటా ? దాని కంఠ మాధుర్యం మీకు తెలుసు కదూ ? మూడు గొంతుకల్తో మాటాడుతుంది. మీ పేరెత్తే సరికి మూడు గొంతుకలూ ఒక్కసారి బన్ద్ ! ఫోను టక్కున పెట్టే సింది. అదీ సంగతి. అదలా ఫోను పెట్టేసింది. ఇంతలో రంకు మొగుళ్ళా మా డియస్పీ తగులుకున్నాడు. ఇంతలో (అని నవ్వుతూ,) మరేం అనుకోకండి - వాణ్నొదుల్చుకొనేసరికి ఇంతలొ మీ దగ్గ ర్నించి కబురు ! మరి మీ కబురంటే - కలెక్టర్లు ఐదుగురి కలెక్టర్ల కబురుకదా ! రాక తప్పుతుందా ! ఇదిగో హాజరయేం. ఏఁవిఁటి కథ ?

సార్వ : ఆ గది తలుపొకసారి తెరిచి చూడు.

కిష్టప్ప : ఏ గది ?

సార్వ : అదిగో ! ఆ గది.

కిష్టప్ప : ఏఁవిఁటుం దందులో ?

సార్వ : చూడు !

కిష్టప్ప : ప్రమాద వేం జరగలేదు కదా ?

సార్వ : ప్రమాదమైన వాళ్ళాగే ఉన్నాడు.

కిష్టప్ప : ఏఁవిఁటి ? దొంగేనేవిఁటి ? పట్టుకున్నారా ఏఁవిఁటి ?

సార్వ : దొంగని పట్టుకోకుండా నిన్నెందుకూ పిలవడం ?

కిష్టప్ప : చిక్కాడుకద ! ఎలా ప్రవేశించేడు ? ఏఁవిఁ టెత్తుకెళ్తున్నాడు ? ఎవడు వాడసలు ?

సార్వ : తలుపు తీసి చూడు.

కిష్టప్ప : మా పాతవాడెవడూ కాదుకదా ? పాతవాడే అయుంటాళ్ళండి.

సార్వ : తలుపు తెరువు.

కిష్టప్ప : వాడి చేతిలో ఏం లేదు కదా ?

సార్వ : తుపాకులూ, ఫిరంగులూ వాడేం తెచ్చినట్టు లేదు.

కిష్టప్ప : దెబ్బకి తుపాకి, ఫిరంగీ ఉండాలా ఏఁవిఁటి ? చిన్న పెన్సిల్

చెక్కుకునే చాకు చాలు ! ఉండండి, మా హెడ్డును కూడా రమ్మం టాను. ఎందుకైనా మంచిది.

సార్వ : నీకు ఉద్యోగం ఇప్పించడం నా బుద్ధి పొరపాట్రా ?

కిష్టప్ప : అదికాదు బాబాయ్ !

సార్వ : దొంగని చూపించి అప్పజెప్తామన్నా పట్టుకోలేకపోతే నీ సాయం మా కెందుకింక ? వెళ్ళి ముందు తలుపు తియ్ !

కిష్టప్ప : తీస్తాను కాని మీరలా పక్కనుండండి బాబాయ్.

సార్వ : ఆపాటి దానికి నన్నే తియ్యమని చెప్పకూడదా !

కిష్టప్ప : తియ్యండి బాబాయ్ ! నేనిలా ఇక్కడ కొస్తాను.

సార్వ : కలెక్టరు పెళ్ళాం నిన్నొస్తేనే లిట్టలేదురా. (అంటూ వెళ్ళి తలుపు తీస్తాడు. తీసి) రా బైటికి !

కిష్టప్ప : మర్యాదగా ఒచ్చెరా తమ్ముడూ.

సార్వ : రా, వేగిరం రారా రాస్కెల్, రా !

సోమ : (తటాల్న బైటికి వచ్చి) రాస్కెల్ గీస్కెలంటే జల్ జల్ రాల్తాయ్ దవడపళ్ళు.

కిష్టప్ప : ఎవడు ? వీడా !

సోమ : రాయేసికొడ్తే లేత చింతకాయలు రాల్తాయి చూసేవా! అలా రాల్తాయి. ఓహో ! పార్లమెంటు నెంబరుగారు ! ముసలి బా....బూగారు !

సార్వ : ఏదిరా కిష్టప్ప, ఫూల్ ? ఏం చూస్తున్నావ్ !

సోమ : అరె ! ఇన్స్పెక్టర్ కిష్టప్ప బాబేనేంటి ? సివిల్ డ్రెస్సులో ఉన్నారు. పోల్చలేకపోయాను. గుడ్ మార్నింగ్ సార్ ! నిన్న రాత్రి బర్మాదాసు కార్లో....

కిష్టప్ప : నువ్వురా బాబూ ? దొరికే విన్నాళ్ళకి !

సోమ : నిన్నరాత్రి బర్మాదాసు కార్లో ఒస్తున్నావు కదూ, కిష్టబాబూ ?

కిష్టప్ప : షటప్ !

సోమ : కార్లో కానిస్టెక్కు దొరకూడా ఉన్నాడు. అవునా ?

కిష్టప్ప : ముందు నువ్విక్కడ కెందు కొచ్చేవో చెప్పు ?

సోమ : కారెక్కమంటే ఎక్కిపోయేవు. దిగమంటే దిగిపోయేవు. అంతే కాని ఒక్కసారి కారు చెకింగ్ చేసి చూసేవా ? లేదు. దాసూ, దొరా

నీకు గొప్ప కిస్తా ఇచ్చేసేరు. కార్లో ఏంటున్నాయో తెల్సా ? జానీవాకర్లు ఆరు! రాత్రి నూకరాజు కంపెనీకి ఛాన్సు! కాకినాడ చిట్టి, విజయ్‌నగరం జేబీ-ఇద్దర్నీ సెలక్షన్‌చేసి రాత్రల్లా బుకింగు. నిన్ను ఇంటిదగ్గర దించేస్తే అదే బావుందని దిగిపోయేవు. నీకు నైట్ రౌండ్సు! వాళ్ళకి నైట్ క్వీన్సు! ఇదంతా నాకెలా తెలిసిందో తెలుసా ? చెప్పుకో చూదాం.

కిష్టప్ప : షటప్!

సార్వ : అరుస్తూ కూర్చోడమేనా, లేక వాణ్ని తీసుకెళ్ళడం ఉందా ?

కిష్టప్ప : ఇదిగో....

సార్వ : ఇదిగో అదిగో అంటూ నీళ్ళునమల్డానికా నీకుద్యోగం ఇప్పించింది?

సోమ : బాబు ఉజ్జోగానికి తమ రికమిండేస నుందేంటి! అదా సంగతి!

సార్వ : నోరు ముయ్యరా రాస్కెల్!

సోమ : ఇది రెండోసారి 'రాస్కెలు'. మూడోసా రామాట రాలిందంటే దాన్ని తిప్పి విసుర్తాను! ఒకటోసారి వార్నింగ్! రెండోసారి వార్నింగ్. మూడోసారి! దవడపళ్ళు రాలింగ్.

కిష్టప్ప : నోర్ముయ్!

సార్వ : ఏంరా కిట్టప్పా! యమ్ ఐ టు పుట్ ఆఫ్ విత్ ఆల్ దిస్? ఇదంతా పడ్డానికా నిన్ను పిలిపించింది ?

కిష్టప్ప : సారీ బాబాయ్! అరే సుందరం! నువ్వు రా నాతో! నడు ముందు!

సోమ : నడవను. ఏం చేస్తావ్ ?

సార్వ : హిట్ దట్ ఫెలో! కొట్టు! చంపు!

సోమ : పార్లమెంటు మెంబర్లు కొట్టమనీ చంపమనీ చెప్పకూడదు సార్! తప్పు తప్పు!

కిష్టప్ప : మర్యాదగా నడ్రా, సుందరం!

సోమ : నడవనని ఓ సారప్పుడే చెప్పేను.

కిష్టప్ప : ఒరే సుందరం! ఎదురుగా స్టేషనుంది. నువ్వెక్కడికి పోలేవు. నీ మంచికి చెప్తున్నాను. రా!

సోమ : నా మంచేదో నాకు పోలీసులు చెప్పక్కర్లేదు.

కిష్టప్ప : మంచిగా చెప్తే రాకపోతే మరింక నా తడాఖా చూద్దువు గాని.

సోమ : నీ తడాఖా పిటాపురం కాంతం రోజూ చూస్తూనే ఉంది. నా దగ్గి రెందుకు ?

సార్వ : వాడితో ఆర్గ్యుమెంటేమిట్రా, కిష్టప్పా. ఫూల్ !

సోమ : నా పేరు చెప్పి మరోసా రనంతా మాట.

కిష్టప్ప : ఒరే సుందరం ! పాత మేస్ట్రీటు లేడిప్పుడు. ఇప్పుడింక అయిదూ పదీ జరిమానాల్తో సరిపోదు. కొత్త మేస్ట్రీటు తడాఖా నీకింకా తెలీదు కాబోలు.

సోమ : నేను తప్పేం చెయ్యలేదు.

కిష్టప్ప : తప్పు చేసావా లేదా అన్నది వాడు చూడ్డు. మేం నమ్మించిన వాణ్నల్లా జెయిలుకి పమ్మించడమే వాడి పని.

సోమ : వాడి లొసుగేదో కనిపెట్టి నొక్కుంటావు వాణ్ని.

కిష్టప్ప : నా మాట విని నాతో ఒచ్చి వేగిరం.

సోమ : నేనేం నేరం చెయ్యలేదు. నే రాను.

కిష్టప్ప : ఇక్కడికి రావడమే నేరం.

సోమ : తలుపులు తెరిచున్నాయి. ఎదురుగా హాల్లో పంజరంలో గువ్వ పిట్టుంది. దాన్ని లాగటానికి గండుపిల్లి ట్రయల్స్ వేస్తూంది. పిల్లిని తగిలేసి పిట్టని రక్షించడాని కొచ్చేను.

కిష్టప్ప : నీ డిఫెన్స్ తరవాత చెప్పుకొందువు గాని ముందు మర్యాదగా నడు.

సార్వ : మెళ్ళో పూలదండవేసి, ఆ తరవాత కర్పూరహారతిచ్చి, అప్పుడు కాని వాణ్ణి నువ్వు స్టేషన్‌కి తీసుకువెళ్ళలేవా ? చెప్పు, మీ ఎస్.పి.కి ఫోన్ చేసుకుంటాను.

కిష్టప్ప : ఉండండి బాబాయ్! అవతల ఆడవాళ్లున్నారు కదా. జబర్దస్తీ చెయ్యలేకనే ఊరుకున్నా నా ? లేకపోతే, అందులోనూ వీడెవడో తెలుసా? ఛోటా గూండా లందరికీ వీడు రింగ్ లీడరు. ఎలా దొరుకుతాడా ? ఎక్కడ దొరుకుతాడా అని చూస్తున్నాను. ("ఆడవాళ్లున్నారు కదా" అనే మాటలు విన్నాక అప్పుడు సుశీలను చూస్తాడు సోమసుందర

రావు. అంత వరకూ చూడలేదు. చూసేక, వెంటనే తల తిప్పేసు కున్నాడు)

సార్వ : అయితే....వీడు, స్టూడెంట్ కుర్రాడు కాడా ?

కిష్టప్ప : వీడా ! స్టూడెంటా ! సంతకం చెయ్యగలిగితే ఎమ్మే పాసయినట్టే లెక్క. వీడి వేషం చూసి స్టూడెంటను కుంటున్నారా ? కాలేజీ గేట్ల దగ్గర అలాగే ఫోజు కొట్టాళ్ళండి. ముద్దుల సినిమాలు. ప్రేమపుస్త కాలూ, పువ్వుల పార్కులూ చూసి దంగై పోతారా పిల్లలు కొంత మంది. అలాంటి వాళ్ళని పడతాడువీడు. వీడి మోడస్ఆపరేండయే అది !

సోమ : నీ ఇస్టరీ నా ఇస్టరీ తవ్వుకోవడం ఎందుగ్గాని. నడు కిష్టబ్బాబు, నడు ! మన సంగతి నీ స్టేషన్లోనే తేల్చేసుకుందాం.

కిష్టప్ప : అలా దారికిరా !

సోమ : దారి కొస్తూనే ఉన్నాను. కాని కథడ్డం తిరిగింది. కాని, కిష్టబ్బాబూ ఒక్క మాట, నాది విను !.... నేను దొంగ వెధవని కాను, రౌడీ వెధవని కాను. ఛాన్సిస్తే ఒకప్పుడు రౌడీలే కాదు దొంగలు కూడా మంచి దారికి రావొచ్చు!....అదీ నా మాట, విన్నావా? మరింక నడు.

కిష్టప్ప : దొంగలు మంచి వాళ్ళవడం రామరాజ్యంలోని మాట కాని....

సోమ : మన పోలీసు రాజ్యంలో మాట కాదు. అంతేనా ? పద మరింక.

కిష్టప్ప : ఒస్తా బాబాయ్ ! వీణ్ని తీసుకెళ్ళి మళ్ళీ ఒస్తాను. లేకపోతే జవాన్ని పంపిస్తాను.

సార్వ : జవానొద్దు.

సోమ : ఇదిగో ! పార్లమెంటు నెంబరు బాబూ ! నువ్వు మంచోడివనే ఒకరు చెప్పగా విన్నాను. నమ్ముతున్నాను. నీ ఇంట్లోకి నీ పెర్మి షన్ లేకుండా రావడం తప్పే ! ఒప్పుకున్నాను. అయితే అంతకి మించి నేనేం నేరం చెయ్యలేదు. ఇదిగో ఈ కిష్టబ్బాబు నన్ని ప్పుడే తీసుకెళ్తున్నాడు. ఈ బాబుదే జాతో తెలుసా ? కొంప తీస్తే

కొరివిజాతి ! ఇప్పుడు తీసికెళ్ళి నాకు చోరీ కేసు కాదు. ఖూనీ కేసైనా తగిలించ గలడు ఈ బాబు ! అలాటి అన్యాయం ఏ జ్జరిగినా నిన్ను వేస్తాను నాకు డిఫెన్సు ! అందాకా, టటా, లలా, చీరియో! (అంటూ నడుస్తాడు. కిష్టప్ప కూడా గబ గబా నడుస్తాడు.)

కిష్టప్ప : (గుమ్మం దగ్గర్నుంచి) ఒస్తానండి బాబాయ్ ! (కిష్టప్పా, సోప సుందరరావూ వెళ్తారు.)

సార్వ : వాడు-సుందరంగాడా వాడి పేరు ? - ఆ వెధవ చదువుకొంటున్న కుర్రవాడని కదూ యిందాట్లా అన్నావు ?

సుశీల : (అవునన్నట్టుగా తల ఊపుతుంది.)

సార్వ : చదువుకొంటూన్నవాడు. ముందుకి పోవలసినవాడు. అంటూ నాతో అబద్ధాలెందుకు చెప్పేవు ?

సుశీల : చదువుకొంటున్నానని (దుఃఖం అణుచుకొంటూ) అతనే-చెప్పేడు.

సార్వ : అబద్ధం అని తెలిపోయింది కద.

సుశీల : (అవునన్నట్టుగా తల ఊపూతుంది)

సార్వ : వాడు అబద్ధాలాడి నిన్ను మోసం చేసేడు. అవునా ?

సుశీల : అవును.

సార్వ : అబద్ధాలాడినవాడి నాలిక పీకించేసి వాణ్ణొంచేసినా పాపం వుందా ?

సుశీల : లేదు.

సార్వ : ఒప్పుకుంటావా ?

సుశీల : (అవునన్నట్టుగా తల ఊపుతుంది.)

సార్వ : తలూపడంకాదు. నోటితో చెప్పాలి. అబద్ధాలాడినవాణ్ని ఏం చేసిన పాపం లేదని ఒప్పుకుంటావా ఒప్పుకోవా ? చెప్పు. నోటితో చెప్పు.

సుశీల : (దుఃఖం దిగమింగుకొంటూ) ఒప్పుకుంటాను.

సార్వ : అయితే అలా మేజాదగ్గిర ఆ కుర్చీలో కూర్చో. ఊఁ. (సుశీల వెళ్ళి కూర్చుంటుంది) కాయితం కలం తియ్యి ! (సుశీల తీస్తుంది) నే చెప్పింది రాయి ! (సుశీల రాస్తూ వుంటుంది) మహారాజశ్రీ అయిదో నెంబరు పోలీస్టేషన్ సబ్ ఇనస్పెక్టరుగారికీ, అయ్యా, ఈ దినం, అనగా మే నెల ఇరవై మూడో తారీఖు ఆదివారం మధ్యాహ్నం.... రాసేవా ? ఏమిటి రాసేవు ?

సుశీల : ఈ దినం. అనగా, మే నెల ఇరవై మూడో తారీఖు ఆదివారం మధ్యాహ్నం....

సార్వ : ఆదివారం మధ్యాహ్నం సరిగా పన్నెండు గంటలకి మా యింట్లోకి ఎవరో కుర్రవాడు అక్రమంగా జొరబడ్డాడు. పేరడిగితే చెప్పలేదు. ఏదడిగినా సరియైన సమాధానం చెప్పలేదు. ఎవడో, ఏమిటో మాకు అనుమానంగా వుంది. దొంగతనానికి వచ్చినట్టుగా....

సుశీల : (రాయడం ఆపేసి ఏడుస్తుంది)

సార్వ : రాయి ! రాస్తావా, రాయవా ?

సుశీల : (రాయనన్నట్టుగా తల ఆడిస్తుంది)

సార్వ : రాక్షసీ ! ఏన్నేం చేసినా పాపం వుందా ?

సుశీల : లేదు : నన్నేం చేసినా పాపం లేదు. నన్నేం చేసినా చెయ్యండి.

సార్వ : అలాంటి నీచపు వెధవతో కలిసి నాకు ద్రోహం చేసేవు. నీకు నిష్కృతి లేదు.

సుశీల : లేదు ; నే చేసిన ద్రోహానికి నాకు నిష్కృతి లేదు. ఆ ద్రోహానికి నన్నేం చేసినా చెయ్యండి. నన్ను నడివీధిలో కొరడాతో కొట్టించండి. దొంగతనం చేశాననో మీకు విషం పెట్టేననో ఏదో ఒక సాకు చెప్పి నాకు జెయిలు వేయించండి. నేను చేసిన అపచారానికి ఆ శిక్షేదో నాకు వెయ్యండి. నన్ను కావలిస్తే నిప్పులోకి తోసేయ్యండి. శిక్ష భరిస్తాను. కాలి చస్తాను.

సార్వ : నువ్వా క్షుద్రపు వెధవకి లోబడి, నాకు కళ్ళు కప్పి యిన్నాళ్ళూ యింత నాటకం ఆడి, ఇంత మాయ చేసేవు. నువ్వు నా యెడల యిన్నాళ్ళూ అబద్ధంగా ప్రవర్తించేవా ? లేదా ?

సుశీల : అబద్ధంగానే ప్రవర్తించేను. అందుకు నాకు వెయ్యండి శిక్ష.

సార్వ : ఆ వెధవ స్టూడెంటునని చెప్పుకుని అబద్ధాలాడి, నిన్ను బోల్తా కొట్టించి మోసంచేసి వల్లో వేసుకున్నాడా, లేదా ?

సుశీల : వల్లో పడ్డం నాది కదా తప్పు !

సార్వ : ఒహో ! అలాగైతే నీ న్యాయసూత్రం ప్రకారం, నువ్వు నన్ను

మోసం చేస్తే నీది కాదు తప్పు : ఆ తప్పంతా నాదన్న మాట. అంతేనా ·

సుశీల : (మాటాడదు)

సార్వ : నువ్వు అబద్ధా లాడేవు. అవునా, ఇన్నాళ్ళూ ?

సుశీల : అవును.

సార్వ : అందుకు నీకే శిక్షయినా వెయ్యొచ్చు. అవునా ?

సుశీల : అవును.

సార్వ : వాడిన్నాళ్ళూ నీతో ఎన్నో అబద్ధాలాడేడు. అవునా ?

సుశీల : అవును.

సార్వ : అందుకు వాడికే శిక్షయినా వెయ్యొచ్చు. అవునా ?

సుశీల : (మాటాడదు)

సార్వ : నువ్వు చేసిన పాపానికి నిన్నేం చేసినా చెయ్యమంటావు. వాడు చేసిన పాపానికి మాత్రం వాడ్నేం అనొద్దంటావు. ఎంచేత ?

సుశీల : (మాటాడదు)

సార్వ : ఎంచేత ? మాటాడవేం ?....ఇదిగో సుశీలా ! అబద్ధాలాడి దగా చేసినందుకు నీకూ వాడికీ తేడా ఎందుకుండాలి ? మీ యిద్దరూ కలిసి నన్ను దగా చేసేరు. మీ యిద్దరూ కలిసి నా ఆనందానికి నిప్పు పెట్టేరు. మీ యిద్దరూ కలిసి నన్ను ముళ్ళగోతులోకి తోసేరు. మీ యిద్దరూ కలిసి నాకు శాంతి లేకుండా భస్మం చేసేసేరు. మీ ఇద్దరూ కలిసి నన్ను నాశనం చేసేరు. మీకు ఏ శిక్షయినా వెయ్యడానికీ నాకు అధికారం వుంది. అధికారం ఉందా లేదా ?

సుశీల : ఉంది, ఉంది, ఉంది ! కాని ఆ శిక్ష నాకు వెయ్యండి.

సార్వ : సరే అలాగే ; అలాగైతే సరే ! నీకు ఏ శిక్షవేసినా ఒప్పుకుంటావు కద ?

సుశీల : ఒప్పుకుంటాను. నిప్పులో దూకమంటే దూకుతాను.

సార్వ : ఏదీ ఎంతవరకూ రాసేవు ? (అని ఆమె రాసి పడేసిన కాయితం చూచి) "వాడు దొంగతనానికి వచ్చినట్టుగా అనుమానంగా వుంది. కాబట్టి పోలీసువారు దర్యాప్తు చేయించవలసింది." అని రాసి పూర్తి చెయ్యి. అలా రాయి !

సుశీల : అలా రాయడం అది నాక్కాదు శిక్ష !

సార్వ : నీ చేతుల్తో వాడికి శిక్ష వెయ్యడం అది నీకే శిక్ష ! నీకు ఏ శిక్షయినా వెయ్యమన్నావు. వేసేను. నిప్పులోకి దూకుతా నన్నావు. అదిగో నిప్పిచ్చేను. దూకు ! ఆడినమాట తప్పకూడదు. దూకుతా నన్నావు దూకు !

సుశీల : బావగారూ !

సార్వ : నన్నలా పిలవకు.

సుశీల : బావగారూ ! నన్నేం చేసినా చెయ్యండి. కాని మళ్ళీ నాచేత పాపం చేయించకండి. భగవంతుడు నన్నింక వెయ్యి జన్మలకైనా క్షమిం చడు.

సార్వ : భగవంతుడే నీచేత యీ పాపం, ఏ కారణం చేతనో చేయిస్తున్నా డని ఎందు కనుకోకూడదు ?

సుశీల : భగవంతుడు పాపా లెందుకు చేయిస్తాడు ? నేనీ అబద్ధం రిపోర్టు రాయనంటే నా చెయ్యి పట్టుకు రాయించలేడు కద భగవంతుడు ! కాదు బావగారూ. కాదు. భగవంతుడు మనచేత పాపాలు చేయిం చడు. పాపాలన్నీ తెలిసో తెలియకో మనమే చేస్తాం. మీకు పుణ్యం వుంటుంది. నాచేత మాత్రం ఈ పాపం చేయించకండి. నాచేతులు ఈ పాశాన్న నరికి వేయండి, కాని నా కొద్దీ పాపం ! నా కొద్దు.

సార్వ : మీ రిద్దరూ కలిసి నా బ్రతుకంతా భస్మంచేసి పారేసినప్పుడు అప్పు డ్నీకు పాపం పుణ్యం అవేం కనిపించలేదు. మీకు ఏ ప్రాయశ్చిత్తం చేసినా సరిపోదని నువ్వే అన్నావు. నిన్ను కావలిస్తే చంపేసు కోండని నువ్వే అంటున్నావు. నిన్ను చంపివేయడానికి నేను రాక్ష సుణ్ని కానే ! నే నంత ఘోరం తలపెట్టలేదే ! కనీసం నిన్ను నా యింట్లోంచి పొమ్మన్లేదే ! ఒక చిన్న రిపోర్టిమ్మన్నాను. వాడు నా యింట్లో జొరబడ్డాడా లేదా ? అక్రమంగా ప్రవేశించాడు కద ! అదే రాయమన్నాను. అంతకంటె ఏం రాయమన్నాను ? : అందులో తప్పేంలేదు కద ! మరింక పాపం పాపం అంటూ గోల పెట్టే స్తున్నావు. దేని గురించి ? దొంగతనం అన్నమాట గురించేనా ? అంటే, వాడు మనింట్లో ప్రవేశించి దొంగతనం చేసిడని రాయ

మన్నానా ? చేసేదని మనం అనడంలేదే, దొంగతనాని కొచ్చేదో మరెందు కొచ్చేదో మనకి తెలుసునా ? తెలియదే ! మాకు అనుమానంగా వుంది కాబట్టి పోలీసువారు మీరే దర్యాప్తు చెయ్యాలని. రాయమన్నాను. అదీ తప్పయితే, ఇంకేమని రాయమంటావో నువ్వే చెప్పు. చెప్పు, జవాబు చెప్పు ! చెప్పగలవా ? జవాబు చెప్పలేకపోతే నే చెప్పినట్టు చెయ్ ! చెప్పినట్టు చేస్తానని మాటిచ్చేవు. మాట తప్పి మరో పాపం కూడా చేస్తావా ? చెయ్యాలనుంటే చెయ్యి. లేకపోతే రాయి ! కలం తీసుకో ! రెండు ముక్కల్రాయి. వేగిరం ! ఊఁ !

సుశీల : (కళ్ళు మూసుకుని, మేజామీసారి తల కొట్టుకొని, కలం తీసుకొని గబగబా రాస్తుంది)

సార్వ : "దొంగతనానికి వచ్చినట్టుగా అనుమానంగా వుంది. కాబట్టి పోలీసువారు దర్యాప్తు చేయించవలసింది"....అంతే ! అంతేకదా !

సుశీల : (ఏడుస్తూ, పక్కగదిలోకి) తొందరగా వెళ్ళిపోతుంది :

సార్వ : (సుశీల రాసిన కాయితం తీసి చదువుకొని, ఫోన్ తీయడానికి వెళ్తున్నాడు. అంతలో గదిలోకి గభాల్న వస్తారు, సుందరరావు, కృష్ణారావు, మధుసూదనరావూను)

సార్వ : (సుశీల రాసిన కాయితం జేబులో పెట్టేస్తూ) ఏమర్రా బాయ్స్ ! ఏఁవిఁటీ సంగతి ? ఏఁవిఁటి హడావిడంతాను ? ఏఁవిఁరా అబ్బాయ్ ? ఎప్పుడు. మొన్నా ఒచ్చేవు ? ఏఁవిఁటలా వున్నావు ? జ్వరం రాలేదు కద, ఏఁవఁర్రా, అంతా అలా వున్నారేం ? ఈఁచ్చేడ్చి కొట్టినట్టున్నారేఁవిఁటి ? ఏఁవిఁరా క్రిష్ణా ? మాటాడవేం ? హూ ఈఁజ్ దట్ ఫెలో? వాడెవడు. ఆ కొత్త కుర్రాడు ? నే నెప్పుడూ చూసినట్టు లేదే !

(సుందర్రావు ఓ వార కూర్చుంటాడు)

కృష్ణ : పెదబాబుగారూ ! మీతో అర్జంటుగా మాటాడాలి !

సార్వ : మళ్ళీ మావాణ్ని ఏమైనా తంటాల్లో దించేవా ?

కృష్ణ : నేనేం దించలేదు పెదబాబుగారూ !

సార్వ : నువ్వు కాపోతే (అని మధూని చూపిస్తూ) వాడా అయితే ?

మధు : నాకేం తెలీదు.

సార్వ : అంటే నీ కంతా తెలుసన్నమాట. ఏఁవిఁటి, ఏం జరిగింది ?

కృష్ణ : ఏం లేదు. చెప్తున్నా.

సార్వ : నాకు నీ వ్యవహారాలేం నచ్చలేదురా అబ్బాయ్, సుందరం! ఈ వెధవ క్రిష్ణగాడితో నీకు స్నేహం ఏఁవిఁటి ? ఒరే, క్రిష్ణా! నీ పాదరు నా లాయర్ ఫాలోఅర్ కాబట్టి నిన్ను నా గుమ్మం తొక్కనిచ్చి, నా కొడుకుతో తిరగనిస్తున్నాను. మున్సిపల్ డిస్పెన్సరీలో కంపౌండర్ పిల్ల - విడో - రంగమ్మ కూతురు - తెల్సుకదా - అది నీ సంగతంతా చెప్పుకు నేడ్చింది. నువ్వు తిన్నగా మసులుకోపోతే, ఆఖరి కెక్కడ తేల్తావో తెలుసా ? మున్సబు కోర్టులో డామేజీలు, మేజిస్ట్రీటు కోర్టులో జెయిలూను. ఒళ్ళు కొవ్వెక్కి సంచరిస్తున్నావు వెధవా ! అదెంత ఏడ్చినా, నిన్ను చూసి దయదల్చి, దాన్ని "పో ముండా! లంజరికానికి భ్రూణహత్య వద్దులే ముండా ! పో! పో అనుభవించు" అని కూకలేసి నీ పీకలమీదికి రాకుండా దాన్ని తగిలేసేను. కాని, నువ్వీక ముందట నీ ప్రవర్తన మార్చుకోకపోతే ఆ ఒడ్డీ బేరం నీకు పూర్తిగా తగులుకోగలదు. జాగ్రత్త !

కృష్ణ : లేదు పెదబాబుగారూ! క్షమించండి సార్ ! అది చాలా దండుగండీ! అదికాదు పెదబాబుగారూ ! ఘోరం జరిగిపోయిందండీ !

సార్వ : ఏఁవిఁటి ఘోరం ?

కృష్ణ : ఎలా చెప్పడం పెదబాబుగారూ ?

సార్వ : ఏఁవిఁటి జరిగిందిరా రాస్కెల్ ? ఏఁవిఁటీ వాసన ? తాగేవుట్రా వెధవా ? తాగి ఏ బీటు వెధవతోనో తగువు తెచ్చుకున్నారా ? కొట్టుకున్నారా ? ఏం జరిగిందో చెప్పరేం ? నువ్వెవరయ్యా ? ఏఁవిఁటలా మంటి బుక్కటంలా అలా చూస్తూ విలబడిపోతావేం ? ఏ డొంకల్లోకి దూరి ఏ వెధవపన్లు చేసేరో, నోరు మెదపరేం ?

మధు : సత్యం, సత్యం, సత్యం చచ్చిపోయేడు సార్ !

సార్వ : ఏ సత్యం ? ఎక్కడ చచ్చేడు ? ఎవడు వాడు ?

కృష్ణ : నువ్వుండ్రా వెధవా, మధూ ! కొంపలు ముంచేట్టున్నావు ! పెదబాబుగారూ ! సర్ మనం రహస్యంగా మాటాడుకోవాలి. మనం తొందరగా ఏదో ఒకటి చెయ్యకపోతే పీకలు తెగిపోతాయి.

సార్వ : ఏఁవిఁట్రా ఆ మాటలు ?

కృష్ణ : అర్జంటూ సీరియసూనూ, మనం తప్ప మరెవరూ వుండకూడదు. ఎవరూ లేరు కదా ? (అని చుట్టూ చూసి. వెనక్కి వెళ్ళి గుమ్మం అవతల కూడా చూసి వస్తాడు)

సార్వ : (ముగ్గుర్నీ మరొకసారి వరసగా చూసి) వుండండి. (అని ప్రక్క గది గుమ్మం దగ్గరికి వెళ్ళి) సుశీలా—! సుశీలా!

సుశీల : (కళ్ళు తుడుచుకొంటూ గుమ్మందాకా వచ్చింది)

సార్వ : చూడు సుశీలా కిందికి వెళ్లి నాకు స్నానం, భోజనం, ఏర్పాట్లన్నీ చూడు! ఇప్పటికే ఆలస్యమయింది (అని అన్నాక. సుశీల వెళ్ళడం చూసి) తొందరపడకు నిదానంగా వుండు. మరేం భయం లేదు.

సుశీల : (వైటకి వెళ్తుంది)

సార్వ : (సుశీల వెళ్లాక ఒక్క క్షణం వుండి) చెప్పండ్రా యిడియట్స్. ఏ ఛండాలంలోకి దిగేరు.

సుంద : (సుశీల ఖాళీ చేసిన గదిలోకి వెళ్ళిపోయేడు)

సార్వ : (సుందరం వెళ్ళడం చూసి) ఏం జరిగిందిరా కృష్ణా, ఫూల్! అలా నీళ్ళు నములుతావేం ?

కృష్ణ : సత్యంగాడు చచ్చిపోయేడండీ పెదబాబూ!

సార్వ : 'చచ్చిపోయేడండీ పెదబాబూ!' అంటే నాకేం బోధపడుతుంది ? ఎవడా సత్యం! ఎప్పుడు చచ్చేడు ? ఎందుకు చచ్చేడు ?

కృష్ణ : సుంధరం కొట్టేసేడు, నెత్తిమీద.

మధు : సీసాతో కొట్టేసేడు, మూడుదెబ్బలు! నాలుగోసరికి సీసా విరిగి పోయింది. రక్తం! రక్తం!

సార్వ : ఏఁవిఁటఁ్రా ఇడియట్స్!! ఏఁవిఁటీ పేలాపన!! మా సుందరం: కొట్టడం ? చంపడం! రాస్కెల్స్ రాస్కెల్స్! మీరే మీరే! మీరే చేసేరంతాను, మా వాడేం చెయ్యలేదు!

మధు : నేలంతా నెత్తురు మయం! తలంతా రక్తం ముద్ద! నాకు భయం వేస్తోంది. నే వెళ్ళిపోతాన్రా కృష్ణా! నేనొక్కణ్ణీ వెళ్ళలేను.నువ్వురా పోలీసుల్తో చెబ్దాం! రాపోదాం.

సార్వ : ఆగక్కడ! అలా కూర్చో! నువ్వు కూర్చోరా రాస్కెల్! అలా కూర్చోండిద్దరూనూ. నా పర్మిషన్ లేనిదీ కదల్డానికి వీల్లేదు.

కదిత్తే, మళ్ళీ ప్రాణాల్తో పైకి వెళ్ళరు. జాగ్రత్త. నే నెంతకైనా సాహసుణ్ణి ! చెప్పండి యిప్పుడు చెప్పండి. ఏం జరిగింది ? ఇదంతా ఎక్కడ జరిగింది? అసలు విషయం ! మహా ముఖ్యం ! మీరు కాక యింకెవరైనా ఈ సంగతి జరగడం చూసేరా ?

కృష్ణ : మేం వేం వున్నాం. మరెవరూ లేరు.

సార్వ : పిట్ట మనిషి ?

కృష్ణ : పిట్టమనిషి లేడు.

సార్వ: ఇప్పుడు చెప్పు.

కృష్ణ : నల్ల చెరువవతల....(అని మిగతా అంతా నెమ్మదిగా రహస్యంగా చెప్తాడు)

సార్వ : నిజంగా చచ్చిపోయేడా? సరిగా చూసేవా ?ఇంకా బతికేవున్నాడేమో?

కృష్ణ : లేదు. మళ్ళీ వెనక్కి వెళ్ళి చూసేను. చచ్చిపోయేడు.

సార్వ : ఎంత సేపటికింద అయిం దిదంతా ?

కృష్ణ : సరిగ్గా పన్నెండు గంటలకి, మిల్లుబూరా అప్పుడే సరిగ్గా ఊదేరు.

సార్వ : మీరు వెళ్ళడం ఎవరైనా చూసేరా ?

కృష్ణ : చీకటితో వెళ్ళేం. మేం ఎవరితోనూ చెప్పలేదు. సత్యం తన మావ నడిగి కారు తెచ్చేడు ఎక్కడకో, ఎందుకో మాత్రం చెప్పలేదట.

సార్వ : మావాడు ఆ సమయంలో అక్కడున్నాడనడానికి అవకాశంలేదు కద ?

కృష్ణ : లేదనే అనుకుంటాను. తుపాకీ తెచ్చేసేను. ఆర్మీవాటర్ బాటిల్‌కూడా తెచ్చేసేను.

మధు : నేనేం చూళ్ళేదు, నాకేం తెలీదు.

సార్వ : నువ్వు నోర్ముయ్ కుర్రాడ. (అని కృష్ణారావుతో) ఎవడు వీడు ?

కృష్ణ : మాధవస్వామి కొడుకు.

సార్వ : మాధవస్వామి కొడుకా ?

మధు : నేను మాధవస్వామి కొడుకునే. కాని నాకేం తెలీదు. నేనేం చూళ్లేదు....అంతా ఆ సుందరంగారే చేసేరు. నాకేం తెలీదు.

సార్వ : షటప్ ! తాగుబోతు వెధవా !

మధు : సార్ !

సార్వ : సార్ లేదు గీర్ లేదు. నోరుమూసుకు పడుండు. అర మైలు దూరం కొడుతూంది వాసన.

మధు : సర్ !

సార్వ : నోర్ముయ్ !

కృష్ణ : (మధూని) కొంచం సేపూరుకోరా బాబూ !

సార్వ : (అటూ ఇటూ కొంచంసేపు పచారుచేసి) ఆ సత్యం ఎవడు ?

మధు : మా ఫ్రెండ్.

సార్వ : ఇడియట్ ఎవడు వా డసలు ?

కృష్ణ : ప్రొఫెసర్ కోసలరావు గారి మేనల్లుడు.

సార్వ : కోసల్రావంటే ఆ తల తిక్క వెధవేనా ?

కృష్ణ : సరిగ్గా చెప్పేరు.

సార్వ : మీరు వెళ్ళిన కారు కూడా వాడిదే నేఁవిటి ?

కృష్ణ : అవును.

సార్వ : అయితే అయితే మనం రిపోర్టివ్వకుండా ఊరుకుందికి వీల్లేదు. వాడు అంతా తవ్వేదాకా ఊరుకోడు....ఏం చెయ్యడం ?

కృష్ణ : పెదబాబూ ! నాదో ఐడియా ! సుందరాన్ని ఆస్పత్రిలో నిన్నటి తారీఖు వేయించి అడ్మిట్ చేయించేదాం. ఏదో మెడికల్ చెకప్ కోసం అని చెప్పొచ్చు.

సార్వ : కుదరదు. ఇది తలూకా ఆసుపత్రికాదు. అయినా వాడు దీన్లో లేడని చెప్పినా, మీరేమవుతారు ? ఎవడు చేసేడని అడుగుతే పోలీసులకి మీరేం చెప్తారు ? ముందా ప్రొఫెసర్ వెధవే మిమ్మల్ని అడుగు తాడు. కారు పట్టుకెళ్ళి ఇవ్వాలికద !

కృష్ణ : ఆగండి. అంతకంటే బ్రిలియంట్ ఐడియా !

సార్వ : ఏఁవిఁటది ?

కృష్ణ : సుందరాన్ని వాడు, ఆ సత్యంగాడే, చితకొట్టేసేడూ, అప్పుడు సుందరం వాణ్ణి డిఫెన్స్‌గా కొట్టేడూ అని సుందరం చేత రిపోర్టిప్పిద్దాం. మేం ఇద్దరం కూడా అవునవు నంటాం. ఆ పాటి అబద్దానికేం ఫరవాలేదు.

మధు : బాబో ! నాకేం తెలీదు.

కృష్ణ : అమ్మ ఈ మధుగాడితో గొప్ప చిక్కు, మాటిమాటికి పొట్లం విప్పి అంతరాత్మని బయటకు లాగుతానంటాడు. కావలిస్తే ఈ వెధవ అక్కడ లేనట్టుగానే చేసేద్దాం.

మధు : బాబ్బాబు అలా చేసేద్దూ. అవును నే నక్కడ లేను. నాకేం తెలీదు. కాని, కాని, ఉన్నానని తెలిస్తే ! అప్పు డెలాగ ?

సార్వ : ఇలాటి వాళ్ళు పైనుండి పోయినా డేంజరే ! ఏ పోలీసు వాడికైనా అనుమానం వేసి గట్టిగా దబాయించేడంటే ఇలాటి వాళ్ళు కథంతా పొసిగించేస్తారు. అలా లాభం లేదు.

కృష్ణ : మరైతే ఏం చేదామంటారు ?

సార్వ : వీడు వాణ్ని కొట్టాడు. అప్పుడు వాడు వీణ్ని కొట్టాడు.... ఇలాటి కథలేం లాభంలేదు. మా వాడసలు పిక్చర్‌లో ఉండనే కూడదు.

కృష్ణ : ఎలాగ ?

సార్వ : చెప్తా (అని ఆలోచించి) ఈ కుర్రా డెవరన్నావు ?

కృష్ణ : పాలిటిక్స్ ఆనర్స్ నాతోనే చదువుతున్నాడు.

మధు : మాధవస్వామి కొడుకుని.

సార్వ : ఏ మాధవస్వామి ? రాధా మాధవస్వామి కాదుకద కొంపతీసి !

కృష్ణ : అతనే !

సార్వ : నా బాంకు — అర్బన్ బాంకు—

మధు : అర్బన్ బాంకులో మా ఫాదరు కాషియరు.

సార్వ : హారి ! ఇంతవ కు చెప్పేవు కావేం ? (అని వీపుతట్టి) అయితే మావాడి వన్నమాటే ! ఇంత కొడుకున్నాడని మీ ఫాదరెప్పుడూ చెప్పనే లేదు.

మధు : మా ఫాదరు గొడవల్లో వున్నాడు.

సార్వ : తెలుసు. తెలుసు. నే నున్నానుకదా, మీకేం భయంలేదు. అర్బన్ బ్యాంకెవరి దనుకున్నావు ?

మధు : (వినకుండా) నేనీ గొడవలో చిక్కుకున్నాను. నాకు భయంవేస్తోంది.

సార్వ : (కొంతసేపు పచారుచేసి, ఒక నిశ్చయానికి వచ్చి) ఒకే అబ్బాయిలూ ! నే చెప్పినట్టు చెయ్యండి. మీకేం భయంలేదు. నే చెప్పేది శ్రద్ధగా వినండి. గాబరా పడిపోకండి.

కృష్ణ : చెప్పండి.

సార్వ : మీరేం చెయ్యనక్కర్లేదు. ఉన్నదున్నట్లుగా చెప్పెయ్యాలి. ఆ సత్యం గాణ్ణి సుందరమే కొట్టేడని చెప్పండి.

కృష్ణ : అలా చెప్పేమంటారా !

మధు : హమ్మయ్య !

కృష్ణ : అలా అయితే మరి మనవాణ్ని తప్పించడం ఎలాగ ?

సార్వ : సుందరమే కొట్టి చంపేసేడని చెప్పమన్నాను. కాని మన సుందరం అని చెప్పేనా ? మరో సుందరం గాడున్నాడు వాడు కొట్టేడని చెప్తారు మీరు. జరిగింది జరిగినట్లుగానే చెప్పేస్తారు. పేరు కూడా మార్చనక్కర్లేదు. మనిషే మారిపోతాడు. అంతే !

కృష్ణ : అలా చేసేడమే !

మధు : బాబోయ్ !

కృష్ణ : ఎవడీ రెండో సుందరం ?

సార్వ : "డాకూ, కేడీ, బద్మాష్, సంఘానికి చీడపురుగు. అలాటి వెధవలు జెయిల్లో ఉండడం సంఘానికి సేఫెస్టు అన్నమాట. వా డెవడో మామూలు మనలాంటి మంచి వెధవే అయితే వాడిమీద తోసేద్దాం" అని నేనంటానా ? వాడో దుర్మార్గపు వెధవ. ఎందరి కొంపలో కూల్చేసేట్ట వాడు. కొన్ని కూల్చడం నాకు స్వయంగా తెలుసు. అలాటి వెధవలు అన్ని పాపాలూ చేసేసి స్కాట్ ఫ్రీగా దిల్ ఖుషీగా తిరిగేడం అమాయకులు మన్లాంటి వాళ్ళకి డేంజరు ! కాని ఎప్పుడో అప్పుడు పాపం పండకపోదు కద ! అప్పుడు భగవంతుడు మన చేత వాళ్ళని శిక్షింపచేస్తాడు.

మధు : నేరం మరోడిమీద తోసేసుంటారా ! అమ్మో !

కృష్ణ : పెదబాబుగారూ ! పీకలు పోయేటంత అబద్ధమా ? !

సార్వ : మీరేం గాభరా పడొద్దని ముందే చెప్పేను. మా సుందరం మీకు ప్రాణ స్నేహితుడేనా ?

కృష్ణ : కాదన్నానా ? !

మధు : నాకతన్తో నిన్ననే పరిచయం అయింది.

సార్వ : స్నేహం కలియాలంటే ఆ టైము చాల్దా ! అలా అలా అయితే, నా కొడుకు నీకు స్నేహితుడు కాకపోతే, నీకు విరోధా ?

మధు : కాదు కాదు. ఫ్రెండే !

సార్వ : మరేం ? ! ఫ్రెండుని సేవ్ చెయ్యడానికి అపాటుపకారం చెయ్యలేవా ? స్నేహం అంటే ఇదేనా ? ఛ ! మావాడు మందుబుడ్డి దగ్గిర మాత్రం మీకు మిత్రుడా ! ప్రాణంమీద కొచ్చేసరికి పగవాడై పోయేవా !

కృష్ణ : అదికాదు పెదబాబుగారూ! మనవాడికి ఉపకారంచేస్తాం. కాని మరోడికి పీకలమీదికి తెమ్మనడం న్యాయమా ? కావలిస్తే ఏ రిపోర్టూ ఏమీ ఇవ్వకుండా గుప్‌చిప్‌గా వూరకుంటాం.

సార్వ : ఇది గుప్‌చిప్‌గా ఊరుకోొందికి వీల్లేని విషయం. మనం ఊరుకున్నా చచ్చిన శవం ఊరుకోదు. కంపు కొడుతుంది. ఎవడో ఒకడు వెళ్తాడు. ఏదో ఒకటి ఆరాతీస్తాడు. ముందు మీరా ప్రొఫెసర్ గాడికి వాడి కారు తీసుకెళ్ళి అప్పచెప్పాలి. "కారు తెచ్చారు. కాని మా అల్లుడేడీ." అని వాడడగడా ? అప్పుడేంచేస్తారు మీరు ? అందుచేత నేను చెప్పిందే బెస్టు ! కనుక్కునేవాళ్ళు నిజం కనుక్కునే లోపున మనం ముందే అబద్ధం ఆడెయ్యాలి. నీరు అటు వెళ్ళేలోపున అటు వెళ్ళనీకండా మనం ఇటు కాలువలు తవ్వేయ్యాలి. తవ్వకపోతే, అది అటే వెళ్ళి పోతుంది. జీవితం గురించి ఏ వల్లకాడైనా తెలిసి చస్తేనా మీకు ?

మధు : అబద్ధం ! ఘోరం ! పాపం ! టెరిబుల్ సిన్ ! బాబాయ్ ! నాకేం తెలియదు బాబోయ్ !

కృష్ణ : పెదబాబూ ! అంతటి అబద్ధం ఆడలేం పెదబాబూ ! అంతబద్ధం ఆడ్డం కష్టం. అవునా కాదా, మీరే ఆలోచించండి.

సార్వ : అయితే, నువ్వు అబద్ధం ఆడ కలవు కాని, అంతటి అబద్ధం ఆడలే నంటావ్. అంతేనా ?

కృష్ణ : అదికాదు పెదబాబూ ? మీరు....మమ్మల్ని....అబద్ధం....

సార్వ : అగు ! ఐవిల్ డు అల్ ది టాకింగ్ ! మీరు అబద్ధం ఆడలేరు.

మధు : ఆశ్చేం ! ఆశ్చేం ! మేం అబద్ధం ఆడలేం.

సార్వ : మీ రబద్ధం ఆడలేకపోతే నే నాడగల నబద్ధం. నే నాడతా నబద్ధం. నా ఆస్తి, నా ప్రాణం, నా కొడుకు - నా దేదైనా సరే, నా ఇంట్లో

పూచిక పుల్లయినా సరే-నా దాన్ని కాపాడుకోందికి నేనెంత ఘోర మైన అబద్ధం అయినానసరే ఆడేస్తాను; ఎంత ఘోరమైనా చేసేస్తాను. నా సంగతి మీకింకా తెలియకుంతా ఉంది. ఈ వేషం గీషం చూసి మర్యాదస్తుణ్ణి నుకుంటున్నారు కాబోలు. అవసరంవస్తే గూండాల్లో గూండాని. గూండాలకి మొగుణ్ణి. నా మీద కేసైనా ఒచ్చిందంటే లోకానికి నిప్పెట్టిదానికి వెనుదియ్యన్నేను. మీరనగా ఏపాటి, వెధవ ల్లారా ! ఇప్పుడు మీ రిద్దరు నా యింట్లో చిక్కడ్డారు. ఈ యింట్లో అడుగు పెట్టిన తరువాత లార్డు లిన్‌లిత్‌గో అయినా సరే నా పర్మిషన్ లేకుంతా మరింక బైట కడుగు పెట్టడానికి వీల్లేదు. ఇప్పుడిలా మీ రిద్దరు అలా కూర్చున్నపాట్న, మీ రిద్దరు అలా కూర్చుండగానే పోలీసు వాళ్ళకి రిపోర్టిప్పిస్తాను. ఏమని ఇప్పి స్తాను ? మీ రిద్దరూ కలిసి-సత్యంగాడో ఎవడో-ఆ వెధవని మీరే మీ ఇద్దరే కలసీ చంపేసేరని రిపోర్టిప్పిస్తాను. అప్పుడు, అప్పుడు మీరేం చేస్తారు ? మీరేం చెయ్యగల రిప్పుడు ? అక్కడ వాణ్ణి చంపేసి, ఇక్కడ నా దగ్గిరకొచ్చి "మమ్మల్ని ఎలాగైనా ఇందు లోంచి తప్పించండి మహాప్రభూ" అని నన్ను కాళ్ళావేళ్ళా పడి ప్రార్థించేరని, అవసరమైతే నేను కూడా సాక్ష్యం ఇస్తాను. అప్పుడే మవుతుంది ? ఆలోచించుకున్నారా ! నా మాట అబద్ధమని ఎవడైనా అనగలడా ! మీరిలా కూర్చునుండగానే 'ఎస్. ఐ ! ని పిలుస్తాను, పిలవమంటారా ?

మధు : (బిక్కచచ్చిపోయి) సర్ ! సార్ !

కృష్ణ : ఆదికాదు పెదబాబూ !

సార్వ : అదికాదు పెదబాబూ, ఇదికాదు పెదబాబూ, అని మళ్ళా అన్నావంటే ఐ విల్ కిక్ యు ! పక్క విరగ దంతాను. విరగదన్ని మీ ఇద్దర్నీ స్టేషన్కి పంపేస్తాను అంత దుర్మార్గం నేను చెయ్యగలను.

మధు : సర్ ! మీ అంతరాత్మ....

సార్వ : కాని, అంత దుర్మార్గం చేసేస్తాను అని అనడంలేదే నేను ! నాచేత అంత దుర్మార్గం చేయించకండి బాబుల్లారా అని ప్రార్థిస్తున్నాను. స్నేహితుణ్ణి కాపాడమని వేడుకుంటున్నాను. పుత్రభిక్ష పెట్టమని

గోల పెడుతున్నాను. కాని ఇంత పెద్ద ఒడ్డూ పొడుగూ వున్న వెధవ, అంత పెద్ద పార్లమెంటు మెంబరు మా కాళ్ళమీద పడ్డాడు కదా అని మీకు కళ్ళు నెత్తికెక్కాయి.

కృష్ణ : బావుందండీ పెదబాబూ ! కాని వాడెవడో ఆ సుందరం....

మధు : మధ్యని, వాడెవడో అమాయకుడు....

సార్వ : మిలిటరీలో ఉన్నాడన్న మాటే కాని, అమాయకుడూ నోర్లేని గోవు లాటి వాడూ మా సుందరం అని మీకు తెలుసు. నేను చెప్పక్కర్లేదు. ఆ రెండో సుందరంగాడు దుర్మార్గపు వెధవ. రౌడీ, గూండా, బద్మాష్ అని నేను స్వయంగా చెప్తున్నాను. నా మాట మీద మీకు నమ్మకం లేదా ? నే నబద్ధం ఆడతాననే మీ అభిప్రాయమా ?

కృష్ణ : మీ మాట నమ్మం అని మేం అన్నామా ?

సార్వ : నా మాట మీద నమ్మకం లేకపోతే, వాడి గురించి సబినస్పెక్టర్నే అడగండి. హిస్టరీ అంత చెప్తాడు.

కృష్ణ : వాడి గురించి నాక్కూడా కొంచెం తెల్సులెండి, వీడి మాలతి నోసారి అల్లరి పెట్టేడు. మాలతి నోసారి అల్లరి పెట్టేడు-జ్ఞాపకం లేదట్రా మధూ !

మధు : ఏమో బాబూ నాకేం తెలీదు. వాడెవడైనా వాడి కురిశిక్ష ! ఘోరం ! ఆ పాపం నే చెయ్యను. అంత ఘోరానికి నా అంతరాత్మ ఒప్పుకోదు. ఒప్పుకోదు నా అంతరాత్మ.

సార్వ : బ్రాందీ విస్కీ తాగడానికి నీ అంతరాత్మ ఒప్పుకొంటుంది. కాని దీనికి మాత్రం ఒప్పుకోదు. ఏం ! తప్పతాగి విస్కీ సీసాతో నువ్వే వాణ్ణెత్తిమీద కొట్టేవు. నువ్వింకా మైకంలోనే వున్నావు. పోలీసు వాళ్ళు తీసికెళ్తే ముద్దాయి తాక్కపోయినా తాగినట్టు సర్టిఫికెట్లిచ్చే డాక్టర్లున్నారు. నిన్ను తీసుకెళ్తే నువ్వింకా గేటు దగ్గి రుండగానే తాగిన వెధ వొచ్చేడని కాగితం రాసిచ్చేస్తాడు, మెడికల్ లాఫీసరు. తాగేసి నువ్వే చంపేవు సత్యంగాణ్ణి. అలా అని క్రిష్ణగాడు కూడా పలుకుతాడు.

మధు : ఘోరం ! అన్యాయం ! అధర్మం ! నేనేం చేయలేదు. నే నసలు తాగలేదు, వీళ్ళే తాగించారు. ఒద్దంటున్నా వినలేదు. నే తాగలేదు. నే

చంపలేదు. నేను చీమను చంపను. దేన్ని కూడా చంపొద్దంటాను. మేష్టగారూ ఇదంతా అధర్మం! నాకేం తెలీదు. నే వెళ్ళిపోతాను.

సార్వ: పారిపోతే మరీ ప్రమాదం. చంపేసి పారిపోయే వంటాం.

మధు: క్రిష్ణా! ఒకే నా స్నేహితుడివి!

కృష్ణ: మధూ! కామ్‌గా వుండు. గాభరా పడకు.

సార్వ: అబ్బాయిలూ! ఆలస్యం చేసినకొద్దీ పరిస్థితి విషమిస్తుంది. మనం ఏదో ఒకటి తొందరగా తెల్చుకోవాలి. నేను ఈ నేరం మీ ఇద్దరి మీదా తోయించేగలను. లేకపోతే యిద్దర్లోను ఏ ఒకరిమీదో తోయించేగలను. కాని అలా చేయడంలేదు. ఎంచేత అలాచేయడం లేదు? అలా చేస్తే అమాయకుల్ని, ఇద్దరు లేత కుర్రవాళ్ళని పాడు చేసి వాళ్ళ జీవితాలను నాశనం చేసిన వాణ్ణవుతాను. అలా చెయ్యడం నా కిష్టంలేదు. మీ క్షేమం మీ బాగూ ఆలోచించి అంత టన్యాయం నేను తలపెట్టడంలేదు. అది మీరు బాగా గుర్తుంచుకోండి. నేను కాబట్టి సరిపోయింది కాని మరోడైతే ఆ దుర్మార్గప్పని మూణ్ణిమ షాల్లో మంచినీళ్ళ ప్రాయంగా కళ్ళు మూసుకు మరీ చేసేస్తాడు. తరవాత మరో విషయం! ఒకే క్రిష్ణా! నీ బతుకంతా నా చేతిలో వుంది. నీ పాదర్‌కి నేను పెట్టే బిచ్చం తప్ప ఊళ్ళో ఎక్కడా వేరే బిచ్చం లేదు. తరవాత ఆ కంపౌండర్ పిల్లని ఏ మంత్రసాని ముండ దగ్గిరికి తీసుకెళ్ళేవో, అదటువంటి పని చెయ్యనంటే నువ్వూ, ఆ కంపౌండర్ ముండా కలిసి ఏం చేసేరో నా కంతా తెలుసు. భ్రూణ హత్య కూడా హత్యే! అదికూడా నేరమే! ఆ సంగతి మర్చిపోకు. తరవాత-నువ్వు! మధూవా ఏంటి ట్నీ పేరు?

మధు: మధుసూదనరావు.

సార్వ: మాధవసామి కొడుకువి.

మధు: పూర్తిపేరు రాధామాధవస్వామి.

సార్వ: చిత్తం! రేపు కోర్టులో అలానే పిలుస్తారు.

మధు: కోర్టెందుకూ?!

సార్వ: మీ నాన్నేదో గొడవల్లో ఉన్నాడన్నావు. ఆ గొడవల వివరాలు నీకు పూర్తిగా తెలియకపోవచ్చు. కాని నాకు తెలుసు. మీ నాన్న

అర్బన్ బాంక్‌లో కాషియర్. అర్బన్ బాంకు అవడం మట్టుకు నాది. మీ నాన్న నేను తల్చుకుంటే ఈ నిమిషంలో జెయిలుకి వెళ్ళాడు. తరవాత మా'కెలా ఉన్నా, ముందు బేడీలు చేతులకి వేసి పోలీస్టేషన్కి తీసుకెళ్తారు.

మధు : మా నాన్న....మా నాన్న జెయిలు కెందుకూ ? డబ్బంతా రేపు తప్పితే ఎల్లుండి ఇచ్చేస్తాడు. మాకు బోలె డాస్తుంది.

సార్వ : మీకు ఆస్తుంటే మీ ఆస్తి వాడుకోవాలి గాని, బాంక్ సొమ్ము వాడు కోమని ఎవడు చెప్పేడు ! మీ నాన్న ఆ పని ఎవడితోనూ చెప్ప కుండా చేసేడు. పైకేం రాకుండా యింతవరకూ నే నాపడంవల్లే అదాగింది: మీ నాన్న పుస్తెల్తో సహా మీ అమ్మ బంగారం అంతా అమ్మేసి, ఇదిగో రేప్పొద్దున్న పదకొండు గంటల్లోపున డబ్బంతా జమ కట్టేస్తానని, ఇందాట్లా దార్లో కారాపించి రేపటిదాకా టైమి మ్మని బతిమాలుకున్నాడు. బతిమాలుకొంటే ఇవ్వనన్నానా ? కావ లిస్తే ఎల్లుండి దాకా తీసుకోమన్నాను. ఏదో పిల్లవాడు, ఏదో అవసరం వచ్చింది, టైముకి చేతలో కాణీ లేకపోతే బాంకు లోది తీసేడు. తీసి ఎగ్గొట్టేస్తానన్నాడా ? లేదు ఇచ్చేస్తానన్నాడు. ఆ పాటి దానికి అలాటివాణ్ణి జెయిలుకి పమ్మించి పచ్చని సంసారానికి నిప్పు పెడితే నా కొచ్చే దేముంది ? ఏం లేదు. అంచేత టైమి చ్చేను. వెళ్ళమన్నాను. కాని చెప్తున్నాను-వాడి కొడుకే నా ఇంటికి నిప్పు పెడుతూంటే నేను చూస్తూ కూర్చోలేను. ఈ క్షణంలో నేను పోలీసువారికి రిపోర్టివ్వగలను.

మధు : (కళ్ళు తుడుచుకొని) సర్ ! ఇది అన్యాయం! మీరు మా బలహీనత చూసి మమ్మల్ని దబాయిస్తున్నారు. ఇది అధర్మం :

సార్వ : అధర్మం, అన్యాయం ! వాటితో నాకు సంబంధం లేదు, బాంకులో ఉన్న ప్రజల సొమ్ము తీసేసి తినేడం కూడా అధర్మమే. అందు గురించి ఈ క్షణంలో రిపోర్టు చెయ్యగలను పోలీసువారి కన్నాను. రిపోర్టు చేస్తానని అనలేదే ! మీకు లేక పోయినా నా కుంది కనికరం.

మధు : సార్ ! మీగలా....మీరలా మీరు చెప్పినట్టు మేం చేస్తే అమాయ

కుడికి ఉరిశిక్ష పడుతుందే! ఎలా చెయ్యడం అంత నేరవూ, అంత పాపవూనూ? నా అంతరాత్మ నన్ను చంపేస్తుంది.

సార్వ: అబ్బాయి! నువ్వింకా వెర్రివాడివి.

కృష్ణ: మాలతి నంత ఆశపెట్టి. చివరకి పెళ్ళాన్ని పొమ్మన్నావారే మధూ! అప్పుణ్ణీ అంతరాత్మేవైపోయింది? రగ్గు కప్పుకు పడుక్కుం దేవిటీ?

సార్వ: నువ్వూరుకోరా, క్రిష్ణా, రాస్కెల్! నువ్వూ ఆ కుర్రాడ్ని పెక్కరించడమే! ఆ పిల్లెవరో మంచి దనుకుని పెళ్ళాడదా మనుకొనుంటాడు. కాని, దాని సంగతంతా తెలిసినవాళ్ళు పెద్దలు అమ్మో నాన్నో-ఒద్దని చెప్పుంటారు. పెద్దలు చెప్పినమాట వినొద్దంటావురా వెధవా!

కృష్ణ: లేదు సార్!

మధు: మా మదరు చేసుకో ఒద్దంది.

సార్వ: ఒద్దనే ఒద్దంటారా? అందులోను యువర్ మదర్? ఆవిడ గురించి నన్నడిగితే విజం చెప్పమంటావా? నా అభిప్రాయంలో ఆవిడ పతివ్రతామతల్లుల్లో పతివ్రతామతల్లి? ఈ రోజులలో భర్త బాకోసం పుస్తెల్తో సహా సర్వస్వం ఏ ఆడది చ్చేస్తుంది? విజంగా చూడు, మీ మదర్ లాంటి వాళ్ళకి మనం అంతా చెయ్యెత్తి దండం పెట్టాలి. చూడమ్మా మధూ! నేను పెద్దవాణ్ణి, అంటే నీ కంటే పెద్దవాణ్నేనా వయసులో?

మధు: అవును.

సార్వ: అవును కదా! మరి విను. నేను నీకంటే కాస్త తెలిసిన వాణ్ని. నాకు నీ కంటే ఎక్కువ అనుభవ జ్ఞానం వుంది కదా?

మధు: ఉంది.

సార్వ: అందుచేత, చూడు! నేను, అన్నీ బాగా ఆలోచించి కాని మాట్లాణ్ను. నువ్వీం దాట్లానించేఉరిశిక్ష ఉరిశిక్షంటున్నావు. అంటే ప్రతి ఖూనీ కేసులోనూ ముద్దాయికి ఉరిశిక్ష వేసేస్తా రనుకుంటున్నావా, వెర్రివాడా! తాగేసి ఒకర్నొకరు తిట్టుకు తన్నుకోవడంలో ప్రాణం పోయిందంటే అదేం పెద్ద నేరం కాదు. ఏడాదో రెండేళ్లో

శిక్ష పడుతుంది. కావలిస్తే ఏ క్రిమినల్ లాయర్నయినా అడిగి చూడు. అన్నట్టు ఆ మధ్య మీ కాలేజి గేటు దగ్గర కొట్టుకు చావడంలో ఒకడు చచ్చేడు జ్ఞాపకం వుందా ?

కృష్ణ : అవును వాడికి-అంటే ఆ కేసులో ముద్దాయికి- మూడేళ్ళు శిక్ష వేసేరు.

సార్వ : మరి నే చెప్పింది రైటేనా ?

కృష్ణ: రైటే.

సార్వ : చూడు మధూ! వాడికి—అంటే ఈ బద్మాష్ సుందరం గాడికి—ఖచ్చితంగా పీక తీసేస్తారూ అంటే నేను మాత్రం అంత పాపం తలపెడతానా ?

మధు : అవున్లెండి....కాని....

సార్వ: అవును. నువ్వు చెప్పింది నిజమే ! తిక్క వెధవ జడ్జీ ఎవడైనా ఉన్నాడంటే ఆత్మహత్య కేసులో కూడా ముద్దాయి నెవణ్నో ఒహణ్ని యీడ్చుకురండి. పీక తీసేస్తా నంటాడు. లేకపోలేదు అలాంటి వాళ్ళు. అటువంటప్పుడు, మనం కిడెంచి మేలెంచాలి. చిన్నవాడివే అయినా నువ్వు చెప్పిన విషయం కూడా అవును. మనం బాగా ఆలోచించాలి. ఏమైనా ప్రమాదం జరుగుతుందేమో నని నీకు అనుమానం వుండొచ్చు. అయినా నువ్వేం భయపడ కా విషయం గురించి, నేనున్నాను. జడ్జితో అసలు విషయం నేను ముందుగా చెప్పే వుంచుతాను.

మధు: జడ్జితో మీరెలా చెప్పగలరు ?

సార్వ : ఇప్పుడున్న జిల్లా జడ్జి ఎవరో నీకు తెలుసా ?

మధు : ఎవరు ?

సార్వ : ఎవరా ? స్వయం నా బావమరిది మేనమామ ?

కృష్ణ: ఎవరూ ? బెంగుళూరు సాంబమూర్తిగారి మేనమామా ?

సార్వ : కాక యింకెవ రనుకుంటున్నావు ?

కృష్ణ : హమ్మ, అయితే ఫరవాలేదురా మధూ !

సార్వ : మీరు కుర్రాళ్ళు? మీ కివన్నీ ఏం తెలుస్తాయి :

మధు: అలా అయితే....అలా అయితే....అలా అయితే వాడికెవడికో

ఓ ఏళ్లాది, తప్పితే రెండేళ్లు జెయిల్తప్ప మరింకే శిక్ష వేయించ వని ప్రామిస్ చేస్తారా ?

సార్వ : (మధూ చెయ్యి పట్టుకొని, అతని అరచేతిలో చెయ్యి వేసి నిమిరి) ఇదిగో ! చెయ్యేసిగినంత ప్రామిసు చేస్తున్నాను. నాకు మాత్రం నీకు లాగే పాపభీతి లేదూ ? భూత దయా దైవభక్తీ యిటు వంటి నీకెలా ఉన్నాయో నాకూ అలానే వున్నాయి. నేనేం రాక్షసుణ్ణి కానే ! నేనూ నీలాంటి మనిషినే, నాకూ అంతరాత్మ౦ది.

కృష్ణ : మరి మేమేం చెయ్యాలో చెప్పండి.

సార్వ : ఇలారా నాయనా మధూ ! టూకీగా మూడు ముక్కలు రాద్దువు గాని యిలారా !

మధు : ఏం రాయాలి ?

కృష్ణ : ఆయనంతా చెప్తార్రా !

సార్వ : మీరేం రాయాలో చెప్పాకదూ. మూడే ముక్కలు. అంతే ! నలు గురం మేవు పిక్నిక్కి వెళ్ళేం. అక్కడ వాళ్ళిద్దరూ తాగేరు. మాటా మాటా అనుకున్నారు. సీసాలో వాణ్ణి వీడు కొట్టేశాడు. పారిపోయేడు. వాడు చచ్చి పోయేడు. చిత్తగించవలెను. మధు ! కృష్ణ ! అంతే ! అంతకంటే మరేం లేదు. జరిగిందంతా చూసేరు. కాబట్టి ఎలా జరిగిందలా చెప్పగలరు మరేం భయంలేదు. కోర్టులో మిమ్మల్ని క్రాసెగ్జామినేషన్లో నక్ తేజ్ బహదూర్ సప్రూ వచ్చినా మీ తల వెంట్రుక తెంపలేడు. స్టోరీలో ఒక రెండు మార్పు లుంటా యనుకోండి. ఉన్నా మరేం ఫరవాలేదు. చదువుకున్నారు. పరీక్షలు పాసయ్యేరు. మార్పులకి వీలుగా ఆ పాటి కప్పదాట్లు వెయ్యలేరా ? ఇన్నట్టు !

కృష్ణ : మీరు పక్కనుంటే మా కొచ్చిన ఫరవా మరేం లేదండి మమ్మ ల్నెవడు బోల్తా కొట్టించగలడు.

సార్వ : మరోటి కూడా వుంది. ఏమిటో తెలుసా ? కోర్ట్లో వాడి కెవడూ గట్టి ప్లీడ రుండడు. ఉన్నా ఫరవా లేదనుకోండి. కాని, వుండడు. కాణీ లేని వెధవలకి ఖూనీ కేసుల్లో గవర్నమెంటే కనికరించి ప్లీడర్నిస్తుంది. ఇస్తుంది కాని భూలాభాయ్ దేశాయ్ లాటి వాణ్ణి

యివ్వదుకదా. అంతగా అయితే, కోర్టులో కన్సర్ న్డ్ క్లార్కుతో మాట్లాడవలసిన విధంగా మాట్లాడి, ఏ నవవ ప్లీడరో డిఫెన్స్‌కి ఒప్పేట్టుగా చూడొచ్చు, కేసేమైనా, ప్లీడరుకి రోజుకి పాతిక కిడతాయి. వాడికదే మహా ప్రసాదం. అమాయకుడ, మీ కివన్నీ ఎలా తెలుస్తాయి ? నన్నడగండి. నేనంతా చెప్తాను. ఇలా రండి. (అని పేజా దగ్గరికి వాళ్ళిద్దర్నీ తీసుకు వెళ్ళి, మధూకి నెమ్మదిగా డిక్టేట్ చేస్తాడు. అతని చేతా, కృష్ణారావు చేతా సంతకాలు చేయిస్తాడు. తరువాత....)

సోమ : (ఫోన్ తీసి 'త్రీ సిక్స్' డయల్ చేసి) ఎవరది కిష్టప్పా ! వెంటనే రావాలి.జవాన్ని పమ్మించొద్దు. నువ్వే రావాలి. రైట్ !....ఓయ్ మధూ, నువ్వా గదిలోకి వెళ్ళమ్మా ! మావాడితో కాస్త మాటాడుతూ వుండు.

మధు : (పక్క గదిలోకి వెళ్తాడు)

సార్వ : అమ్మ ! చచి నంత పనయిందిరా, వెధవని ఒప్పించే సరికి !

కృష్ణ : వీణ్ణసలు, అంతరాత్మ గాడని పిలుస్తాం మేం వంతా.

సార్వ : కాయితం మీద సంతకం పెట్టేసేడు కదా ! మరింక ఫరవాలేదు. వాణ్ణలా ఒదిలీ. కాని, ఇంతకీ మా వాడికీ ఆ చచ్చిన వాడికి, అసలీ తగువంతా ఎందు కొచ్చింది ?

కృష్ణ : ఎందుకా ? .. ఎందుకంటే....

సార్వ : మూతముప్పిడి కూడదోరే ! అసలేమిటో తెలిస్తే గాని దానికీ నకిలీ తయారు చేయలేం ! అందుచేత ఆ అసలేమిటో చెప్పు సరిగా.

కృష్ణ : ఎవరో ఆడపిల్ల గురించి తగువొచ్చింపండీ. ఆవిడ గురించీ మీ గురించీ కూడా ఒచ్చింది. మా పాదర్ని అలా అంటావా, అని మన సుందరం కోపం తెచ్చుకొని ఆ పని చేశాడు.

సార్వ : (ఆలోచించి) అయితే, ఆ రాస్కెల్ ఆ చచ్చిన వెధవ, వాడిదే తప్పంతా అన్నమాట ! మావాడి తప్పేం లేదన్నమాట ! అంతేనా ?

కృష్ణ : అంతే !

సార్వ : (ఒక్కసారి అటూ ఇటూ తిరిగి) కాని, మరి యీ కేసులో నా పేరెక్కడా మైక్రోస్కోప్‌పెట్టి వెదికినా కనిపించకూడదే ! ఎలాగా!

కృష్ణ : దానికేం వుంది ? ఎవరో ఆడపిల్ల గురించి మాటా మాటా అనుకున్నా రని చెప్పేస్తాం ! మీ పేరెక్కడా వినిపించనియ్యం.

సార్వ : నువ్వు వినిపించనియ్యవు. కాని వాడు, వెర్రివెధవో ?

కృష్ణ : మధూగాడా ? ! వెధ వప్పుడు తాగేసున్నాడు. ఇలా ఇలా జరిగిందని వివరాలు నే చెప్పాలి వాడికి. అప్పటి షైకంలో యిప్పుడు వాడికి సరిగా ఏమీ జ్ఞాపకం వుండదు.

సార్వ : నువ్వు వాణ్ని జాగ్రత్తగా కాసుకోలిస్మే !

కృష్ణ : కాసుకోనా మరి !

సార్వ : అందాక, నువ్వా అలా వెళ్లు! మావాణ్ని కాస్త సముదాయించి ఓదార్చు. రేపు మెయిల్‌కి మాత్రం వాణ్ని మనం యిక్కడ డుంచ కుండా బెంగుళూరు పమ్పించేయాలి.

కృష్ణ : అలాగే చేద్దాం.

సార్వ : అందాకా అలా వెళ్లు వెళ్లు.

(కృష్ణ ప్రక్క గదిలోకి వెడతాడు)

కిష్టప్ప : (ప్రవేశిస్తూ) ఏం బాబాయ్ ! వాడిమీద కంప్లేంటు రాశారా, లేదా ? రాస్తే ఇలాగా అలాగా రాసిమాత్రం లాభంలేదు. వాడి కెంత బుర్ర తిరుగుడో తెలుసా ? అమ్మమ్మమ్మ ! చెడ్డ డేంజరస్ ఫెలో !

సార్వ : స్టేషనో అల్లరి పెట్టాడా ?

కిష్టప్ప : పెట్టడం యిలాగా అలాగ్గానా ? బ్రహ్మాండం బ్రద్దలు కొట్టేసేడు. లాకప్‌లోకి ఒకంతట వెళ్ళేడా ? గుజాయించుకొని కేకలేసి యుద్ధం చేసి గాని వెళ్ళేడు కాడు. సమయానికి స్టేషన్లో మెన్ లేరు. గుడ్డి వెధ వొకడూ, సొట్ట వెధ వొకడూ ఉంటే మాత్రం ఏం లాభం ?

సార్వ : ఆఖరికి లాకప్‌లోకి వెళ్ళేడా ?

కిష్టప్ప : వెళ్ళడూ ? వాడూ వెళ్ళాలి. వాడి బాబూ వెళ్ళాలి. వెళ్ళకపోతే చంపయినా తోసేస్తాను. కాని, చూడండి బాబాయ్ ! ఆ వెధవని స్వేర్ చెయ్యడానికి వీల్లేదు. బిందే, ముంతా, కంచం, చెంబూ యిలాటి చిన్న చిన్నవి వాడిమీద పెట్టి ప్రయోజనంలేదు. ఏ 'రాబరీ'నో తగిలించి సెషన్స్‌కి పంపిస్తేనే గాని ఆ 'స్కౌండ్రల్'కి తెంపరేచరు 'నార్మల్'కి దిగదు.

సార్వ : అయితే. అలా చేద్దాం అంటావా ?

కిష్టప్ప : ముమ్మాటికి అలా చెయ్యాలి.

సార్వ : అలాటప్పుడు ఉంపరేచరు నార్మల్‌కే దిగాలంటా వేఁవిఁటి ? సబ్ నార్మల్‌కి దిగిపోయే స్లాటు వేసేను.

కిష్టప్ప : వేసేరా ? !

సార్వ : వెయ్యఁనా మరి ? !

కిష్టప్ప : బాబాయ్, మీకు మించిన చెయ్యి మరోటి లేదు.

సార్వ : పులిపంజా యిది ! మరోటి మరోటీకాదు. దీన్తో వాడు ఖతం, నీకు చిన్న క్రాస్ బెల్టూ !

కిష్టప్ప : క్రాస్ బెల్టే ?

సార్వ : ఏం ? సి. ఐ. గా ప్రమోషనొస్తే, చేదా నీకు.

కిష్టప్ప : చెప్పండి బాబాయ్ ! చెప్పండి వేగిరం.

సార్వ : ఇలారా, చెప్తానంతా! (అని ఓ వారకి తీసుకువెళ్ళి జరిగిందంతా చెప్తాడు. కాయితం - మధూ, క్రిష్ణా సంతకాలు చేసినది - కిష్టప్ప చేతికి యిస్తాడు. అతను చదివేక కాయితం మళ్ళీ తన చేతిలోకి తీసుకుంటాడు.)

సార్వ : ఏం ఎలా వుంది ? మోహం అలా పెట్టేవేం ?

కిష్టప్ప : బాబాయి ! నేను పిల్లలవాణ్ని.

సార్వ : (ఒక్క క్షణం వూరుకొని) పిల్లలవాడివైతే, పోలీసుద్యోగం మానుకో !

కిష్టప్ప : న్యాయం చెయ్యడానికని చెప్పి - ఖాకి బట్టలూ, టోపీ గీపీ - మొత్తం యూనిఫారం అంతా తగిలించుకొన్నాను. కాని అదే యూనిఫారంతో దురన్యాయాలు రోజుకి నూటయాభై చేస్తున్నాను. అయితే. ఇదీ ఖూనీ కేసు ! ఎన్ని ఘోరాలైనా చెయ్యొచ్చు కాని ఈ ఒక్క ఘోరాం మాత్రం చేయకూడదని మా 'డిపార్టుమెంట్'లో 'అన్‌రిటెన్' రూలుంది.

సార్వ : ఏదో సామెత చెప్పినట్టుంది వ్యవహారం. అన్ని అష్లూ పోయి. ఆఖరికి నువ్వే నేవిఁటి నాకు పెద్ద అడ్డు ? !

కిష్టప్ప : క్షమించండి బాబాయ్ !

సార్వ : క్షమించడం, క్షమించకపోవడం, ఆ ప్రసక్తి లేదిప్పుడు. ఇదిగో! ఖూనీ కేసు గురించి రిపోర్టిస్తున్నాను. తీసుకో (అని కంప్లేంట్ కాయితాన్ని కిష్టప్ప మీదికి విసురుతాడు. అది కిష్టప్ప తీసుకుంటాడు.) తీసుకున్నావా! మరింక ఆ కాయితం పట్టుకుని నీకేం చెయ్యా లనుందో చెయ్యి. ఇద్దరు స్టూడెంట్ కుర్రాళ్ళు-మామూలు వాళ్ళు కాదు. ఆనర్స్ కుర్రాళ్ళు - ఖూనీ జరిగింది. అది మేం కళ్లారా చూసేం అని స్పష్టంగా నల్ల సిరాతో రాసి మరీ రిపోర్టిస్తున్నారు. అది అబద్ధం - ఫాల్స్ అన్చెప్పి నువ్వెలా 'రిఫర్' చేస్తావో చూస్తాను. అలా 'రిఫర్' చేసేక నీ నౌఖరి నీ కెలా నిలబడుతుందో అదీ చూస్తాను.

కిష్టప్ప : అదికాదు బాబాయ్ !....

సార్వ : నోర్మూయి! ఆ ఏధవ, ఆ 'స్కౌండ్రల్', ఆ 'స్కాంప్' ఆ వెధవ నా ఇంట్లో వున్నాడు కాబట్టి ఊరవతల నేం ఎలా చెయ్యగల డనేనా నీ అభిప్రాయం ? అంచేత ఈ రిపోర్టు అబద్ధం అని రాసేగల వనేనా నీ ఉద్దేశ్యం ? సరే అలాగే అను. ఆ స్కౌండ్రల్ని నువ్వే స్వయంగా నా ఇంట్లోంచి తీసుకు వెళ్ళినట్టుగా చెప్పు చూదాం కావ లిస్తే ! నా ఇంటిలోంచి తీసుకువెళ్ళలేదని, వాడెవడో నాకు తెలియ దనీ, నువ్వెప్పుడూ నా ఇంటికి రానేలేదని నేను చెప్తాను. ఎవరి మాట చెల్లుతుందో, ఎవరిమాట నిలబడుతుందో చూదాం ! చూద్దాం రా, బాబూ, చూద్దాం!.... నీకు నౌకరీ ఇచ్చి నీకు శతకోటి అధి కారాలు, ఫుల్ పవర్సు ఇచ్చి, నిన్ను రావలా పెట్టుకున్నందుకు మాకు మంచి ఉపకారమే చేస్తున్నావు. ఆఖరికి కంచే చేను మేసిం దిట ! బావుందిరా బాబూ ! బావుంది !

కిష్టప్ప : మీ రలా హీటెక్కిపోతే నే మాటడగల్నా బాబాయ్ ? కానే కాదని మీ రలా అంత పట్టుబడితే, మరి నేను కాదనగలనా ? ఖూనీ కింద ఛార్జీ పెట్టడం, పెట్టినా, తరవాత ఏదో మినహాయింపుల సెక్షన్ల కింద వాణ్ని ఓ ఏడాదికో, రెండుకో, పీక లేకుండా దించుకోవచ్చు. దానికి మీకేం అభ్యంతరం లేదు కదా ?

సార్వ : ఇందాట్లా అలా సబబుగా మాట్లాడేవా ? హీటెక్కిపోయానంటే

ఎక్కిపోనా మరి ! నే చెప్పే భోగట్టా, నా ప్లాటూ పూర్తిగా విన కుండానే ఖాకీ బట్టల్లోంచి అంతరాత్మని బైటికి లాగేవు అంత రాత్మ ఎక్కడైనా ఉంటుందనుకున్నాను. కాని ఖాకీ డ్రెస్సులో ఉంటుం దనుకోలేదు.

కిష్టప్ప : ఎధ వంతరాత్మ ! దాన్నలా ఏడవనిద్దురూ బాబాయ్ ! అంతరా త్మెప్పుడూ పనయిన తర్వాత ఏడ్చి తిడుతుందే కాని పనికి ముందు మాత్రం ఎప్పుడూ మన కడ్డురాదు. రాకూడదు.

సార్వ : అసలైన వేదాంతం అంటే అదే ! క్రిష్ణపరమాత్మలా మాటాడేవు.

కిష్టప్ప : అంత కాంప్లిమెంటు పారేకండి ! అంచేత కమింగ్ టు ది పాయింట్-మీరు చెప్పినట్లు. మన కిప్పుడు పని ప్రధానం. ఏడ్చే వాళ్ళని ఆ తరువాత సముదాయించుకోవచ్చు....కానైతే బాబాయ్ ! ఒకటుంది.

సార్వ : ఏమిటది ?

కిష్టప్ప : వాడు, ఆ ఎధవ, ఖూనీ జరిగిన టైముకి మీ ఇంటిలో ఉన్నానని 'అలిబీ' పెడితే ?

సార్వ : పెట్టనీ ! ఆ విషయం వాడు రుజువు చేసుకోవాలి కదా !

కిష్టప్ప : వాడె రుజువుచేసుకోవా లనుకోండి. చేసుకొందికి మిమ్మల్నిడిఫెన్స్ సాక్షిగా వేసుకొంటే ? అప్పుడేం చెయ్యడం ? ఇందాట్లా అలా ఏదో త్రెటెన్ చేసేడు కూడా కదా ! పై వెధవ లెవరూ వాడికి డిఫెన్స్‌కి రాకుండా చూసే పూచీ నాది. కాని మిమ్మల్నే వేస్తే ?

సార్వ : అదంతా నా కొదిలేరా అబ్బాయ్ ! డిఫెన్స్ వేస్తే నేను సాక్ష్యం చెప్పాలి కాని నువ్వు కాదుకదా !

కిష్టప్ప : నన్నడుగుతే ఆ మాట అబద్ధం అనేస్తాననుకోండి. ఏ మాట ? మీ ఇంటినుంచి వాణ్ని తీసుకెళ్ళిన మాట. పూర్తిగా ' ' చేసే స్తాను. 'డినై' చేసేడం మా రెగ్యులర్ రొటీన్‌లోది. కాని, మీరు?

సార్వ : నువ్వు శిష్యుడివి. నేను గురువుని. నువ్వు నాకు చెప్పాలా !

కిష్టప్ప : (నవ్వి) సరే ! బాబాయ్ ! వెళ్ళొస్తాను. ఆ కుర్రాళ్ళేరీ ? అక్కడికి వెళ్ళాలి. ఇంకా శవ పంచాయితీ తతంగం అంతా ఉంది కదూ ! వెళ్ళాలి వేగిరం.

సార్వ : పెళ్ళు. వాళ్ళని కూడా పంపిస్తాను.

కిష్టప్ప (గుమ్మందాకా వెళ్ళి) అన్నట్టు బాబాయ్! చిన్నమాట మర్చే పోయేను.

సార్వ : ఏఁవిఁటా చిన్నమాట ?

కిష్టప్ప : మరేంలేదు. ఆడిట్ పార్టీ వొచ్చి నెత్తిమీద కూర్చుంది. ఒట్టినే కూర్చుందా ? కూర్చొని తంతోంది. వెధవ ఎలాటి వెధవలో తెలుసు కదా. 'కుక్కలు చెప్పులు వెదకును, తక్కువ వాడెల్ల వేళ తప్పే వెదకున్ !' మా ఎస్. పి. ఆఫీసు చెక్ చేస్తున్నారిప్పుడు. ఆఫీసంతా తినేసి మారు తెమ్మంటున్నారట. ఎస్పీ ఆఫీసుకి అమ్మకి చిక్కిన తినేసి మారు తెమ్మంటున్నారట. ఎస్పీ ఆఫీసుకి అమ్మకి చికిన మేకలు ఎవరున్నారు ? మేమే కదా ! వాళ్లు మమ్మల్ని తినేస్తున్నారు. అంచేత....

సార్వ : అంచేత కిందికి ఆఫీసులోకి పోదాం పద.

(ఇద్దరూ వెళ్ళారు.)

# 3

సమయం: పగలు పదకొండు గంటలు దాటింది. సెషన్స్‌కోర్టు సమావేశం అయివుంది. ముద్దాయీ బోన్లో సోమసుందరరావున్నాడు, ఎదురుగా జడ్జిగారు ఎత్తుగా కూర్చున్నారు. ఇద్దరికీ మధ్యగా హాల్లో లాయర్ల టేబిల్ పెద్ద దొకటుంది. బల్లకి అటూ ఇటూ పబ్లిక్ ప్రాసిక్యూటరూ. డిఫెన్సు లాయరూ కూర్చున్నారు. బెంచి గుమస్తా నిల్చొని వున్నాడు. జడ్జిగారికి కొంచెం చేరువగా హాలు నిండా ప్రేక్షకు లున్నారు. హెచ్చు మంది స్టూడెంట్సు, కుర్ర లాయర్లుకూడా కొంత మందివున్నారు. హాలుపైట సార్వభౌమరావూ. కృష్ణారావూ, మధుసూదనరావూ, (యూనిఫారంలో) కిష్టప్పా వుంటారు.

జడ్జి : ఛార్జి తెలుగున చదివి వినిపించు ! (అని కాయితం ఒకటి బెంచి గుమాస్తా చేతికి యిస్తాడు)

బెంచిగుమాస్తా : చిత్తం ! (అని కాయితం తీసుకు చూస్తూ) వెంటారావ్ సోమసుందరరావ్ నువ్వేనా ?

సోమ : సుందరం అంటారు.

బెంచి : పెంటారావ్ సోమసుందరరావు-నువ్వేనా ?

సోమ : అవునని చెప్పేను.

బెంచి : నేను చదివేది శ్రద్ధగా విను.

సోమ : వింటాను. చదివేది శ్రద్ధగా చదువు.

బెంచి : నీవు యీ సంవత్సరం మే నెల ఇరవై మూడో తారీఖున పగలు పన్నెండు గంటల సమయంలో ఈవూరికి సుమారు ఆరు లేక ఏడు మైళ్ళ దూరంలో, నల్ల చెరువవతల అడివిలో, సత్యనారాయణ ఉరఫ్ సత్యం అనే ఆసామీని చంపుదామనే ఉద్దేశంతో, అతని నెత్తిపై విస్కీ సీసాతో బుద్ధి పూర్వకంగా కొట్టి, గాయపచి అతనిని చంపినా వనిన్నీ' కాగా, నీవు ఖూనీ నేరం చేసి ఇండియన్ పీనల్ కోడులో మూడు వందల రెండు సెక్షన్ ప్రకారం శిక్షింపదగియున్నావనిన్నీ నీ మీద అభియోగం మోపబడింది. నీవు నేరం చేసినావా ? నేరం చేయలేదా ? లేక విచారణ జరుప మంటావా ?

సోమ : ఆ సత్యంగాణ్ణి నేను చంపేనా, లేదా ? అదేనా నీ క్కావలసింది?

బెంచి : అవును, అందుకు నువ్వు సమాధానం చెప్పాలి.

సోమ : చెప్తున్నాను. సరిగ్గా రాసుకో. నేను వాణ్ణి చంపలేదు. నేరాలు లక్షచ్చేసేను. కానీ యీ నేరం నే చెయ్యలేదు. మరోటి కూడా రాసుకో ! నే నప్పుడా రోజున సార్వ భౌభౌరా వింట్లో వున్నాను.

జడ్జి : భౌభౌ రావేమిటి ?

సోమ : భౌభౌరావంటే పార్లమెంటు మెంబరు. ఆ రోజున మధ్యాహ్నం పన్నెండు గంటలకి నేను ఆ ముసిలాడింట్లో వున్నాను.

జడ్జి : అంతేనా ? ఇంకా ఏమైనా వుందా ?

సోమ : ఇప్పటి కింతే !

జడ్జి : పెరిబుల్ ఫెలోలా వున్నాడు.

ప్రాసిక్యూటర్ : స్వాతంత్ర్యం తరవాత మనిషి.

డిఫెన్స్ లాయర్ : కుర్రవాడు ! ఇంకా అజ్ఞానం

బెంచి : (సోమసుందరరావుతో) నంతకం చేస్తావా ?

సోమ : నిశానీ పెటరు. అదే చేస్తాను.

జడ్జి : విచారణ ప్రారంభిద్దాం.

ప్రాసి : చిత్తం ! (అని లేచి) దిగువ కోర్టువారి కమిటల్ ఆర్డరు తమరు చూసే వుంటారు. కేసు గురించి టూకీగానైనా తమరికి ముందు మనవి చేయవలసిన అవసరం వుండ దనుకుంటాను.

జడ్జి : సాక్షిని పిలిపించండి.

ప్రాసి : చిత్తం.

జడ్జి : ఇదిగో మీరు ! మీరే ! (అని డిఫెన్స్ లాయర్ని ఉద్దేశించి అంటాడు.

డిఫెన్స్:అయ్యా అయ్యా ! (అంటూ లేచి నిలబడతాడు)

జడ్జి : మిమ్మల్ని యింతకుముందు నేను చూళ్ళేదు. నాకు చెంతాడు క్రాసెగ్జామినేషన్ యిష్టం లేదు. అవసరమైన విషయాల గురించి మూడేసే ముక్కలు ! తెలిసిందా !

డిఫెన్స్: అయ (అని కూర్చుంటాడు)

ప్రాసి : మధుసూదనరావుని పిలవ్వోయ్ (అని బంట్రోత్తో చెప్తాడు)

బంట్రోతు: (వరండాలోకి వెళ్ళి) మధుసూద్రావ్ ! మధుసూద్రావ్ !

మధు : (హాల్లోకి వచ్చి నిల్చుంటాడు.)

బంట్రోతు: (హాల్లోకి వచ్చి మధుని ఉద్దేశించి) మీరేనా మధుసూద్రావు ?

మధు : అవును.

బంట్రోతు : మరి, పలకరేం ! ఇట్రండి(అని అతన్ని సాక్షి బోను ఎక్కించు తాడు.)

బెంచి : చూడండి ! నేను చెప్పినట్టు చెప్పండి. దేవుని ఎదుట ప్రమాణం చేసి-

మధు : చే దేవుని ఎదుట ప్రమాణంచేసి,

బెంచి : అంతా నిజం చెప్తాను.

మధు : అంతా చెప్తాను....నిజం.

బెంచి : అబద్ధం చెప్పను.

మధు : అబద్ధం .... చెప్పను.

బెంచి : మీ పేరు ?

మధు : నా పేరా ? మధుసూదనరావు. మాధవస్వామి-అంటే రాధా మాధవ స్వామి కొడుకుని.

ప్రాసి : సరే లెండి. ఇలా చూడండి. నే నడిగే ప్రశ్నలకి సావధానంగా జవాబు లివ్వండి. కోర్టంటే కొత్త కదూ మీకు ?

మధు : అంతా చూస్తే నాకు....భయం వేస్తోంది.

ప్రాసి : మరేం గాభరా పడకండి. కోర్టువారి వైపలా చూడండి. భయం పోతుంది. (అని కోర్టువార్ని చూసి వినయంగా నవ్వుతాడు.)

జడ్జి : కానీయండి.

ప్రాసి : చిత్తం. చూడండి మధూగారూ ! మీ దీవూరే కదూ !

మధు : ఇక్కడే వుంటున్నాం.

ప్రాసి : మీరేం చేస్తున్నా రిప్పుడు ?

మధు : ఏం చేస్తున్నాను ? సాక్ష్యం ఇస్తున్నాను కదూ !

ప్రాసి : (నవ్వి) కాదుకాదు. అసలు మీకేం పని ? ఏం చేస్తున్నారు ?

మధు : చదువుతున్నాను. అనర్సు - పాలిటిక్సు ఆనర్సు. ఫైనల్ ఇయర్ చదువుతున్నాను. మరింకేం చెయ్యడం లేదే !

ప్రాసి : చూడు మిస్టర్ మధు ! సత్యనారాయణ-అతన్నే సత్యం అంటారు-అతన్నీకు తెలుసా ?

మధు : తెలుసే! 'లా' చదివేవాడు చాలా మంచివాడు.

ప్రాసి : అతను, పాపం, చాలా మంచివాడా ?

మధు : వాడికి అబద్దం అంటే అసహ్యం.

ప్రాసి : అబద్దం అంటే అసహ్యంకదూ అతనికి. అతను ఇప్పుడున్నాడా ?!

మధు : లేడే!

ప్రాసి : ఏమయేడు ?

మధు : చచ్చిపోయేడు.

ప్రాసి : ఎలా చచ్చిపోయేడు ?

మధు : తలమీద విస్కీ....విస్కీ సీసాతో కొట్టేస్తే చచ్చిపోయేడు.

ప్రాసి : ఎవరు కొట్టేరు ?

మధు : సుందరం.

ప్రాసి : అతన్ని పోల్చగలవా ? ఇక్కడున్నాడా ?

మధు : (ముద్దాయి బోనువైపు చూసి తల తిప్పేసుకుంటాడు.)

ప్రాసి : ఇక్కడున్నాడా ?

మధు : (తలవంచుకు నిలబడతాడు.)

ప్రాసి : ఇక్కడున్నాడా ? చూసి చెప్పండి.

సోమ : అంత అబద్ధం ఆడాలంటే కలేజా వుండాలి.

ప్రాసి : ఉంటే ఉన్నాడని చెప్పండి. లేకపోతే లేడని చెప్పండి. ఏదో ఒకటి చెప్పాలి.

మధు : ఉన్నాడు.

ప్రాసి : చూపించండి.

మధు : (ముద్దాయి వైపు ముఖం తిప్పకుండా, చెయ్యిజాపి చూపిస్తాడు)

ప్రాసి : బోనులో ఉన్నతనేనా ?

మధు : అవునవును. అతనే అతనే! (అని నుదురు తుడుచుకుంటాడు.)

ప్రాసి : కొట్టినతను అతనేకదా! ఎన్నిసార్లు కొట్టేడన్నారు ?

మధు : మూడు నాలుగుసార్లు.

ప్రాసి : ఎక్కడ ?

మధు : తలమీద.

ప్రాసి : ఎటు వైపునుండి.

మధు : వెనకనించి.

ప్రాసి : ఇదంతా ఎప్పుడు జరిగింది ?

మధు : ఈ సంవత్సరం. మే నెల ఇరవైమూడో తారీఖున.

ప్రాసి : ఎన్ని గంటలకి ?

మధు : పన్నెండు గంటకి. మిట్ట బారా-పన్నెండు గంటల బారా-అప్పుడే పూదేరు కూడాను.

ప్రాసి : పగలా ? రాత్రా ?

మధు : పగలే.

ప్రాసి : ఎక్కడ, ఏ జాగాలో జరిగింది ?

మధు : నల్ల చెరువు లేదూ ? అక్కడ. దానవతల. ఇక్కడికి ఆరు మైళ్ళ పైన ఉంటుంది.

ప్రాసి : మీరప్పుడు అక్కడున్నారా ?

మధు : నేనూ, క్రిష్ణగాడూ కూడా వున్నాం.

ప్రాసి : క్రిష్ణగాడంటే కోర్టువారికి తెలీదు. పూర్తిపేరు చెప్పాలి.

మధు : కృష్ణారావు, నా క్లాస్‌మేటు.

ప్రాసి : నల్ల చెరువు అవతలకి ఎవరెవరు, ఎందుకు వెళ్ళేరు ?

మధు : నేను, క్రిష్ణగాడు, సత్యం, సుందరం చీకటితోనే పిక్నిక్కి వెళ్ళేం. సుందరం గువ్వల్ని కొడతానని తుపాకీ తీసుకు వచ్చేడు.

ప్రాసి : తుపాకీ ఏమయింది ?

మధు : ఆ వేళ....సుందరం తీసుకు పోయుండాలి.

ప్రాసి : మీరు చూళ్ళేదా ?

మధు : నేను గాభరాలో వున్నాను.

ప్రాసి : సర్లే ! అక్కడికి రావడం వెళ్ళడం ఎలాగ ? నడిచా లేక ?....

మధు : సత్యంలేడూ ? వాళ్ళ మామ కారు మీదే వెళ్ళేం.

ప్రాసి : ఎందరు వెళ్ళేరు ?

మధు : ఎందరం వెళ్ళేం ? మేం నలుగురం.

ప్రాసి : తిరిగి ఎందరు వచ్చేరో చెప్పగలరా ?

మధు : నేనూ, క్రిష్ణా....

ప్రాసి : సుందరం-అంటే, ఈ ముద్దాయి ఏమయేడు ?

మధు : ఏమయేడు ? మా తోటే కార్లో....కార్లో....మాతో కార్లో రాలేదు.

ప్రాసి : ఏమయేడు ?

మధు : పారిపోయేడు (అని నుదురు తుడుచుకుంటాడు). తుపాకీ పట్టుకు పారిపోయేడు ?

సోమ : అయ్యకి చెమటలెక్కి పోతున్నాయి. అబద్ధం ఆడాలంటే కారెక్కి జల్సా చేసినట్టు కాదు.

జడ్జి : ఆస్క్ హిమ్ టు షటప్ !

బెంచి : కోర్టువారు నిన్ను నోరు మూసుకో మంటున్నారు.

సోమ: (వెటకారంగా) చిత్తం చిత్తం.

బంట్రోతు: సైలేన్స్ !

ప్రాసి : ఈ కొట్టడానికి ముందు ఏం జరిగింది ?

మధు : సుందరం, సత్యం దెబ్బలాడుకున్నారు.

ప్రాసి : దెబ్బలాడుకోడం అంటే కొట్టుకున్నారా ?
డిఫెన్స్: దెబ్బలాడుకోడం అంటే కొట్టుకోడం కాదా? (అంటూ లేస్తాడు)
ప్రాసి : ఆ పాటి మాటకి మీరలా దెబ్బలాడకండి గురువు గారూ!
జడ్జి : ప్రొసీడ్ (డిఫెన్స్ లాయర్ కూర్చుంటాడు.)
ప్రాసి : (మధూని) ఏం కొట్టుకున్నారా ?
మధు : కొట్టుకోలేదు. మాటా మాటా అనుకున్నారు. తరువాత సత్యం చిరాకుపడి దూరంగా వెళ్ళిపోయాడు. సుందరం వెనక నుంచి వెళ్ళి కొట్టేడు.
ప్రాసి : సత్యం ఎడంగా ఎందుకు వెళ్ళాడు ?
మధు : మాటా మాటా అనుకున్నాక "నీతో నాకు మాటలేమిట్రా" అని సత్యం కొంచెం ఎడంగా వెళ్ళిపోయాడు. సుందరాన్ని చూసి విసుక్కున్నాడు.
ప్రాసి : సుందరం అప్పుడు మామూలుగానే ఉన్నాడా ?
మధు : తాగివున్నాడు. విస్కీ తాగాడు.
ప్రాసి : పోలీసు వారికి మీరు రిపోర్టిచ్చారా.
మధు : ఇచ్చేం. అక్కణ్నుంచి వచ్చి రిపోర్టిచ్చాం. ఇచ్చాక పోలీసువారితో కలసి అక్కడికి వెళ్ళేం.
ప్రాసి : (బెంచి గుమాస్తావద్ద కట్టలోంచి కాగితం తీసుకొని) ఇదేనా రిపోర్టు? (అంటూ మధూకి యివ్వగా అతను చూస్తాడు.)
మధు : (కాయితం చూసి తిరిగి ఇచ్చేస్తూ) యిదే !
ప్రాసి: (కాయితం బెంచి గుమాస్తాకి ఇచ్చేస్తూ) సత్యం తొడుక్కున్న బట్టలు పోల్చగలరా ?
మధు : పోల్చగలను.
ప్రాసి : బెంచి గుమాస్తా పక్కనున్న వస్తువులలో బట్టలు కోర్టు బంట్రోతు చేత తీయించి) అవేనా ?
మధు : అవే !
ప్రాసి : విస్కీ సీసాతో కొట్టేడన్నారు ! అదే మయింది.
మధు : పగిలింది. దాని పీకమాత్రం మిగిలిపోయింది.
ప్రాసి : (బెంచి గుమాస్తా బల్లమీద వున్న బొట్లం, పగిలిన సీసా పిడి

చూపించి) మిగిలిన గాజు పెంకులూ, పగిలిన సీసా పిడి యివేనా ?

మధు : అవే.

ప్రాసి : రక్తంతో తడిసిన మన్నుకూడా పోలీసులు సాంపిల్ కోసం కొంత తీసేరా ?

మధు : తీసేరు.

ప్రాసి : (వెంచి గుమాస్తా బల్ల మీద్ది మరో పొట్లం చూపించి) ఇదే నాటి మన్ను ?

మధు : అదే !

ప్రాసి : చూడు, మిస్టర్ మధు! నీకూ ఆ ముద్దాయికీ ఏమైనా విరోధం వుందా ?

మధు : లేదే !

ప్రాసి : పోలీసువారు నిన్ను దర్యాప్తు చేశారా ?

మధు : అడిగేరు.

ప్రాసి : అంతేనండి. (అని కోర్టువారితో చెప్పి కూర్చుంటాడు)

జడ్జి : క్రాస్.

డిఫెన్స్: అయ అయ (అంటూ లేచి నిల్చుంటాడు) చూడండి ! ఆ సత్యానికి అబద్ధం అంటే అసహ్యం అన్నారు. ఆ సంగతి మీకెలా తెలుసు ?

మధు : అబద్ధాలాడే వాళ్ళని తిడుతూ వుండేవాడు.

డిఫెన్స్: ఎవరెవర్ని తిట్టగా మీరు విన్నారు ? తిట్టగా మీరు విన్నారా ?

మధు : విన్నాను.

డిఫెన్స్: అబద్ధాలాడితే ఎవర్ని తిట్టగా విన్నారు ? మీ ఫ్రెండు కృష్ణారావు నతను తిట్టేడా ?

మధు : అండే....అంటే....(అని నసుగుతూ వుంటాడు)

డిఫెన్స్: తిట్టేడా ?

మధు : తిట్టేడు.

డిఫెన్స్: మిమ్మల్ని కూడా ఎప్పుడైనా తిట్టేడా ?

మధు : (తెలివి తెచ్చుకొని) లేదు.

డిఫెన్స్: కృష్ణారావుని ఎందుకు - అబద్ధాలాడతా డనేనా తిట్టేడు ?

మధు : కాదు.

డిఫెన్స్: మరెందుకు ?

మధు : వాళ్ళిద్దరూ స్నేహితులు కదూ ! సరదాకి ఒరే ఫూల్ అంటే ఒరే ఫూల్ అనుకుంటారు. అంతే !

డిఫెన్స్: చూడండి ? సత్యం, సుందరం దెబ్బలాడు కున్నారన్నారు. ఎంత సేపు దెబ్బలాడుకున్నారు ?

మధు : అయిదు నిమిషాలసేపు.

డిఫెన్స్: దేని గురించి ?

మధు : ఎవరో ఆడపిల్ల గురించి.

డిఫెన్స్: ఎవరా ఆడపిల్ల ?

మధు : (ఆలోచించి) శీలో శైలో - సరిగా గుర్తులేదు.

డిఫెన్స్: మీరు దగ్గరుండే విన్నారా ?

మధు : విన్నాను.

డిఫెన్స్: మరెందుకు గుర్తులేదు ? మీరుగాని తాగి వున్నారా ?

మధు : (గాభరా పడతాడు)

డిఫెన్స్: మీరా వేళ తాగేరా. లేదా ? ?

మధు : సుందరం తాగమన్నాడు....

డిసెన్స్: ఏ సుందరం ?

మధు : ఏ సుందరం !

డిఫెన్స్: ఏ సుందరం మిమ్మల్ని తాగమన్నాడు !

మధు : ఏ సుందరం తాగమన్నాడు ?....అతనే !

డిఫెన్స్: అతను ఎలా వుంటాడు ?

ప్రాసి : (లేచి) అడిగేదేదో మీరు సూటిగా, తిన్నగా అడగాలి.

డిఫెన్స్: సూటిగా తిన్నగానే అడుగు తున్నాను.

ప్రాసి : అలా అడగడంలేదు (అని కూర్చుంటాడు)

డిఫెన్స్: (మధూని) మిమ్మల్ని తాగమని ఏ సుందరం అన్నాడు ?

మధు : అతనే, ఆ సుందరమే :

జడ్జి : ఏ సుందరం ? ఆ ముద్దాయేనా ! మరింకే సుందరమైనా వున్నాడా ?

మధు : (చెమట తుడుచుకుంటూ) సుందరాలు ఎంద రున్నారు ?

డిఫెన్స్: ఎవరున్నారో మీరు చెప్పాలి! ఎందరున్నారు? మీకు మరో సుందరం

తెలుసా ?

మధు : తెలీదు తెలీదు. ఇతనే తెలుసు. ఇతనే తాగమన్నాడు. (అని ముద్దాయిని చెయ్యిజాపి చూపిస్తాడు)

డిఫెన్స్: తాగమంటే తాగారా ?

మధు : నేనూ, క్రిష్ణా తాగలేదు.

డిఫెన్స్: సత్యం తాగేడా ?

మధు : తాగేడు. గాజు గళాసుల్తో సత్యమూ, అతనూ తాగేరు. సోడాలు కలుపుకు తాగేరు.

డిఫెన్స్: విస్కీ-సీసా అన్నారు. నిండు సీసాయేనా ?

మధు : నిండు సీసాయే !

డిఫెన్స్: అదంతా సత్యం, సుందరం యిద్దరే పూర్తిగా తాగేరా ?

మధు : ఎంత తగారో నేను చూళ్ళేదు.

డిఫెన్స్: మాటా మాటా అనుకున్నారన్నారు కదా ? మరి మీరేం కలగ జేసుకోలేదా ?

(కోర్టులో మర్యాదస్తుల్లా కూర్చున్న యిద్దరు చారుల్లో ఒకాయన వైటకి వెళ్ళి పైనున్న సాక్షులతో సంప్రతిస్తాడు)

మధు : అది నేనేం పెద్ద తగు వనుకోలేదు.

డిఫెన్స్: సత్యానికీ సుందరానికి అంతకుముందు తగువులేమైనా వున్నాయా ?

మధు : నాకు తెలీదు. సుందరంతో నా కావేళే పరిచయం అయింది. సత్యం తీసుకొచ్చాడు.

డిఫెన్స్: మీరా అడవిలోకి పోలీసువారితో మళ్ళీ వెళ్ళేరు కదూ ?

మధు :నేనూ క్రిష్ణాకూడా వెళ్ళేం.

డిఫెన్స్: ఈ సీసా పిడి చూడండి. ఇది సుందరం వదిలేసి పారిపోయే డన్నాడు కదూ ! ఎక్కడ పడేసేడో మీరు చూసేరా ?

మధు : చూసేను. అక్కడే పడేసేడు.

డిఫెన్స్: మీరు పోలీసువారితో కలిసి వెళ్ళినప్పుడు మళ్ళీ దీన్ని చూసేరా.

మధు : చూసేను.

డిఫెన్స్: మొదట ఎక్కడుందో మళ్ళీ వెళ్ళినప్పుడు కూడా అక్కడే వుందా ?

మధు : అక్కడే వుంది.

డిఫెన్స్: మీరు కానీ, కృష్ణారావు కానీ దీన్ని ముట్టుకున్నారా ?
మధు : లేదు.
డిఫెన్స్: మీరు అక్కడికి మళ్ళీ వెళ్ళినప్పుడు అక్కడ జనం ఎవరైనా వున్నారా ?
మధు : అక్కడికి పోలీసు వారితో వెళ్ళాం కదూ ?
డిఫెన్స్: పోలీసువారూ, మీరూ కలసి అక్కడికి వెళ్ళినప్పుడు అక్కడ జనం వున్నారా అని అడుగుతున్నాను.
మధు : మేం వెళ్ళేసరికి అక్కడ ఎవరూ లేరే !
(మొదటి వారుడు. లోనికి వస్తాడు. రెండో మర్యాదస్తుడు బైటికి వెళ్ళి కిష్టప్పా, కృష్ణారావుతో సంప్రదిస్తాడు. కిష్టప్ప తన చేతి వేళ్ళు చూపించి కృష్ణారావుతో ఏదో చెప్తూ వుంటాడు)
డిఫెన్స్: బాగా గుర్తుందా మీకు ?
మధు : గుర్తుంది.
డిఫెన్స్: చూడండి మధుసూధనరావుగారూ ! సత్యం పడిపోయేడు కద, మీరు వెళ్ళి ఏదైనా అతనికి చికిత్స చెయ్యడానికి ప్రయత్నం చేశారా ?
మధు : నేను చెయ్యలేదు.
సోమ : ప్రేణం పోతుంటే చూస్తూ వూరుకున్నావురా ?
డిఫెన్స్: (ముద్దాయిని) నువ్వు మాటాడకూడదు, (అని మధూ వైపు తిరిగి) చికిత్స చెయ్యడానికి మీరు ప్రయత్నం చెయ్యలేదా ?
మధు : నాకు భయం వేసింది. కృష్ణగాడు మాత్రం సత్యం ముఖంమీద నీళ్ళు జల్లేడు.
డిఫెన్స్: అప్పటికి సత్యం బతికే వున్నాడా ?
మధు : (గాభరాపడి) నేను చూళ్ళేదు.
డిఫెన్స్: మీరు అక్కడున్నంత సేపూ సత్యం బతికున్నాడో లేదో చూణ్నే లేదా ?
మధు : లేదే ! నేనే చూళ్ళేదు కృష్ణ చూసేడు.
డిఫెన్స్: నీళ్ళు జల్లేరన్నారు, నీళ్ళెక్కడవి ?
మధు : వాటర్ బాటిల్లోవి !

డిఫెన్స్: వాటర్ బాటిల్ ఎక్కడిది ?

మధు : (చెమట తుడుచుకొంటూ) సుందరం తెచ్చేడు.

డిఫెన్స్: మీరు పట్టుకొచ్చేశారా ఆ వాటర్ బాటిల్ని !

మధు : నే తీసుకురాలేదే !

డిఫెన్స్: పోలీసువారు ఈ సీసా పిడితోపాటు దాన్ని కూడా స్వాధీనపర్చుకున్నారా ?

మధు : నేను మళ్ళీ చూళ్ళేదే. కారుదగ్గరికి వెళ్తూ, వెళ్తూ క్రిష్ణగాడు ఎందుకో గాని వెనక్కి వెళ్ళాడు వాడుకాని తీశాడేమో.

డిఫెన్స్: సుందరం తుపాకీ పట్టుకు పారిపోయా డన్నారు. అదొక్కటే పట్టుకు పోయాడా !

మధు : అదొక్కటే పట్టుకు వెళ్లాడు.

(రెండో చారుడు లొనికి వస్తాడు. మొదటి చారుడు బైటికి వెళ్ళి మధూ చెప్పిన దానిని గురించి కబురు అందజేస్తాడు)

డిఫెన్స్: తుపాకి వుందన్నారు కదూ ?

మధు : అదతను పట్టుకుపోయే డనేసేను కదూ ?

డిఫెన్స్: అనేసేర్లెండి. అదికాదు నే నడిగేది. సీసాతో కొట్టినప్పుడు పక్కనే తుపాకి వుందా ?

మధు : పక్కనే వుంది.

డిఫెన్స్: చూడండి ! సుందరం మీ సత్యాన్ని కొట్టడం చంపడం అంతా అబద్ధం, ఈ ముద్దాయి అసలు అక్కడికి రాలేదు. అక్కడ లేనే లేదని అంటున్నా డతను.

మధు : అంటున్నాడా ? (అని రుమాల్తో నుదురు తుడుచుకుంటాడు)

డిఫెన్స్: అవును అలానే అంటున్నాడు. అతను కొట్టి, చంపేడన్న మాట అబద్ధం అంటున్నాడు.

మధు : నేనబద్ధం ఆడుతున్నానా....లేదే ! లేదు. నే నబద్ధం ఆళ్ళేదు.... నా అంతరాత్మ....నా అంతరాత్మ ఒప్పుకోదు.

జడ్జి : అంతేనా ? ఇంకేమయినా అడుగుతారా ?

డిఫెన్స్: ఇంకేం లేదండి. (అని కూర్చుంటాడు)

బెంచి : (మధూని) మీరింక దిగండి (అని, మధూ సాక్షి బోను దిగాక ఇలారండి ఇందులో సంతకం చెయ్యాలి.
(అని జడ్జి వ్రాసిన వాంగ్మూలపు కాగితం మీద సంతకం చేయిస్తాడు. అతను సంతకం చేసేక జడ్జిగారు ఆ కాయితం మీద సంతకం చేస్తాడు. మధుసూదనరావు కోర్టు హాలులో ఒక వార కూర్చుంటాడు)

జడ్జి : తరువాత సాక్షి

ప్రాసి : కృష్ణారావు.

బంట్రోతు: (బైటికి వెళ్ళి) కిస్నారావ్ ! కిస్నారావ్ !

కృష్ణ : (కోర్టు హాలులోకి) ఎస్ సర్ ! (అంటూ వస్తాడు)

ప్రాసి : అలా అక్కడికి వెళ్ళు (అని సాక్షి బోను చూపిస్తాడు. కృష్ణారావు అక్కడికి వెళ్ళి విల్చుంటాడు)

బెంచి : నే చెప్పినట్టూ చెప్పండి దేవుని ఎదుట ప్రమాణం చేసి అంతా నిజం చెప్తాను అబద్ధం చెప్పను.

కృష్ణ : ఇదిగో దేవుని ఎదుట ప్రమాణము చేసి చెప్తున్నాను ! అంతా నిజమే చెప్తాను. నిజం తప్ప అబద్ధం చెప్పను.

బెంచి : మీ పేరు ?

కృష్ణ : కృష్ణారావు. కిషన్ అని కూడా అంటారు.

సోమ : ఆగురా బాబూ ! దేవుని యెదుటే ప్రమాణము చేస్తున్నావా ?

కృష్ణ : అవును.

సోమ : యెదుట నీ దేవుడెక్కడా కనిపించడేం ?

కృష్ణ : నీక్కనిపించలేదా దేవుడు ?

సోమ : లేదే!

కృష్ణ : అది నీ దుఃదృష్టం ? (అని చిరునవ్వు నవ్వుతాడు)

సోమ : ఆ దేవుడు నీకు నిజంగా కొంపతీసి కనిపించాడేంటి ? అది వాడి దురదృష్టం !

జడ్జి : దట్ విల్ డూ ! ! ఆస్క్ దట్ ఫెలో టు షటప్.

బెంచి : (ముద్దాయిని వుద్దేశించి) ఓయీ ! నువ్వు నోరు మూసుకోవాలి,

బంట్రోతు: సైలేన్స్ !

జడ్జి : (ప్రాసిక్యూటర్ని) అడగండి సాక్షిని !

ప్రాసి : చిత్తం (అని కృష్ణారావుని) మీ దేవూరు ?

కృష్ణ : ఇదేవూరు, మరో వూళ్లేదు నాకు.

ప్రాసి : ఏం చేస్తున్నారు ?

కృష్ణ : ఆనర్స్ - ఫైనల్ ఇయర్ ? సబ్జెక్టు - పాలిటిక్సు.

ప్రాసి : సత్యనారాయణ అనే కుర్రవాణ్ని నీకు తెలుసా ?

కృష్ణ : అఫ్‌కోర్స్ ! 'లా' స్టూడెంట్ మీకు "సత్యనారాయణ !" మాకు సత్యం.

ప్రాసి : ఇప్పుడున్నాడా అతను ?

కృష్ణ : గుడ్‌నెస్ గ్రేషన్! ఎలావుంటాడు? చచ్చిపోయాక ఇంకావుంటాడా?

ప్రాసి : అతనెలా చనిపోయేడు ? ఎక్కడ చనిపోయేడు ? ఎప్పుడు చనిపోయేడు ? నీకు తెలిసిన వివరాలన్నీ కోర్టు వారితో చెప్పు.

కృష్ణ : అంతా, టూకీగా టకటకా చెప్పేసుంటారా ?

ప్రాసి : అలానే చెప్పు. అభ్యంతరంలేదు. టూకీగా, టకటకా - కావల్సిందే అది.

కృష్ణ : మే నెల - ఇదే సంవత్సరం - మే నెల ఇరవైమూడో తారీకు- అర్లీ మాణింగ్ - చీకటితోటి బయల్దేరేం.

ప్రాసి : ఎవరెవరు ?

కృష్ణ : మై సెల్ఫ్, అంటే నేను, నంబర్ వన్. మధు - అంటే ఇందాట్లా వాడు - నంబర్ టు, సుందరం - అంటే అడుగో అతను-నంబర్ త్రీ, తరవాత సత్యం నంబర్ ఫోర్ - నలుగురం బయల్దేరాం.

ప్రాసి : సత్యం అంటే చనిపోయిన ఆసామీవేనా ?

కృష్ణ : అయామ్ సారీ ! సత్యం అంటే చనిపోయిన ఆసామి అనడం కరెక్ట్ కాదు, హి వాజ్ ది మాన్ హూ వాజ్ కిల్డ్ ! చంపబడ్డ ఆసామీ.

సోమ : ఒరే నాయనా ! కొయ్యగలవురా పీకలూ !

కృష్ణ : అతనలా మాటాడొచ్చా ? ఒచ్చని ప్రత్యేకంగా రూలుందా ?

జడ్జి : వాణ్ని మైన్డ్ చెయ్యొద్దు. ప్లీజ్ ప్రొసీడ్.

ప్రాసి : ఎందుకోసం బయల్దేరారు ?

కృష్ణ : పిక్‌నిక్ మరియు గువ్వలవేట. గువ్వలు, పావురాలు పాలుగలో ఏవో అవి, అన్నీ కొడతానని అతను (అవి ముద్దాయిని చూపించి)

తుపాకీ తెచ్చాడు. అక్కడికి వెళ్ళేసరికి తుపాకీ వుంది. కానీ కావలసిన పిట్టలు కనుపించలేదు.

ప్రాసి : చీకటితోనే బయల్దేరామన్నావు.

కృష్ణ : అవును. సత్యం, వాళ్ళ మామ(ప(కారు కొట్టుకొచ్చేడు. కొట్టుకొచ్చి అందులో యీ సుందరాన్ని కూడా వేసుకొచ్చి మా ఇంటి కొచ్చాడు. అక్కణ్నుంచి మధూగా డింట్లోకెళ్ళి వాణ్ణి కూడా లాక్కుపోయేం. నల్లచెరువు - యూషుడ్ బినోయింగ్ ఇట్, మీకు తెలుసుండాలి - దానవతలికి పోయేం. అక్కడ మనవాడు (అని ముద్దాయిని చూపించి) చాలాసార్లు టుప్పా టుప్పా మనిపించేడు.

ప్రాసి : అంటే ?

కృష్ణ : తుపాకీ పేల్చేడు. ఎందుకూ ? యూస్‌లెస్ ? అలా మనవాడి వెంట మూగ్గురవూ తిరిగేం తిరిగేం. పన్నెండు దగ్గరయింది. ఓ చోట నీడ పట్టున కూర్చొని పదార్థాలు పైకి తీసేం. వాళ్ళు - అంటే అతనూ (అని ముద్దాయిని చూపించి) సత్యవూ ద్రవపదార్థం బైటికి లాగేరు.

ప్రాసి : ద్రవపదార్థం అంటే ?

కృష్ణ : ద్రవపదార్థం అంటే అగ్గి అగ్గి !

జడ్జి : సరిగా మాటాడాలి.

కృష్ణ : సర్ ! అయామ్ వెరీ సారీ ! అగ్గంటే విస్కీ అన్నమాట.

ప్రాసి : విస్కీ తాగేరా ?

కృష్ణ : నేనూ మధూ మడికట్టుకున్నాం. మిగతా ఇద్దరూ లాగించేరు. కొంత సేపయింది. వాళ్ళింకా బండి స్టార్టింగులోనే వున్నారు. ఇవతల నేనూ మధూ, పాలూ. వెన్నా రొట్టె, ఫిష్ గిష్ వగైరాలకి పని పట్టిస్తున్నాం. అవతల, వాళ్ళిద్దరూ ఏదో మాటా మాటా అనుకుంటున్నారు. మొదట నేను సరిగా వినలేదు. మస్తుగా తింటూంటే అవతల్ది మరింకేం వినిపించదు, కనిపించదు కదా ?

సోమ : మస్తుగా తింటుంటే కళ్ళు నెత్తికెళ్ళవా మరి ?

కృష్ణ : కొద్దిగా తాగేడో లేదో కాని యితనికి (అని ముద్దాయిని చూపించి, కాసేపట్లో కళ్ళు నెత్తికెళ్ళేయి. శీలో, శైలో, సుశీలో ఎవరో కాని,

"ఆ పిల్ల చాలా మంచిదిరా" అన్నాడు యితను. కాదని అత డన్నాడు, "ఎలా తెలుసు నీకు?" అని యితనన్నాడు.

ప్రాసి : అంతే మాటా మాట అనుకున్నారంతేనా ?

కృష్ణ : ఉండం. ! చెప్పనీయండి ! "ఎలా తెలుసు" అని అడుగుతే "నాతో పోయిన సరుకు కాబట్టి నాకు తెలుసు !" అని సత్యం అన్నాడు.

సోమ : నీ నోట్లోది నాలిక్కాదురా, నల్ల తాచుపావుఁ ! నీ కెందుకురా అంత చదువు ? !

జడ్జి : షటప్ !

బంట్రోతు: సైలెన్స్ !

(మొదటి చారుడు లోనికి వస్తాడు. రెండో చారుడు కిష్టప్ప దగ్గరికి వెళ్ళి కృష్ణారావు చెప్పిందంతా చెప్పిన తరువాత తిరిగి లోనికి వస్తాడు.)

ప్రాసి : చెప్పండి. అప్పుడేం జరిగింది ?

కృష్ణ : ఆ సుశీల "నాతో పోయింది కాబట్టి, నాకు అది మంచిది కాదని తెలుసు" అని అతనన్నాడు కదూ ! అంటే "ఆ మాట నేన్నమ్మను !" అని యితనన్నాడు. "నా మాట నమ్మవా ?" అని అతను మళ్ళీ అన్నాడు. "నమ్మను కాక నమ్మను" అని యితనన్నాడు. అని....

ప్రాసి : సరేలే ! అప్పు డేమిటయింది ?

కృష్ణ : అని, అప్పుడీతను పంచాగం పూర్తిగా విప్పేసేడు.

జడ్జి : అంటే ?

కృష్ణ : అంటే, శుద్ధ సంస్కృతంలోకి దిగిపోయాడు.

జడ్జి : శుద్ధ సంస్కృతం అంటే ?

కృష్ణ : శుద్ధ సంస్కృతం అంటే అచ్చ తెనుగు.

జడ్జి : అంటే ?

ప్రాసి : (నవ్వి) దుర్భాషలు ! కుర్రావాళ్ళలా అంటారు.

జడ్జి : (నవ్వి) ఐసీ ! అయితే, (అని కృష్ణారావుని వుద్దేశించి) తెలివైన వాడివే కాని, కుర్రాడా నా దగ్గిర మాత్రం చూపించకు నీ యెక్కువ తెలివి తేటలు !

కృష్ణ : చిత్తం ! అయామ్ సారీ !

సోమ : నీలాటి వాడొక్కడుంటే దేశం మసిరా నాయనా ! అందర్నీ కాటేసి బతికేస్తావు.

జడ్జి : షటప్ (అని ముద్దాయి నన్నాక,కృష్ణారావుతో) మరింక చెప్పు నీకథ.

కృష్ణ : సర్ ! ఇది కథ కాదు, పేన్‌ఫుల్ ట్రూత్ ! విచారకరమయిన విషయమే కాని, వాస్తవం యిది !

జడ్జి : అయామ్ సారీ ! కమాన్ ! ఏం జరిగిందో చెప్పండి.

ప్రాసి : చెప్పండి.

కృష్ణ : ఇతనలా పంచాంగం ఘాటు గాచదివేసరికి, మా సత్యం అసహ్యించుకొని "నీతో మాటాడ్డం నా బుద్ధి తక్కువరా ?" అన్నాడు. అంటే యితను "ఒరే ! నిన్ను చంపేస్తాన్రా ?" అన్నాడు. అప్పుడు మా సత్యం "నీతో నాకు మాటలేమిట్రా ?" అని ఎడంగా వెళ్ళిపోయేడు

ప్రాసి : ఎడంగా వెళ్ళిన తర్వాత ఏం జరిగింది ?

కృష్ణ : ఇతనలా కొంతసేపు - రెండు మూడు నిమిషాలు - విస్కీ సీసా చేత్తో పట్టుకు చూస్తూ నిల్చున్నాడు. విస్కీ యింక మూడొంతులు అందులో ఉండనే వుండిపోయింది. తరువాత అక్కణ్నించి గబుక్కున స్ప్రిన్గ్‌లా మెరుపులా వెళ్ళి....

ప్రాసి : వెళ్ళి ?

కృష్ణ : (ఊపిరి బాగా తీసుకు వదిలి) క్షమించండి....వెళ్ళి....వెనక నించి దొంగదెబ్బ తీసేడు. తలమీద కొట్టేడు. వన్స్, ట్వైస్. త్రైస్, అండ్ వన్స్ ఎగన్ ! దాన్తో మా సత్యం - ధన్ - పడిపోయాడు. మేం, అంటే నేనూ మధూగాడూ థన్డర్‌స్ట్రక్ అయినట్టుండిపోయేం. సరిగ్గా అప్పుడే ఏడ్చింది దూరంలో పన్నెండు గంటల మిల్లు బూరా !

ప్రాసి : ముద్దాయి ఏమయ్యేడు !

కృష్ణ : స్టంట్ పిక్చర్లు చూసేరా మీరు ? చూశ్శేదూ ! వెరైటీకి అవి కూడా చూడాలి. చూడండిసారి. వాట్లో హీరో యీ క్షణంలో మేడ దిగువ నుంటాడు. నెక్స్ట్ మొమెంట్ - మరుక్షణంలో మూడంతస్తుల మేడమీద నుంటాడు. అలా చేసే డితను. ఈ క్షణంలో చేత్తో పగిలిన విస్కీసీసాతో నిల్చున్నాడు.మరుక్షణంలో తుపాకి మనిషి

కూడా గుండేసి కొట్టే కనిపించకుండా మటు మాయం ! వానిష్ యిన్ టు థిన్ ఏర్ !

ప్రాసి : తరువాత ఏం చేసేరు !

కృష్ణ : ఏం చేశావా ! మధూగాడేం చెయ్యలేదు. ఆ 'సైట్' చూసి షాక్ అన్డ్ హామరేజ్‌వల్ల వాడిఛాప్టరు ముందు క్లోజ్ అయిపోతుందేమో నని గాభరా పడిపోయేను, అలా కొయ్యబారి పోయేడు. అప్పు డ్నేనే తప్పరిల్లి. కదిలి వాటర్ బాటిల్లో నీళ్ళంటే అవి ముఖంమీద జల్లి దెబ్బ కడుగుదామని చూసేను. ఏంలాభం ? వాల్టేర్ చెప్పినట్లు పుట్టి పెరగాలంటే కొన్నేళ్ళు పడుతుంది. కాని, చావాలన్నా చంపా లన్నా అరక్షణంలో సగంచాలు ? అంతేకదా ? ఈజ్ దట్ నాట్ సో?

ప్రాసి : దెబ్బ కతమ చనిపోయేడా ?

కృష్ణ : మారుమాట ఆడకుండా ! అమ్మా అని పిలవకుండా !

ప్రాసి : ఈ నేరం గురించి మీరు, మిస్టర్ మధూ కలిసి పోలీసు వారికి రిపోర్టు చేసేరా ?

కృష్ణ : చేసేం.

ప్రాసి : (కంప్లేంటు కాయితం గుమాస్తా వద్ద పుచ్చుకు చూపించి) అది ఇదేనా ?

కృష్ణ : చూడ్నీయండి, (అని, తను కూడా స్వయంగా చూసుకొని, తిరిగి ఆ కాయితాన్ని ప్రాసిక్యూటర్‌కి యిచ్చేస్తూ) యిదే !

ప్రాసి : ఆ పగిలిన సీసానీ, గాజు పెంకుల్నీ, రక్తపుమట్టినీ, సత్యంతొడు కున్న బట్టల్ని పోల్చగలరా ?

కృష్ణ : గలను !

ప్రాసి : (వాటిపైపు చెయ్యిజాచి) అవేనా ?

కృష్ణ : (కొంచెం పరిశీలనగా చూచి) అవే ;

ప్రాసి : పోలీసు వారు మిమ్మల్ని దర్యాప్తు జేశారా ?

కృష్ణ : చేసేరు.

జడ్జి : అంతేనా ? లేక యింకా ఏమైనా అడుగుతారా ?

ప్రాసి : ఒక్క ప్రశ్న, చూడండి ? మీకు యీ ముద్దాయిని అంతకుముందు తెలుసా ?

కృష్ణ : తెలుసు.

ప్రాసి : (కొంచం ఆశ్చర్యపడి) తెలుసా ?

కృష్ణ : తెలుసు.

ప్రాసి : మీకూ అతనికీ విరోధం ఏమైనా వుందా ?

కృష్ణ : నో ! లేదు.

ప్రాసి : అంతేనండి. (కోర్టువారితో చెప్పి కూర్చుంటాడు)

జడ్జి : క్రాస్ !

డిఫెన్స్: అయ ! (అంటూ లేచి విట్నెని) చూడబ్బాయ్ ! నీకు యీ ముద్దాయీని "తెలుసును ఆ రోజుకి ముందు" అన్నావు. ఎలా తెలుసు ?

కృష్ణ : కాలేజి గేట్లదగ్గర ఆడపిల్లల్ని అల్లరిపెడుతూ వుంటాడు. అంచేత తెలుసు, ఓసారి మాలతని ఓ అమ్మాయిని చాలా అల్లరి పెట్టేడు. దాంతో ఆ అమ్మాయికి మెన్టల్ డిరేంజ్‌మెంట్ వచ్చేసింది. ఇప్పుడావిడ పిచ్చాసుపత్రిలో వుంది.

(వకీల్సంతా గుసగుస లాడు కుంటారు.)

జడ్జి : ఇదంతా రాయమంటారా !

డిఫెన్స్: క్షమించాలి. అవసరంలేదు.

ప్రాసి : (లేచి) సాక్షికి ముద్దాయీని ఎలా తెలుసునని డిఫెన్స్‌వారు అడిగేరు. ఎలా తెలుసునో సాక్షి జవాబు చెప్పేరు. జవాబు రెలెవెంట్ కాబట్టి తమరు రికార్డు చేయించాలి. (అని కూర్చుంటాడు)

జడ్జి : (డిఫెన్స్ లాయర్ని) ప్రొసీడ్ ! అడగండి.

డిఫెన్స్: అడుగుతానండి.

సోమ : మీరాగండి నేనడుగుతాను, అరే స్కౌండ్రల్ ! ఆ అమ్మాయిని అల్లరి పెడుతూంటే చూస్తూ వూరుకున్నావురా ! నీ చేతి కేన్నిరా గాజులు ? !

జడ్జి : (ముద్దాయిని) స్టాప్‌దట్ నాన్సెన్స్ !

కృష్ణ : ఆ పిల్ల నాకు మదరా ? సిస్టరా ? మేనత్త కూతురా ?

డిఫెన్స్: మీ మనిషి కాకపోతే ఏ మనిషెలా పోయినా మీ కక్కరలేదన్న మాట.

జడ్జి : (కోపంగా)స్టాప్‌దట్ నాన్సెన్స్! ఇదేం కోర్టా....(అని మాటాడలేక పోతాడు)

సోమ : (ఈలోగా. కృష్ణారావుని ఉద్దేశించి) వాణ్నేవణ్నో నివ్వే చంపుంటావురా రాస్కెల్ !

డిఫెన్స్: (కోర్టు వారితో) పొరపాటు మన్నించండి.

జడ్జి : (కోపాన్ని కంట్రోల్ చేసుకొందికి ప్రయత్నిస్తూ) ఆఖరిసారి చెప్తున్నాను. ఈసారి వాడలా పేలేడంటే యీ కేసులో శిక్షే కాకుండా, కోర్టు ధిక్కార నేరానికి....లేదా కోర్టు పనికి అంతరాయం కలిగించిన నేరానికి యీ వెంటనే శిక్ష వేస్తాను. వాడికి వెంటనే వెళ్ళి వార్నింగ్ యివ్వండి. ఇది లాస్ట్ వార్నింగ్ ! మరింకివ్వను.

సోమ : అంటే యీ కేసులో ఎలాగూ శిక్ష వేసేస్తావా అయితే !

జడ్జి : (ఉగ్రుడై) షటాప్ !!

(డిఫెన్స్ లాయరు ముద్దాయికి దగ్గరగా వెళ్ళి మందలిస్తాడు)

సోమ : (విసుగుతో) వెళ్ళు బాబూ వెళ్ళు. ఏదో వేగిరం పూర్తి కానీ ! ఈ నాటకం ఎలా క్లోజయినా ఖకరాలేదు నాకు, వెళ్ళు !

డిఫెన్స్: (తన కుర్చీ వద్దకు తిరిగి వెళ్ళి) అయామ్ సారీ యువరానర్ !

జడ్జి : విచారం మీకెందుకు మధ్యని ? అడిగేదేదో అడగండి వేగిరం ?

డిఫెన్స్: అయ్య, అడుగుతానండి ! (అని సాక్షివైపు తిరిగి) చూడండి (అని ఏదో ఆలోచిస్తూ వుండిపోతాడు)

కృష్ణ : చూస్తున్నాను, ఏమిటి మీరడిగేది ?

డిఫెన్స్: (ఆలోచన కట్ చేసి) చూడు మిస్టర్ ! నిన్ను సత్యం రోజూ తిట్టేవాడా !

కృష్ణ : తిట్టేవాడు.

డిఫెన్స్: నీకూ, అతనికీ, అందుచేత విరోధమేనా ?

కృష్ణ : నాకూ వాడికి స్నేహం కాబట్టే రోజూ తిట్టుకునే వాళ్ళం.

జడ్జి : మిస్టర్ ! నువ్వు తిన్నగా మాటాడాలి.

కృష్ణ : క్షమించండి. మా సత్యం 'విశ్వశాంతీ, సోదరప్రేమా' మనిషండి. అమెరికా అంటే ద్వేషం. అభ్యుదయం అంటే యిష్టం-అటువంటి

వాడండి. వాణ్ని నేను వేళాకోళం చేసి వెక్కిరించడం ఇద్దరని "నీ తప్పంటే నీ తప్పు, నువ్వు ఫూల్ వంటే నువ్వే ఫూల్"వం సరదాగా ఏదో అనుకొనేవాళ్ళం. దట్ యీజ్ ఆల్! అంతే.

డిఫెన్స్: ఇతను మాలతి నేదో అల్లరి పెట్టే డన్నావు?

కృష్ణ : అవును.

డిఫెన్స్: అప్పణ్నుంచీ యితనంటే మీకు కోపం వుందా? లేదా?

కృష్ణ : (ఆలోచించి) కోపం కాదు! అసహ్యం.

డిఫెన్స్: (సడన్‌గా) మీరు తిరిగి వచ్చినప్పుడు కార్లో ఎందరొచ్చారు?

కృష్ణ : ముగ్గురం (అనేసి తమాయించుకుంటాడు.)

డిఫెన్స్: దట్సాల్! (అని కూర్చోబోతాడు.)

కృష్ణ : ముగ్గురం రావలసింది, ఇద్దరమే వచ్చాం. మూడోవాడు పారిపోయాడు. నాలుగోవాడు చచ్చిపోయేడు.

డిఫెన్స్: (కోర్టువారితో) మాట మార్చేడండి.

ప్రాసి : లేదండీ జవాబు పూర్తి కానివ్వ లేదాయన!

డిఫెన్స్: అదన్యాయంగా అంటున్నారు.

జడ్జి : లేదు, మీరు మాట పూర్తి కానివ్వలేదు.

డిఫెన్స్: తమరి కలా తోస్తే, మరి నేనేం చెయ్యలేను.

జడ్జి : అందుచేత యింకేమైనా అడగాలనుకుంటే అడగండి.

డిఫెన్స్: 'కార్లో తిరిగొచ్చిన వాళ్ళం ముగ్గురం' అని యిప్పుడు నువ్వు చెప్పేవా లేదా?

కృష్ణ : "ముగ్గురం రావలసింది, కాని రాలేదు" అని చెప్పేను.

డిఫెన్స్: విస్కీ అగ్గిలా వుంటుందన్నావు. నీ కా సంగతి ఎలా తెలుసు? నువ్వెప్పుడైనా తాగేవా?

కృష్ణ : తాగలేదు. అగ్గిలా వుంటుంది తాగిచూడమని ముద్దాయీనే అన్నాడు. కాని నే తాగలేదు. ఐ స్టుడ్ ఫర్మ్!

డిఫెన్స్: నేర స్థలం నుంచి కారు దగ్గరికి, వెళ్తూ వెళ్తూ నువ్వొక్కడికి వెనకి_ తిరిగి వెళ్ళేవా, లేదా?

కృష్ణ : వెళ్ళేను.

డిఫెన్స్: ఎందుకు?

కృష్ణ : పర్సు మర్చిపోయేను. తెచ్చుకుందికి తిరిగి వెళ్ళేను. మనిషి ప్రాణం పోయి గాభరాలో ఉన్నా ననుకోండి. కాని పర్సు వదులుకోలేను కదా ?

డిఫెన్స్: (ఏదో ఆలోచిస్తూ కూర్చుంటాడు)

జడ్జి : ఇంకేం అడగరా ?

డిఫెన్స్: అడగనండి.

జడ్జి : (సాక్షిని ఉద్దేశించి) మిస్టర్ ! ఇందాట్లా ఏదో వాటర్ బాటిల్ గురించి రిఫర్ చేశావు. ఆ వాటర్ బాటిల్ ఏమయింది ?

కృష్ణ : మేం పోలీసువారితో తిరిగి అక్కడికి వెళ్ళేసరికి ఎవరో పిల్లలు ఎత్తుకు పోయేరు.

జడ్జి : ఎత్తుకు పోవడం నువ్వు చూచేవా ?

కృష్ణ : చూసేను.

జడ్జి : అంటే నువ్వు పోలీసువారితో ఆ స్థలానికి వెళ్ళేసరికి అక్కడ జనం వున్నారన్నమాట !

కృష్ణ : మేం ఆ జాగా దగ్గరకి వెళ్ళేసరికి జనం లేరండి.

జడ్జి : ఎవరో పిల్లలున్నారని యిప్పుడిప్పుడన్నావు ! ?

కృష్ణ : అవును. ఉన్నారండి.

జడ్జి : ఉన్నారు: లేరు ! ఏమిటీ వుద్దేశం ? ! ఇదేం కోర్టా లేక....

కృష్ణ : కోర్టువారు క్షమించాలి. మేం అక్కడికెళ్తూ దూరం నుంచి, ఆ జాగాలో పిల్లలుండడం చూసేం. మమ్మల్ని దూరం నుంచే చూసి వాళ్ళు పారిపోయారు, మేం ఆ జాగా దగ్గరకి వెళ్ళేసరికి. అందుచేత వాళ్ళక్కడ లేరు (అని నెమ్మదిగా, వినయంగా చెప్తాడు.)

జడ్జి : ఐ సీ! ఉన్నారని ఒకసారి, లేరని ఒకసారి చెప్పి తమాషా చేస్తున్నా వనుకున్నాను.

కృష్ణ : ఏదైనా తప్పుగా మాటాడితే నన్ను తమరు మన్నించాలి.

జడ్జి : నువ్వేం తప్పుగా మాట్లాడలేదు.

కృష్ణ : మరింక నేను దిగొచ్చునాండి.

జడ్జి : ఒక్క విషయం ! ఆ పగిలిన సీసా చూడు !

కృష్ణ : ఎస్సర్ ! చూసేనండి.

జడ్జి : ముద్దాయీ అదక్కడే పారేసి పారిపోయాడన్నావు కదా ?
కృష్ణ : అవునండీ.
జడ్జి : నువ్వు తిరిగి పోలీసు వారితో నేర స్థలానికి....
కృష్ణ : ఒంటి గంటకల్లా వెళ్ళేను.
జడ్జి : అప్పుడా పగిలిన సీసా ఎక్కడుంది ? ముద్దాయీ ఎక్కడైతే పడే సేడో అక్కడే, సరిగ్గా అక్కడే వుందా ?
కృష్ణ : (వినయంగా, నెమ్మదిగా) నాకు సరిగా గుర్తు లేదండీ. పిల్లలేదో అన్నీ సవరించినట్టున్నారు. అంచేత ఆ పగిలిన సీసా సరిగ్గా ముద్దాయీ పడేసినచోట అరంగుళం అటూ ఇటూ కాకుండా ఎలా పడిందలాగే ఉందా అంటే నే చెప్పలేను. ఉండడం మాత్రం శవానికి దగ్గరగా ఆ జాగాలోనే వుంది.

(ఒక చారుడు బైటకి వెళ్ళి కిష్టప్పతో అంతా చెప్తాడు.)

డిఫెన్స్: (సడన్‌గా లేచి) ఈ ప్రశ్నలన్నీ నేను వేసినవి కావు!
జడ్జి : మీరు వెయ్యవలసిన ప్రశ్నలు!
డిఫెన్స్: తమరు క్షమించాలి. ఈ కేసులో ముద్దాయి అసహాయుడు—పెంకెవాడు, పోగరుబోతూ అనుకోండి—కాని, ప్రస్తుతం అసహాయుడు! జెయిల్లో వున్నాడు. పైన తనవారెవరూలేరు. ఆర్థిక స్తోమత అంతకంటే లేదు. ఈ సాక్షులెవరో, ఎందుకు యిలా అబద్ధం ఆడుతున్నారో అతనికి తెలియదు. తెలుసుకునేందుకు అవకాశం లేదు.

జడ్జి : అయితే మీరనేదేమిటి ?
డిఫెన్స్: మనవి చేస్తున్నా! అందుచేత యీ అన్యాయం నుంచి బైటపడాలంటే మాకు ఆధారాలు చాలా తక్కువ. ఈ ముద్దాయీ—ఇతనే కాని నిజంగా నేరస్తుడైతే ఆ పగిలిన సీసా పిడిమీద యీ ముద్దాయీ వేలిముద్రలు ఉండితీరాలి. ఉన్నట్టుగా మాకిచ్చిన రికార్డులో ఎక్కడా లేదు. అవి ఎందుకు లేవో ప్రాసిక్యూషన్ వారు చెప్పుకోవలసి వున్నది. అది వారి బాధ్యత. కాని వారు ఆ సంగతి చెప్పడంలేదు. పగిలిన సీసా మీద ముద్దాయీ వేలిముద్రలు ఎందుకు లేవో తమరు యీ సాక్షి చేత యిప్పుడు చెప్పించేరు. సీసాని పిల్లలు సవరించేరు.

కాబట్టి ముద్దాయీ వేలిముద్రలు దాని మీదవి చెరిగి పోయేయని ప్రాసిక్యూషన్‌వారు తమ సహాయంవల్ల యిప్పుడు సర్దుకుంటున్నారు.

జడ్జి : మీరు అధిక ప్రసంగం చేస్తున్నారు.

డిఫెన్స్: అధిక ప్రసంగమని తమరు భావించవచ్చు. తమరి భావన ఎలా వున్నప్పటికీ, ఈ కేసుకు అవసరమైన ప్రసంగం కాబట్టి చేస్తున్నాను. ఇందాక్ల సాక్షి 'మేం వెళ్ళేసరికి అక్కడ జనం లేర' న్నాడు. అతను 'లేర'న్నాక ఆ మాట మళ్ళీ యీ సాక్షిని నే నడగవలసిన అవసరం లేదు. అందుచేత నేనడగలేదు. కాని అది సర్దుకొందికి కూడా ప్రాసిక్యూషన్ వారికి తమరు సహాయం చేసేరు. సర్దుకొందికి వీలుగా, మొదటి సాక్షి చెప్పినదంతా యీ సాక్షికి ముందే ఎవరో అందించేరని నాకు అనుమానంగా వుంది.

ప్రాసి : అందించిన దొంగల్ని పట్టి అప్పజెప్పండి!

డిఫెన్స్: అందించడం అనే చెడుపని జరగకుండా మీరు చూడాలి. కోర్టువారు చూడాలి. నేనిక్కడికి కేసు చెయ్యడానికొచ్చేను కాని దొంగల్ని పట్టి అప్ప చెప్పటానికి రాలేదు. మీరు చాలా పొరపాటుగా మాటాడుతున్నారు.

ప్రాసి : నాకు తెలిసినంత మట్టుకు యిక్కడ భోగట్టా పైకెవ్వరూ అందివ్వటం లేదు.

డిఫెన్స్: మీకూ నాకూ తెలియజెప్పి వారా చెడుపని చెయ్యరు. ఇక్కడ ఈ హాల్లో సాక్షులుచెప్పే ప్రతిమాటా, ప్రతి అక్షరంకూడా పైనున్న సాక్షులకి అంది పోతోందనే నమ్మకం! (అంటూండగా మొదటి చారుడు లోనికి వస్తాడు. రెండో చారుడు బైటికి వెళ్ళి కిష్టప్పతో మాటాడతాడు. ఉన్న స్థలంనుంచే కిష్టప్ప ఇంకా దూరం వెళ్తాడు. కోర్టు వారు దయచేసి—యిప్పటికి అయినదేదో అయిపోయింది— ఇప్పటికైనా కోర్టువారు దయచేసి ఆ మిగతా సాక్షుల్ని ఎవరూ కబురందజేయటానికి వీల్లేకుండా ప్రత్యేకమైన స్థలంలో కూర్చోబెట్టమని ప్రార్థిస్తున్నాను.

ప్రాసి : అంటే ఆకాశంలో కూర్చోబెట్టాలా ? లేక బందిఖానాలో వుంచాలా ?
(అని నవ్వుతాడు)

డిఫెన్స్: ఇది ఖూనీకేసు ! ఇక్కడిలా హాస్యాలాడి మనిషి ప్రాణంతో చెలగాటా లాడ్డం మీకేం బావులేదు.

ప్రాసి : మాటలు చాలా దూరం పోతున్నాయి. (అని లేచి నిల్చుని) కోర్టు వారికి నేను మనవి చేసుకొనే దేమిటంటే: సాక్షుల్ని ప్రత్యేకంగా ఎక్కడో కూర్చో పెట్టాలంటే అలా కూర్చోబెట్టడానికి మాకు అభ్యంతరం లేదు. అలా చేసి తీరాలని ఎక్కడా రూలు లేదు. అదే నాయొక్క మనవి. సాక్షులు దూరంగానే వున్నారు. కావలిస్తే ఇంకా దూరంగా పొమ్మంటాను. ఈ కేసు అయినంత కాలం జూరర్స్‌లా సాక్షుల్ని కూడా బంధించాలని రూలెక్కడా లేదు.

జడ్జి : అవును. రూలెక్కడా లేదు.

ప్రాసి : కోడ్లోనూ లేదు. రూల్సులోనూ లేదు.

జడ్జి : అవునంతే! కాని, వారి సంతృప్తి గురించి సాక్షుల్ని యింకా దూరం పొమ్మనండి.

ప్రాసి : చిత్తం! (అని బంట్రోత్తో) సాక్షుల్ని దూరంగా ఉండమనవోయ్ !

బంట్రోతు: (వరండాలోకి వెళ్ళి) అయ్యా ఎవరండీ ఇక్కడ సాచ్చి దార్లూ? దూరంగా పోవాలి! దూరంగా పోవాల ! (అని లోనికివచ్చి) వారండాలో ఎవ్వరూ లేరండి !

ప్రాసి : నే చెప్పేకదూ ! (అని కూర్చుంటాడు)

జడ్జి : (డిఫెన్స్ లాయర్ని) ఇదిగో మీరు !

డిఫెన్స్: (కొంచెం నిస్పృహగా) అయ్యా ?

జడ్జి : మీరు చాలా అమర్యాదగా, అసందర్భంగా ప్రవర్తించారు.

డిఫెన్స్: (చలనం లేకుండా) అయ.

జడ్జి : మీ మీద నేను చర్య తీసుకోగలను.

డిఫెన్స్: అయ.

జడ్జి : మీ వయసుకి గౌరవం యిచ్చి మిమ్మల్ని క్షమిస్తున్నాను.

డిఫెన్స్: అయ.

జడ్జి : తరువాత—

డిఫెన్స్: అయ.

జడ్జి : సీసామీద ముద్దాయీ వేలిముద్రలు ఎందుకులేవో తెలుసుకొందికి మీకు యిష్టం లేకపోవచ్చు. కాని, అవి ఎందుకు లేవో తెలుసుకోవలసిన అవసరం నాకుంది. తెలుసుకోవలసిన బాధ్యతుంది నా మీద. కావలిస్తే— అడుగో సాక్షి ! ఇంకా బోన్లోనే వున్నాడు— మీ క్కావలసినంత సేపు క్రాసెగ్జామినేషన్ చేసుకోండి.

డిఫెన్స్: అయ ! తమరికి చాలా కృతజ్ఞుణ్ణండీ. జరగవలసిన "మిస్చీఫ్" జరిగేపోయిందండి. నేనింక ఏమడిగినా ప్రయోజనం ఏమీ ఉండదండి. తమరి సెలవైతే నేను కూర్చుంటానండి. (అని కూర్చుంటాడు)

జడ్జి : కమాన్ నెక్స్టట్ విట్నెస్ !

సోమ : ఇక్కడ నిజం నిలబడుతుందనుకోడం మన బుద్ధి తక్కువ !

జడ్జి : (డిఫెన్స్ లాయర్ని ఉద్దేశించి) మీ ముద్దాయిని నోరు మూసుకోమని చెప్పండి.

డిఫెన్స్: తమరు చెప్తే ఎంతో, నే చెప్తేనూ అంతే ! ముద్దాయీ నా చెప్పు చేతల్లో లేడు. కావలిస్తే తమరే చెప్పొచ్చు.

జడ్జి : వాట్ ! !

డిఫెన్స్ : అయ.

కృష్ణ : (బోను దిగి వాంగ్మూలం మీద సంతకం చేసి, మధుసూదనరావు పక్క కూర్చుంటాడు)

డాక్టరు: (ప్రవేశిస్తాడు)

ప్రాసి : డాక్టరుగా రొచ్చారండి.

జడ్జి : కానీయండి !

ప్రాసి : (డాక్టరుతో) కమాన్ సర్.

డాక్టరు: (బోనెక్కి) దేవుని యెదుట ప్రమాణంచేసి నిజం చెప్తాను. అబద్ధం చెప్పను.

బెంచి : మీ పేరు ?

డాక్టర్: సదాశివరావు.

ప్రాసి : మీరు గవర్నమెంటు ఆస్పత్రిలో అసిస్టెంట్ సర్జన్గా వున్నారు ?

డాక్టర్: అవును.

ప్రాసి : ఈ మే నెల 23 తారీఖు సాయంకాలం 764 నెంబరు కాన్‌స్టబుల్ మీ వద్దకి శవాన్ని తీసుకురాగా మీరు శవ పరీక్ష చేశారు.

డాక్టర్: చేశాను. పోస్టుమార్టమ్ సర్టిఫికేట్ యిచ్చాను.

ప్రాసి : (బెంచి గుమాస్తా వద్దనుంచి సర్టిఫికేట్ తీసుకొని) ఇదేనా ఆ సర్టిఫికేట్ ?

డాక్టర్: ఇదే ! (అంటూ చూస్తాడు)

ప్రాసి : అందులో వివరించిన దెబ్బలు ఆ మనిషి శవం మీద మీకు కనిపించాయా ?

డాక్టర్: (సర్టిఫికేట్ చూస్తూ) పాతికేళ్ళ కుర్రవాడి శవం. ఇందులో వివరించిన దెబ్బలు తల మీదున్నాయి. మొత్తం నాలుగు దెబ్బలు. మూడు బలమయినవి. ఒక దెబ్బకి ఎమిక చిట్లి మెదడు దెబ్బతింది.

ప్రాసి : ఎటునుంచి తగులుంటాయి ?

డాక్టర్: వెనుకనించి.

ప్రాసి : దేన్తో తగిలుంటాయి ?

డాక్టర్: ఎనీ హార్డ్ సబ్‌స్టెన్స్ - గట్టి దేదైనాసరే.

ప్రాసి : ఈ సీసాపిడి, సీసాముక్కలూ చూడండి, దీనితోతగిలి వుండొచ్చా ?

డాక్టర్: (చూసి) దాని మట్టుతో తగిలి వుండవచ్చు.

ప్రాసి : (విరిగిన గాజు పెంకుల్లోంచి సీసా మట్టుతీసి) దీన్తో తగిలి వుండవచ్చా ?

డాక్టర్: తగిలుండొచ్చు.

ప్రాసి : మనిషికాని పడిపోతే తగుల్తాయా అవి ?

డాక్టర్: తగలవు, అవకాశంలేదు.

ప్రాసి : చనిపోయిన మనిషి చనిపోయే ముందు తాగున్నాడా ?

డాక్టర్: తాగుండాలి. పరీక్షబట్టి అలానే తెలుస్తోంది.

ప్రాసి : ఎందువల్ల చనిపోయుంటాడో చెప్పగలరా ?

డాక్టర్: షాక్ వల్ల, దెబ్బలు తగిలిన షాక్ వల్ల .

ప్రాసి : శవంమీద బట్టలు జవాన్‌కి యిచ్చేశారా ?

డాక్టర్: ఇచ్చేశాను.

ప్రాసి : (బట్టలు చూపించి) ఇవేనా అవి?
డాక్టర్: అవే.
ప్రాసి : అంతేనండి (అని కోర్టు వారితో చెప్పి కూర్చుంటాడు.)
జడ్జి : క్రాస్!
డిఫెన్స్: ఎప్పుడు చనిపోయుంటా డతను? (లేచి అడుగుతాడు.)
డాక్టర్: ఆ రోజు పగలు పదీ పన్నెండు గంటలమధ్య చనిపోయుండొచ్చు.
డిఫెన్స్: పన్నెండు దాటివుండదా?
డాక్టర్: పన్నెండు దాటకపోవచ్చు.
డిఫెన్స్: (కూర్చుంటాడు)
డాక్టర్: (సంతకంచేసి వెళ్తాడు. పోస్టుమార్టమ్ సర్టిఫికేట్, వెళ్ళేముందు బెంచి గుమస్తా చేతికిస్తాడు)
ప్రాసి : (బంట్రోత్తో) సబ్ ఇన్‌స్పెక్టర్ని పిలవ్వోయ్.
బంట్రోతు: (వరండాలోకి వెళ్ళి) బాబూ! దయచేయ్ మంటన్నారు.
కిష్టప్ప : (యూనీఫారంలో వుంటాడు. టక టక వచ్చి కోర్టువారికి సాల్యూట్ చేసి, ప్రాసిక్యూటర్ చేతిలోంచి కేన్, డైరీ తీసుకొని బో నెక్కుతాడు) దేముని ఎదుట ప్రమాణంచేసి అంతా నిజం చెపుతాను. అబద్దం చెప్పను.

బెంచి : మీ పేరు.
కిష్టప్ప : కిష్టప్ప.
ప్రాసి : ఇంక చెప్పండి.

కిష్టప్ప: నేను యీ సంవత్సరం జనవరి పదిహేన్నించీ అయిదో నెంబరు పోలీసు స్టేషన్లో సబ్‌యిన్‌స్పెక్టర్‌గా పనిచేస్తూ వున్నాను. ఈసంవత్సరం మే నెల ఇరవైమూడు తారీఖున మధ్యాహ్నం ఒంటిగంటకి కొంచెం ముందుగా, పన్నెండున్నర దాటిన తరువాత, ఈ కేసులో మొదటి సాక్షు లిద్దరూ యీ కేసు గురించి ప్రథమ సమాచారం అందజేసినారు.

ప్రాసి : (కంప్లేంటు చూపించి) ఇదేనా ఆ రిపోర్టు?
కిష్టప్ప : అదే, ఆ రిపోర్టు తీసుకొని ఐ. పి. సి. 302 సెక్షన్ క్రింద ఖూనీ నేరమునకు ముద్దాయిపై కేసు రిజిష్టర్‌చేసి ప్రథమ సమాచారమును

ఎక్స్‌ప్రెస్‌గా కోర్టుకు పంపించి, మొదటి యిద్దరి సాక్షులనూ తీసుకు పోయి నేర స్థలమునకు పోయినాను. అక్కడ శవ పంచాయితీ జరిపించినాను.

ప్రాసి : (కాయితం గుమాస్తావద్ద పుచ్చుకొని) ఇదేనా శవ పంచాయితీ రిపోర్టు ? (అవి చూపించి గుమాస్తాకి యిచ్చేస్తాడు)

కిష్టప్ప : అదేను. తరువాత గాజు పెంకులు, పగిలిన సీసాపిడి స్వాధీన పర్చు కొని, శవం పడినచోట రక్తపు మట్టిని కూడా స్వాధీనం పర్చు కున్నాను.

ప్రాసి : (సామాన్లు చూపిస్తూ) ఇవేనా అవి ?

కిష్టప్ప : అవే అవి. తరువాత, పి. సి. 764 ద్వారా శవమును పరీక్ష నిమిత్తం మూడవ సాక్షి వద్దకు పంపియున్నాను. వారిచ్చిన సర్టిఫి కేట్ (ప్రాసిక్యూటరు చూపించగా) అదేను. తరువాత వారు పంపిన బట్టలు - శవం మీద బట్టలు, (ప్రాసిక్యూటర్ చూపించగా) - అవే అవే - వాటిని కూడా మిగతా వస్తువులతో పాటు కోర్టుకి పంపి, వానిద్వారా వాటిని పరీక్ష నిమిత్తం పంపియున్నాను. గాజు పెంకులమీద నున్న రక్తమున్నూ, రక్తపు మట్టిలో నున్న రక్త మున్నూ శవంమీద బట్టల రక్తమున్నూ ఒకే గ్రూపునకు చెందినవై యున్నవని రిపోర్టు (ప్రాసిక్యూటర్ చూపించగా) - అదే - వచ్చి నది ఆ రోజున, అనగా మే యిరవై మూణ్ణు, మొదటి యిద్దరి సాక్షులనూ విచారించాను. మూడవ సాక్షిని మరునాడు విచారించి నాను. నేరము జరిగిన రోజున ముదాయీ యింటికి వెళ్ళినాను. అతను గైరుహాజర్లో వున్నాడు. ఆ రోజున ముద్దాయీ ఎక్కడా దొరకలేదు. మర్నాడు తెల్లవారుఝామున ముద్దాయీ యీ గ్రామం స్మశానాల దిబ్బవద్ద దాగున్నాడని భోగట్టా రాగా, సిబ్బందితో వెళ్ళి అరెస్టుచేసి, స్టేషనుకు తీసుకువచ్చి, సెర్చిచేసి రికార్డు యూజ్‌చేసి ఉదయం ఆరుగంటలకు లాకప్‌లో వేసినాను, ఆ రోజే కోర్టుకు వానిని హాజరు పరచినాను. కేసు దర్యాప్తు ముగించి ఖూనీ నేరము నకు ముద్దాయిపై సెకండ్ క్లాసు మేజిస్ట్రేటు కోర్టులో ఛార్జిషీటు దాఖలు చేసియున్నాను. నేర స్థలమునకు, డబరిక్ దూరము రోడ్డు,

మీద సంచి కొలిపించగా, ఆరు మైళ్ళ ఆరు ఫర్లాంగు లున్నది. అందులో నాలుగు మైళ్ళే రోడు, మిగతాది నాటుతోవ, కాని, అక్కడ నుంచి ఊరికి అడ్డతోవ వున్నది. ఆ దారిని వస్తే, ఊరికి అది మూడుమైళ్ళ లోపు. ప్లానులో అవి అన్నీ చూపించి యున్నాను. (ప్రాసిక్యూటర్ చూపించగా) అదే 'ప్లాను.'

జడ్జి : క్రాస్ !

ప్రాసి : (కూర్చుంటాడు)

డిఫెన్స్: ఈ ముద్దాయిని మీరు యీ సంవత్సరంలో 'మే' నెల యిరవై మూడో తారీఖున మధ్యాహ్నం సరిగా పన్నెండు గంటల సమయంలో సార్వభౌమగా రింట్లో చూసేరంటున్నాడు ముద్దాయీ.

క్రిష్టప్ప : అబద్ధం.

డిఫెన్స్: పన్నెండు దాటిన తరువాత మీరే స్వయంగా ముద్దాయిని మీ స్టేషన్కి తీసుకుపెళ్ళి అక్కడ ఆ రోజున నిర్బంధించి, తరువాత అక్రమంగా యీ కేసు బనాయించా రంటున్నాడు.

క్రిష్టప్ప : అబద్ధం.

డిఫెన్స్: మీరా రోజున సార్వభౌమరావుగా రింటికి వెళ్ళనేలేదా ?

క్రిష్టప్ప : లేదు.

డిఫెన్స్: ఇనస్పెక్టరుగారూ ! మీరు ప్రమాణం మీదున్నారు. నిజం చెప్పండి. మీరా దినం వారింటికి వెళ్ళేరని చెప్తున్నానేను.

క్రిష్టప్ప : అబద్ధం.

డిఫెన్స్: మీరు యితణ్ణి అక్కణ్ణుంచి తీసుకుపెళ్ళిన సమయంలో సార్వభౌమరావుగారే కాకుండా, సుశీల అనే ఆవిడ కూడా ఉన్నారని అంటున్నాను.

క్రిష్టప్ప : వాళ్ళు అక్కడ వున్నారా ? లేదా అనే ప్రశ్న లేదు. ఎందుచేతనంటే ఆక్కడ నించి తీసుకుపెళ్ళే ననడమే అబద్ధం.

డిఫెన్స్: మీరా దినం మధ్యాహ్నం 12 గంటలకి ఎక్కడున్నారు ?

క్రిష్టప్ప : స్టేషన్ డైరీ చూస్తేకాని చెప్పలేను.

డిఫెన్స్: జ్ఞాపకం లేదా ?

క్రిష్టప్ప : లేదు.

డిఫెన్స్: సార్వభౌమరావుగారింట్లో మీరు ఆ సమయంలో లేనట్లుగా మీ కెలా జ్ఞాపకం వుంది ?

కిష్టప్ప : (ఆలోచించి) నేనెన్నడూ వారింటికి వెళ్ళనేలేదు కాబట్టి చెప్ప గలుగు తున్నాను.

డిఫెన్స్: ఇనస్పెక్టరుగారూ! ఇప్పుడో ప్రశ్న వేస్తున్నాను. మీరు నిజం చెప్తానని ప్రమాణం చేసేరు. నిజం చెప్తారా ?

కిష్టప్ప : చెప్తాను.

డిఫెన్స్: (పగిలిన సిసా తీసి) దీనిమీద వేలిముద్ర లున్నాయేమో మీరు పరీక్ష చేసారా !

కిష్టప్ప : చేసేను.

డిఫెన్స్: ఉన్నాయా ?

కిష్టప్ప : లేవు. గొల్ల పిల్ల లెవరో టాంపర్ చేసేరు. అందుచేత లేవు.

డిఫెన్స్: ఎందుచేత లేవో నేనడగలేదు.

కిష్టప్ప : ఎందుచేత లేవో నేను చెప్పవలసి వుంది.

డిఫెన్స్: అలాగే కానీయండి....పోనీ, దీనిమీద ఏ వేలిముద్రలూ లేవా ?

కిష్టప్ప : లేవు ?

డిఫెన్స్: మీకు బాగా గుర్తుందా ?

కిష్టప్ప : గుర్తుంది.

డిఫెన్స్: మీరసలు ముద్దాయీ వేలిముద్ర లెప్పుడైనా తీసుకున్నారా ?

కిష్టప్ప : పాత కేసుల్లో వికూడా వున్నాయి.

డిఫెన్స్: ఈ కేసులో సంగతి అడిగేను.

కిష్టప్ప : అలా అడగలేదు. "ఎప్పుడైనా తీసుకున్నారా ?" అని అడిగేరు,

జడ్జి : అవును, అలాగే అడిగేరు.

డిఫెన్స్: క్షమించండి.

జడ్జి : ప్రొసీడ్ !

డిఫెన్స్: ఇనస్పెక్టర్‌గారూ! ఒక్కటడుగుతాను. మీరు ప్రమాణం చేసేరు. నిజం చెప్పాలి. మీరు భగవంతుని యెదుట నిజం చెప్తానని ప్రమాణం చేసేరు. గుర్తుంచుకోండి. అందుచేత నిజం తప్పక చెప్పాలి.

ప్రాసి : (చటుక్కున లేచి) ఐ అబ్జెక్ట్ యువరానర్! ఒకసారయింది. రెండుసార్లయింది. ఇది మూడోసారివీరిలా సాక్షిని బెదరగొట్టాలని చూడ్డం! పబ్లిక్ కోర్టులో కోర్టువారి సమక్షంలో వీరందరినీ సమక్షంలో, 'నిజం చెప్తా'నని దేముని యెదుట ప్రమాణం చేసిన తర్వాతనే మా సాక్షి సాక్ష్యం యిస్తున్నాడు. అటువంటప్పుడు "ప్రమాణం చేసేవు జాగ్రత్త! నిజం చెప్పాలి, జాగ్రత్త" అంటూ సాక్షిని 'త్రెటెన్'చేసి యిలా మాటి మాటికీ నిజం చెప్పమనడం పద్ధతికి విరుద్ధం. "నిజం చెప్పు, నిజం చెప్పు" అంటూ యిలా మాటి మాటికీ నిజం చెప్పమని సాక్షిని హడలగొట్టడం పద్ధతికి విరుద్ధం అవునో కాదో తమరే చెప్పాలి.

జడ్జి : అవును! అలా మాటి మాటికీ నిజం చెప్పమనడం పద్ధతికి విరుద్ధం.

సోము : (గట్టిగా) నిజం చెప్పమనడం పద్ధతికి విరుద్ధమా?! ఇదిట్రా మీ న్యాయం?! ఇదా??

జడ్జి : ఆస్క్ దట్ రాస్కెల్ టు షటప్!

బెంచి : ఓయీ రాస్కెల్! కోర్టువారు నిన్ను నోరు మూసుకోమంటున్నారు.

డిఫెన్స్: (ముద్దాయితో) ఒకే నాయనా నువ్వూరుకోరా!

ప్రాసి : (డిఫెన్సు లాయరుతో) కమాన్ సర్! వేగిరం బండి లాగించండి. పిడకల వేట్లోకి దిగడానికి మనకి టైం లేదు. (అంటూ కూర్చుంటాడు)

డిఫెన్స్: (సాక్షితో) చూడండి!

కిష్టప్ప : ఎస్సర్!

డిఫెన్స్: నల్ల చెరువు నుండి ఊళ్ళోకి రావాలంటే ఒకటే రోడ్డు.

కిష్టప్ప : రోడ్డొకటే, అడ్డుదారొకటి వేరే వుంది. అయితే ఆ దారంట కార్లు వెళ్ళవు, సులభంగా నడుచుకు రావచ్చును.

డిఫెన్స్: (తల గోక్కుంటాడు) తుపాకీ ట్రేస్ చేసేరా?

కిష్టప్ప : జిల్లాలో తుపాకులున్న వారందర్నీ చెక్ చేసేం: ఆ తుపాకీ వారి దెవరిదీ అయుండడానికి అవకాశం లేదు. ఏదో నాటు తుపాకీ అయుండాలి. లైసెన్సు లేనందున ముద్దాయిమీద దానివి గురించి వేరే కేసు రిజిష్టర్ చేసేం.

డిఫెన్స్: 'తుపాకీ ట్రేస్ చేసేరా ?' అనడిగేను.
కిష్టప్ప : లేదు.
డిఫెన్స్: వాటర్ బాటిల్ ట్రేస్ చేసేరా ?
కిష్టప్ప : పట్టుకుపోయిన పిల్లలు దొరకలేదు.
డిఫెన్స్: ఈ వూళ్ళో మిల్లు బూరా పగటిపూట పన్నెండు గంటలకి మాత్రమే ఊత్తుంది. అవునా ? మళ్ళీ రాత్రి ఎనిమిదికీ, తెల్లారు ఝామున నాలుక్కీ ఊత్తుందనుకోండి. కాని పగలు ఒక్కసారే అంటే పన్నెండుకే ఊత్తుంది. అవునా ?
కిష్టప్ప : (తటపటాయించి) అవును.
డిఫెన్స్: ఈ కేసులో మొదటి సాక్షులే ఏదైనా గూడుపుఠాణీ చేసేరేమో అందు గురించి వారి కథ చెక్ చేసేరా ? లేక చెక్ చెయ్యకుండానే నమ్మేసేరా ?
ప్రాసి : అంటే, వారే హత్య చేసేరనా మీ అభిప్రాయం ? (అని నవ్వుతాడు)
కిష్టప్ప : (చిరునవ్వు నవ్వుతాడు)
జడ్జి : అంతేనా ? ఇంకేమైనా అడుగుతారా ?
డిఫెన్స్: (విసువుతో) ఇంకేం అడగనండి !
జడ్జి : నన్నా చెప్పమంటారు. (అని వెటకారంగా నవ్వుతూ లేచి ఛాంబర్స్ లోకి వెళ్తాడు)
[కోర్టు హాల్లో అంతా లేచి నిల్చుంటారు. కిష్టప్ప బోను దిగి, వాజ్మూలంమీద సంతకం చేస్తూ వుంటాడు. ముద్దాయిావి బోను పక్కవున్న రిజర్వు పోలీసులు ముద్దాయిావి బైటికి తీస్తూం టారు. అతను చేతులెత్తి "అన్యాయానికి జై, అబద్ధానికి జై" అంటూ ఎగిరెగిరి కేకలు వేస్తూ వుంటాడు. కోర్టు జవాను "సైలెన్స్" అంటూ పులిలా అరుస్తాడు.]

# 4

సెషన్స్ కోర్టులో రెండోరోజు విచారణ. కోర్టు హాలంతా మొదటి రోజులాగే వుంటుంది. ప్రాసిక్యూటర్ ప్రక్కన కిష్టప్ప కూర్చున్నాడు:

యూనిఫారంలో వున్నాడు. ముద్దాయిని బోన్లోంచి తీసుకొచ్చి జడ్జీగారికి కొంచెం దగ్గరగా నిల్చోపెట్టి, వాని ప్రక్కనే నిల్చున్నారు రిజర్వు పోలీసులు.

జడ్జి : (ముద్దాయీ అయిన సోమసుందరరావుని వుద్దేశించి) ఈ సంవత్సరం మే నెల ఇరవై మూడో తారీఖు ఆ దివారం తెల్ల వారుఝామున నీవూ, సత్యం అనే ఆసామీ, మరిన్ని మొదటి యిద్దరు సాక్షులా కలిసి కార్లో పిక్‌నిక్ గురించి వల్లచెరువు అవతల అడివికి వెళ్ళేరనీ, నీవద్ద తుపాకీ వున్నదని సాక్ష్యం వచ్చింది. నీవేమైనా చెప్పు కుంటావా ?

సోమ : అంతా పచ్చికోత. నే నెళ్ళలేదు. ఆ రాస్కెల్సెవరో మనకి తెలీదు. (ముద్దాయీ చెప్పిన జవాబులన్నీ జడ్జీగారు రాస్తూ వుంటారు)

జడ్జి : ఆరోజు మధ్యాహ్నం నీవున్నూ, సత్యం అనే ఆసామీయున్ను విస్కీ తాగినారనిన్నీ, ఒక ఆడపిల్ల గురించి మాటా మాటా అనుకున్నా రనిన్నీ, నీవు సత్యాన్ని చంపుతా నన్నావనిన్నీ, అతను ఎడంగా వెళ్ళగా నీవు విస్కీసీసాతో వెనకనుండి అతని తలపై బలంగా నాలుగు దెబ్బలు కొట్టినావనిన్నీ, అందుమీదట సదరు సత్యం వెంటనే, అనగా, సరిగ్గా పన్నెండు గంటలకి పడిపోయి చనిపోయినా దనిన్నీ సాక్ష్యం వచ్చింది. నీవేమైనా చెప్పుకుంటావా ?

సోమ : అదంతా పచ్చి కోతన్నర ! నే నక్కడికి కెళ్ళలేదు. వా డెవడో నచ్చుం—వాడెన్ని గంటలకి చచ్చిపోయేడు ?

జడ్జి : సరిగా పన్నెండు గంటలకని సాక్ష్యం వచ్చింది.

సోమ : కొట్టిన వెంటనే చచ్చిపోయేడా ?

జడ్జి : వెంటనే!

సోమ : అయితే రాసుకో ! ఆ టైంకి నేను సార్వభౌంరా వింట్లో వున్నాను. వుండడం ఆ ముసిలాడు చూసేడు. సుశీలనే పిల్లా చూసింది. ముసిలా డనుమానించి కిష్టప్పకి నన్నప్పజెప్పేడు. అప్పుడే ఆ ముసిలాడు. అంటే సార్వభౌంరావుతో అప్పుడే చెప్పేను. ముసి లాడా ! నీ యింటికి రావడం తప్పయితే అవొచ్చు ? ఒప్పుకుంటాను కాని, ఈ పోలీసాడు మాత్రం నాకు ఏ చోరీనో, కూనీనో తగి

లించేశా ? నిన్ను డిఫెన్స్ చేస్తాను, అని చెప్పేను, వాళ్లెవర్నీ డిఫెన్స్ చేసేం కూడా మనం.

జడ్జి : నాయపన్నగా దొరిగిన షాక్ వల్ల చనిపోయిన సత్యం, చనిపోయినా డనిన్నీ, అతనికి తగిలిన దెబ్బలు విస్కీ సీసాతో తగలవచ్చు నినిన్నీ, సాక్ష్యం వచ్చింది. నీమైనా చెప్పుకుంటావా ?

సోము : మనరా సంగతె త్తెలీదు.

జడ్జి : నీవు సర్వాన్ని కొట్టి, చంపి తుపాకి పట్టుకు పారిపోయినావనిన్నీ. నిన్ను మరుసటిదినం శ్మశానం దిబ్బవద్ద వుంతగా పోలీసువారు అరెస్టు చేసినట్టున్నూ సాక్ష్యం వచ్చింది. ఏమైనా చెప్పుకుంటావా ?

సోము : నేను వాణ్ని కొట్టలేదు. చంపలేదు. పారిపోలేదు. స్మశానం దిబ్బకి వెళ్ళవానికి నే నింకా చావలేదు. నన్నక్కడ అరెస్టు చెయ్యలేదు. అంతా అబద్ధం, అబద్ధం, అబద్ధం ! రాసుకోండలాగ.

జడ్జి : నీ వింకేమైనా చెప్పుకుంటావా ?

సోము : ఇంకా చెప్పుకోవచ్చా ?

జడ్జి : చెప్పుకోవచ్చు.

సోము : చెప్తానయితే, రాసుకోండి. సుశీల పిల్లా, పార్లమెంటు మెంబరూ యిప్పువొచ్చి యీ కేసులో సంగతి గురించి చెప్తారు. నిజం మీద గౌరవం అంటూ వుంటే చెప్తారు. చెప్తే మంచిదే ! చెప్పక పోయేరా ? ఫర్వాలేదు ! నా కాలి చెంట్రుక బరాబర్ ! ప్రాణం అంటే కేరేజాట్ గాణ్ని నేను. మరో సంగతి ! ఈ హానీ ఎవడు చేసుంటాడూ అంటే ఆ సాక్షి లంజకొడుకులిద్దరూ కలిసి చేసుంటారు. ఇది ఖచ్చితం. లేపోతే - మరెవడో చేస్తే వాడికి ఆసరా యిచ్చి కాపలా కాసుంటారు. ఇందులో నిజం తెలియాలంటే ఆ మొదటి వాడున్నాడు చూడండి ! — మధూగాడు కాబోలు వాడిపేరు-వాడొట్టి వెదురుగొడ్డుల్లో వెదురుగొడ్డు. వాడైతే కాపలా కాసుండడు. చూసుంటాడు. వాణ్ని మరేం చెయ్యక్కర్లేదు. "ఒరే లంజకొడకా" అని ఆపాటి మరియాదగా పిల్చి "నిజం చెప్తావా చెప్పవా ?" అని ఒక్క అరడిగ్రీ బెదిరించ్చాండంటి ! వాడు తాకెత్తిపోయి లెంపలేసుకు నిజం చెప్పకపోతే నన్నడగండి. వాడస్లే తప్పేం చేసుండడు. చూసుం

టాడు. మరింక ఆ రెండో వాడున్నాడే కిసన్ కా భయా! క్రిష్న గాడు - ఈ కేసులో అసలు బేరం ఎవడిదంటే వాడిది! ఆ లంజ కొడుకు - అది నికార్సయిన సరుకు - వాణ్ణి తిడితే యూజ్ నై! తిట్లు వాడికి తల వెంట్రుకతో సమానం అంతేత ఏం చెయ్యాలీ? తోలువెల్లు చూపించాలి. చూపించడమంతే? చాలు, చూపించి ఒక్కసారి అలా, అలా గాల్లో ఝళిపించండి. దాంతో ఇంయటో నిజం వైటకెలా వస్తుందో తెల్సా? మున్సిపాల్టీ పెప్ప పైపులోంచి సర్రున నీరుకొట్టినట్టు బైటక్కొడ్తుంది నిజం. ఈ కూనీలో వాడికి మటుకు బేరం చాలా వుంది.

జడ్జి : అంతేనా? చెప్పుకొనేది యింకా ఏమైనా వుందా?

సోమ : ఇంకేం వుంది? వుండాలంటే రాయండంతే!....ఇక్కడ కోర్టులో నేను తప్ప అంతా కులాసాగా వున్నారు. అక్కడ పెద్దలకి దండాలు. పిన్నలకి దీవెనలు, పిల్లలకి ముద్దులు చెప్పవలెను. ఇప్పటి కింతే సంగతులు. చిత్తగించవలెను. సోమసుందరం ఏసేని....కాయితం యిలా యివ్వండి. విసేని ముద్రవేస్తాను. సంతకం అయితే అర గంటాలస్య మవుతుంది. (ఈ ఆఖరి మాటల ధోరణి విని జడ్జిగారు కోపంగా చూస్తారు. ఆ మాటలు మాత్రం రాయరు. స్టేటుమెంటు ఆయన చేతుల్లోంచి తీసుకొని బెంచి గుమాస్తా ముద్దాయి చేత వేలి ముద్ర వేయించి జడ్జి గారికి తిరిగి యిస్తాడు. దాని మీద అయన సంతకం చేస్తారు.)

జడ్జి : డిఫెన్సు సాక్షులు సిద్ధంగా వున్నారా?

ప్రాసె : కోర్టువారి ఆర్డరు ప్రకారం వారికి సమన్లు వెళ్ళేయిట.

జడ్జి : వచ్చేరా:

బెంచి : హాజర్లో వున్నారండి.

జడ్జి : పిలిపించు.

డిఫెన్స్: ఒక్క క్షణమండి. (అని ముద్దాయితో రహస్యంగా ఏదో మాట్లాడు తాడు.)

సోమ : (గట్టిగా) ఫరవాలేదయ్యా! ముసలాడికి కోపవేం అనుకో! అయినా, ఇవతల పీక పోతుందన్నా నిజం చెప్పడా?

డిఫెన్స్: (నెమ్మదిగా) నా కనుమానంగా వుందిరా ?

సోము : కానీవయ్యా! అలా భయపడతావేంటి ? సచ్చేవ జమై అన్నాడు గవన్నమెంటాడు, ముద్రగుద్ది మరీ చెప్పేడు మనకింక భయపేంటి ?

డిఫెన్స్: (నెమ్మదిగా) చెప్పవలసిన డ్యూటీ కాబట్టి చెప్పేను. ఆ పైన నీ యిష్టం.

సోము : లాటరీ వేసేస్తాం! పలుకుతుంది. లేకపోతే లేదు.

డిఫెన్స్: నీ యిష్టం.

సోము : నడపనీ నాటకం, మనేం భయ్యంలేదు. (అంటూ రిజర్వు పోలీసులు వెంటరాగా బోన్లోకి వెళ్తాడు.)

జడ్జి : మొదలెడదామా ?

డిఫెన్స్: అయ.

జడ్జి : పిలిపించండి మీ సాక్షిని.

డిఫెన్స్: (బంట్రోతో) సార్వభౌమరావుగార్ని పిలవ్వోయ్!

బంట్రోతు: (బైటకివెళ్ళి వరాండాలో నిలబడి) సెర్వాల భౌంరావ్‌గారూ! సెర్వాలభౌంరావుగారూ! సెర్వాలభౌం.... (అంటూండగా సార్వ భౌమరావు నవ్వుతూ కోర్టు హాలు వైపుకు వస్తాడు.)

సార్వ : ఆపరా గొడవ, ఒస్తున్నా కదూ!

బంట్రోతు: బాబూ తమరే నేంటి ? తమరే! ఇంకెవరో అనుకున్నాను.

సార్వ : బావున్నావురా ? (అంటూ హాల్లోకి వెళ్తాడు.)

బంట్రోతు: ఏదో బాబు యిలాగున్నాం (అని నెమ్మదిగా అంటూ అతని వెనక హాల్లోకి వెళ్తాడు) ఇలా దయచేయండి బాబూ, ఇలా!

సార్వ : (సాక్షి బోను వైపువెళ్ళి కోర్టువారికి నమస్కరించి నిల్చుంటాడు.)

బెంచి : అలా అందులోనికి వెళ్ళండి (అని సాక్షి బోను చూపిస్తాడు.)

సార్వ : (బోనెక్కుతాడు.)

బెంచి : ప్రమాణం చేయండి దేముని ఎదుట....

సార్వ : దేముని యెదుట ప్రమాణం చేసి అంతా నిజం చెప్తాను. అబద్ధం చెప్పను. అంతేనా ?

బెంచి : అంతే. మీ పేరు ?

సార్వ : సార్వభౌమరావు.

జడ్జి : (డిఫెన్స్ లాయరుని వుద్దేశించి) త్వరగా అడగండి.

డిఫెన్స్: అయ (అంటూ లేచి) చూడండి సార్వభౌములుగారూ! తమరి సాక్ష్యం మీదే యీ కేసంతా ఆధార పడుతుంది.

సార్వ : నాకు సమన్లొచ్చేయి కాని, ఎందుకొచ్చేయో ఏమిటో నాకేం తెలియడం లేదు.

డిఫెన్స్: ఏమేంలేదు తమరొక్కసారి అటువైపు - అదిగో అక్కడ — ఆ కుర్రాడ్ని ఒక్కసారి చూడండి.

సార్వ : ఆ కుర్రాడా? (అంటాడు చూసేక.)

డిఫెన్స్: అతనే.

సార్వ : చూసేను. అతని గురించి ఏం చెప్పమంటారు?

డిఫెన్స్: అతణ్ని ఇంతకు ముందెప్పుడైనా మీరు చూసేరా?

సార్వ : (ముద్దాయిని మరోసారి చూసి) చూ....సి నట్టే జ్ఞాపకం (అంటూ అలా చూసి) ఇతనా?! ఆఁ చూసేను! (అని డిఫెన్స్ లాయరు వైపు తిరిగాడు.)

డిఫెన్స్: ఎక్కడ చూసేరు?

సార్వ : నా యింట్లో చూసేను, ఒకసారి.

డిఫెన్స్: ఎప్పుడో చెప్పగలరా?

సార్వ : (గుర్తుకు తెచ్చుకుందికి ప్రయత్నం చేస్తున్నట్లుగా వుంటాడు.)

డిఫెన్స్: దయచేసి కొంచెం గుర్తుకు తెచ్చుకోండి ప్లీజ్!

సార్వ : "మే"నెల్లో అయుంటుంది. ఎస్! 'మే' నెల్లోనే.

డిఫెన్స్: తారీకు చెప్పగలరా?

సార్వ : (కొంచెం ఆలోచించి) అయామ్ వెరీసారీ! గుర్తులేదు, మే నెలాఖరులో అయుండొచ్చు.

డిఫెన్స్: ఏ వారమో చెప్పగలరా పోనీ?

సార్వ : ఆవేళ....శనివారమో, ఆదివారమో అయుండొచ్చు. నే నావేళే ఏదో వూరెళ్ళి వచ్చేను.

డిఫెన్స్: పోనీయండి, ఒక్కసారేకదా యితణ్ని మీరు చూసేరు?

సార్వ : ఒక్కసారే.

డిఫెన్స్: ఎప్పుడు అంటే ఎన్ని గంటలకి చూసేరు?

సాక్షి : మధ్యాహ్నం చూసేను ?
డిఫెన్స్: ఎన్ని గంటలకి ?
సాక్షి : ఒంటి గంట దాటింది.
డిఫెన్స్: చూడ్డం ఒంటి గంటకి చూసే వుంటున్నారు. ఇతను మీ యింటికి రావడం ఎన్ని గంటలకొచ్చేడు తెలుసా ? అంతకుముందే ఒచ్చుం డాలి కదా ?
సాక్షి : నేను మెయిన్‌గేట్లోంచి లోనికొస్తుండగా ఇతను పక్క గేట్లోంచి తిన్నగా వచ్చి పక్క గుమ్మంలోంచి యింట్లోకి వెళ్తున్నాడు. నాకు అనుమానం వేసి కొంచెం నక్కి నిలబడి చూసేను. గదిలోకి వెళ్లేడు. బైటకి రాలేదు. ఆ గదికి ఒక్కటే గుమ్మం. అందుచేత అతను మళ్ళీ పారిపోవడానికి వీలు లేకుండా గుమ్మం దగ్గిర నిలబడి "ఎవర్నువ్వు ?" అని అడిగేను. ఎవర్నువ్వు ? ఎందుకొచ్చేవు ? అనే సరికి.......
డిఫెన్స్: పోనీయండి. అదలా ఉంచండి. ఇతనొచ్చిన రోజున మీ యింటికి పోలీసు వారొచ్చారా లేదా ?
సాక్షి : ఎవరో పోలీసతను రావడం వచ్చేడు.
డిఫెన్స్: ఎవరతను ? సబ్ ఇనస్పెక్టరేనా ?
సాక్షి : చెప్పలేను. అత నెవరోగాని యూని ఫారంలో లేడు. మఫ్టీలో వున్నాడు, అంచేత సబిన్‌స్పెక్టరో, హెడ్డో, జవానో ఎలా తెలుస్తుంది.
డిఫెన్స్: పోనీయండి. చూపిస్తే అతణ్ని పోల్చగలరా ?
సాక్షి : ప్రయత్నిస్తాను.
డిఫెన్స్: (ప్రాసిక్యూటర్ పక్కనే కూర్చున్న కిష్టప్పని చూపించి) అతనే నేమో చెప్పగలరా ?
సాక్షి : (కిష్టప్పని కళ్ళజోడు పెట్టుకుచూసి)అయామ్ సారీ సాబ్ ! ఇదేలా వుంటాడు. కాని యితనేనని ఖచ్చితంగా చెప్పలేను. ఆ వేళ కళ్ళ జోడు పెట్టుకు చూళ్ళేదు. అదీగాక నేనంత పర్టిక్యులర్‌గా పరిశీ లించి చూడలేదు.

డిఫెన్స్: పోనీయండి మీ యింటికి ఆ రోజు వచ్చిన పోలీసు ఆఫీసరు ఎవరో వకరు—అతను పోలీసు ఆఫీసరే కదా ?

సార్వ : పోలీసు ఆఫీసరే!

డిఫెన్స్: అతను ఇతణ్ని మీ యింటినుంచి తీసుకుపోయేనా లేదా ?

సార్వ : మా యింటికి పోలీసు ఆఫీసరు రావడం ఇతణ్ని తీసుకుపోవడానికే వచ్చాడు. కాని—అదంతా ఎలా జరిగిందంటే........

డిఫెన్స్: నే నడిగిందానికి........

జడ్జి : వారు చెప్పేదేదో చెప్పనీయండి, అవసరమైనదేదో రాసుకుంటాను! లేన్ది లేదు (అని సాక్షితో) చెప్పండి.

సార్వ : ఇతడు దొంగేమోనని అనుమానించి నేనే పోలీసువార్ని పిలిపించేనండి. ఎదురుగ్గానే స్టేషను, కాని ఆ వేళ వచ్చేందెవ్వరూ యింట్లో లేరు. వీలు చూసుకుని ప్రవేశించే దసుకున్నాను. అనుకుని "ఎవర్నవు ? ఎందుకొచ్చావు ?" అని అడుగుతే "సుశీల కోసం వచ్చాను" అన్నాడు.

జడ్జి : సుశీలెవరు ?

సార్వ : కొండమ్మ అని మా వంటమనిషి. పేరు షోగ్గా లేదని మార్చుకుంది. దానికోసం వచ్చేనని యిత నన్నాడు. అంచే అదిణ్ని పిలిపించి "ఏమమ్మా ? ఎవరితను ? నీకు తెలుసా ?" అని వెరిఫై చెయ్యడానికి అడిగేను.

డిఫెన్స్: గురువుగారూ! నేను వేసినదల్లా ఒక్కటే ప్రశ్న. ఈ కుర్రవాణ్ని ఆ రోజున మీ యింటినుంచి ఒక పోలీస్ ఆఫీసరు తీసుకుపోయాడా? లేదా ? అవునంటే అవునని చెప్పండి. కాదంటే కాదని చెప్పండి. దానికింత వృత్తాంతం అంతా ఎందుకూ ?

సార్వ : జరిగిన విషయ మేమిటో చెప్పకపోతే,మీరడిగిన ప్రశ్నకి మాత్రం సమాధానం ఎలా చెప్పను ?

జడ్జి : ఈ కుర్రవాణ్ని తెలుసా: అని అడుగుతే ఆ వంటమనిషి ఏమన్నది?

సార్వ : కామ్‌గా, కూల్‌గా "నాకు తెలియదు" అంది. అంతేకాదు., ఏ దొంగతనానికొచ్చాడో ఏమిటో తనకి అనుమానంగా వున్నదంది. అలా అయితే "పోలీస్ వారికి అలా రిపోర్టిస్తావా?" అన్నాను టెస్టు

చేదామని. ఏమో యితనే నిజం చెప్పి ఆవిడే అబద్ధం ఆవొచ్చు కదా! అందుచేత "రిపోర్టు రాసిస్తావా పోలీసువారికి?" అంటే ఇస్తా నని వెంటనే రాసిచ్చింది. "ఎవరో దొంగలా వున్నాడు: మా అయ్యగారింట్లోకి అక్రమంగా ప్రవేశించాడు: పేరడుగుతే చెప్పడం లేదు. ఎవరో నాకు తెలియడంలేదు" అని రాసేసింది. అప్పుడు నేను పోలీసు స్టేషన్కి ఫోన్ చేసేను.

జడ్జి : తరువాత ఏమిటయింది.

సార్వ : ఫోన్ చేసేను. పోలీసువారు యింకా రాలేదు. ఇంతలో యీ కుర్రవాడు ఏం చేసేడంటే....

జడ్జి : ఏం చేసేడు?

సార్వ : గొప్ప అసాధ్యుఁడేనండి, కుర్రవాడు.

ప్రాసి : మాకు తెలుసు బాబా ఆ సంగతి!

సార్వ : అరనిమిషానికి ఆరువందల మాటలు మాటాడగలడు.

జడ్జి : మాటాడి ఏం చేసేడు?

సార్వ : అలా, వరదనీరు గట్లని కొట్టేసినట్లు, ఆ విధంగా మాటాడి దబా యించి మా వంట మనిషి చేత పోలీసువారు వచ్చే లోపున నిజం ఒప్పించేడు. అలాంటి యిరకాటంలో పెట్టేసేవాడిన్నే, తీరా మోసి పోలీసువాడొచ్చేసరికి అదీ పరిస్థితి. ఈ కుర్రవాడు నిజంగా ఆవిడ కోసమే వచ్చేడు కాని దుర్మార్గంతో కాదు. అందుచేత ఆవిడ రాసిన కాయితం చింపేసేను. లేకపోతే, అమాయకుణ్ణి పోలీ స్టేషన్కి ఎలా పంపించను? ఆ వచ్చిన పోలీసువాణ్ణి వచ్చిన దారంటే పొమ్మన్నాను. అదీ సంగతి. అందుచేత పోలీసువాడు యితణ్ణి మా యింటి నుంచి తీసుకువెళ్ళలేదు. పోలీసువాడు రాక ముందే ఓ క్షణం ముందు ఇతను మా యింటి నుంచి వెళ్ళిపోయేడు తరువాత ఏమయిందో నాకు తెలీదు.

జడ్జి : మీ వంట మనిషి పేరేమని చెప్పేరు?

సార్వ : అసలు పేరు కొండమ్మండి. కాని సుశీలనే ప్రస్తుతం పిల్చు కొంటుంది.

జడ్జి : మొదటి యిద్దరు సాక్షులూ ఎవరో సుశీలో శీలో అని ఏదో చెప్పేరు కదూ ?

ప్రాసి : (లేచి) చిత్తం రెండో సాక్షి చెప్పేడండి. శీలో, శైలో, సుశీలో అని చెప్పేడు పేరు. ఆవిడ గురించి సత్యానికి, యీ ముద్దాయికీ మాటామాటా వచ్చిందని చెప్పేడు.

జడ్జి : ఐ సీ !

ప్రాసి : ఇలాటి ఘోరాల వెనక ఆడవో, డబ్బో వుంటుందిలెండి. రెంతా కనకాలు లేద్దే 'క్రిమినల్ లా'యే లేదు.

జడ్జి : సర్లెండి. మీరు కూర్చోండి ?

ప్రాసి : చితం చితం (అంటూ కూర్చుంటాడు)

జడ్జి : అంతేనా ? ఇంకేమైనా వుందా ?

సార్వ : ఇంతే ముందండి ! ఆవిడ రాసిన పొంగ కంప్లేంట్లు చించి పారేసి, ఇతణ్ణి పొమ్మనమని చెప్పి. ఆవిడని నాలుగు చీవాట్లు వేసి, మరింక ఆ సంగతి గురించి మర్చిపోయేను. ఆ విషయం గురించి సమన్లో స్తాయనుకోలేదు.

జడ్జి : (డిఫెన్స్ లాయర్ని) ఏమండి యింకేమైనా అడుగుతారా ? లేక ఛీప్ క్లోజ్ చేసేస్తారా ?

డిఫెన్స్ : ఒక ప్రశ్నండి.

జడ్జి : అడగండి.

డిఫెన్స్: (కోపంగా వెటకారంగా) ఏమండీ సార్వభౌముంగారూ! మీ రింకా ఆ వంటమనిషిని ఉంచుకునే ఉన్నారా వల్లో ?

సార్వ : (వెటకారం గ్రహించకుండా చిరునవ్వు నవ్వుతూ) వుంచుకున్నాను ఏం చెయ్యను. ఎ గుడ్ కుక్ ఈజ్ ఎ గుడ్ కుక్ ! ఈ కుర్ర వాడితో ఆవిడకున్న సంబంధం అంటారా ? మహా మహా వాళ్ళే మనసు కట్టుకోలేరు. మనకి వంట రుచిగా వుండటానికి మంచి వంట మనిషి కావాలే కాని, వంట మనిషి మహాసాధ్విగా ఉండా లని రూలు పెట్టుకుంటే మనకి పని జరగదుగదా ?

జడ్జి : చాల బాగా చెప్పేరు ?

డిఫెన్స్: (వినుపుతో కూర్చుంటాడు)

జడ్జి : (ప్రాసిక్యూటర్ని ఉద్దేశించి) క్రాసుపరీక్ష చేస్తారా ?
ప్రాసి: (లేచి) వారు అబద్ధం చెప్తారని నేనెన్నడూ అననండి. తమరికింకా తెలియకపోవచ్చు. పార్లమెంటులో వారే మా ప్రతినిధి.
సార్వ: పార్లమెంటులో ఉండడంలో నా గొప్పేం లేదండి. అది ప్రజల దయా, మా భాగ్యమూనండి.
డిఫెన్స్: మా బాగా చెప్పేరు
జడ్జి : వట్ విల్ డు ! (అని ప్రాసిక్యూటరుతో) అడిగే దడగండి.
ప్రాసి : ఒక్క ప్రశ్నేనండి. చూడండి సార్, సార్వభౌమరావుగారూ ! మీ రితన్ని- ఈ ఈ ముద్దాయిని-ఆ రోజున మీ యింటికి వస్తూండగానే చూసేసున్నారు అవునా ?
సార్వ : అవును.
జడ్జి : అవును అలాగే చెప్పేరు. రాసేను కూడాను.
ప్రాసి : ఎన్ని గంటలకండి చూసేరు ?
జడ్జి : 'మధ్యాహ్నం ఒంటిగంట దాటేక' అని చెప్పేరు. రికార్డు చేసేను కూడాను. ఇంకేమైనా అడిగితే అడగండి.
ప్రాసి : టైము మీకు బాగా జ్ఞాపకం వుంది కదండీ, సార్వభౌమరావుగారూ ?
సార్వ : జ్ఞాపకమేనండి. ఎందుచేతనంటే, నేను చాలా పంక్చువల్గా వుండా అని ప్రయత్నిస్తాను. ఆ రోజున మధ్యాహ్నం పన్నెండు గంటలకి నేను యింటికి రావలసింది. దార్లో కారు పాడయింది. యింటి కొచ్చేసరికి ఎంత లేటయిందా అని వాచీ చూసుకున్నాను, సరిగా ఒంటిగంట పదినిమిషా లయింది.
జడ్జి : అంతేనా ?
ప్రాసి : అంతేనండి (అని కూర్చుంటాడు)
జడ్జి : (సార్వభౌమరావుని) మీరు దిగొచ్చు.
సార్వ : చిత్తం. (అని దిగి వాంజ్మూలం మీద సంతకంచేసి, కోర్టువారితో) సెలవ్ (అని చెప్పి వెళ్తాడు బైటకి. బైటకి వెళ్ళగానే, బంట్రోతు అతని వెనుకనే వెళ్ళి తైరు నవ్వు నవ్వుతాడు. సార్వభౌమరావు ఒక రూపాయి అతని కిస్తాడు)
బంట్రోతు: తమల్లాటి వోళ్ళుంటేనే ఈ కోర్ట్లు నిలబడాలిగానీ, లేపోతే

కోర్ట్లెంచుకు బాబూ ! ఉంటాను. అయ్యగారు పిలుస్తున్నారు.

(లోనుంచి బెల్ వినిపిస్తుంది)

సార్వ : వెళ్ళు వెళ్ళు నీ పన్చూసుకో ?

బంట్రోతు: [హడావిడిగా లోనికి వెళతాడు] చితాం! (అంటూ) సార్వ భౌమరావు కోర్టు హాల్లోంచి వెళ్ళగా)

జడ్జి : మీ రెండోసాక్షి ఎవరు ? (అని డిఫెన్సు లాయర్ని ప్రశ్నిస్తాడు)

డిఫెన్స్:(లేచి) సుశీల అనే ఆవిడండి.

జడ్జి : వేగిరం పిలిపించండి.

డిఫెన్స్:(బెంచి గుమాస్తాతో) సుశీలగార్ని పిలిపించండి.

బెంచి : (బంట్రోతు లేకపోవడం చూచి బెల్ కొడతాడు)

బంట్రోతు: (పైన చెప్పిన ప్రకారం 'చితాం' అంటూ లోనికి వస్తాడు)

బెంచి : సుశీలగార్ని పిలువు.

బంట్రోతు: చితం (అంటూ బైటకి వెళ్ళబోతూ వుండగా సోమసుందరరావు కేక వేస్తాడు)

సోమ : ఆగు.

అందరూ:(ఆశ్చర్యంగా చూస్తారు)

సోమ : అయ్యా జడ్జిగారూ! నాదొక్క మనవి! ఈరోజు దాకా నేనే మను కున్నానంటే, ఈ లోకంలో నాకంటే దుర్మార్గుఐ వుండ రను కున్నాను.

డిఫెన్స్: (నుదురు పట్టు కూర్చున్నాడు)

కాని వున్నారు. ఉన్నారు సుమా అని చెప్పి మచ్చుపటాకీ చూపించి యిప్పుడే వెళ్ళేడు పెద్దమనిషి. అతగాడు చేసిం దేంటో తెల్సా ? నిజాన్నీ అబద్ధాన్నీ ముద్దగా పిసికేసి నీటుగా ప్లేట్లో పెట్టి కోర్టుకి తెచ్చేడతను. ఆ విసపు కూడు నన్ను తినమని మీరు పురమా యిస్తారని నాకు తెలుసు. కాని దానికి విరుగుడుందేమో చూదాం. విరుగుడు ఉండదనే నా నమ్మకం. ఉన్నా యింత విసానికది పన్చె య్యక పోవచ్చు. పిలిపించండి సుశీలమ్మని!

(మొదట్లోలా జాలీగా వుండడు ముద్దాయి. సార్వభౌమరావు సాక్ష్యం సగాని కయేసరికి బేఖాతర్‌గా వున్నప్పటికీ ముద్దాయి కొంత సీరి

యస్‌గా వుంటాడు)

జడ్జి : (సోమసుందరం మాటాడుతున్నంతసేపూ, ఆ మాట లేవీ విన కుండా విసుగ్గా వుంటాడు)

ప్రాసి : (చిరునవ్వు నవ్వుకుంటాడు)

బం|్రోతు: (పైటకి పెళ్ళి) సుసీలమ్మా! సుసీలమ్మా ! ఎవరయ్యా సుసీల ? (సుశీల ముందు కొస్తుంది) మీరా ? ఇలారండి.

సుశీల : (బం|్రోతు వెనకాల సాక్షి బోనువారా వచ్చి నిలబడుతుంది. విచారంగా ఉంటు ది సోమసుందరరావు వైపు సరిగా చూడదు. అతను ఆమె వైపు చూడడు)

బం|్రోతు: అందులోకి అలా వెళ్ళండమ్మా.

సుశీల : (బోనెక్కి నిల్చుంటుంది)

బెంచి : నే చెప్పినట్టు చెప్పండి.

సుశీల : (ఏమి టన్నట్టుగా చూస్తుంది)

బెంచి : దేముని ఎదుట ప్రమాణం చేసి....

సుశీల : (నెమ్మదిగా) చేస్తాను.

బెంచి : అనండి, దేముని ఎదుట ప్రమాణం చేసి ...

సుశీల : చేస్తాను.

బెంచి : అలా కాదమ్మా! నే చెప్పినట్టు చెప్పాలి. దేముని ఎదుట....

సుశీల : నే చెప్పినట్టు చెప్పాలి. దేముని ఎదుట....

బెంచి : అదికాదు

సుశీల : అదికాదు.

బెంచి : ష్! (అని విసుక్కుంటాడు)

సుశీల : (తెల్లబోయి) అలా కూడా అనాలా ?

డిఫెన్స్: (లేచి) చూడమ్మా సుశీలా ? కోర్టులో సాక్ష్యం చెప్పేముందు ప్రమాణం చెయ్యి.

సుశీల : చేస్తాను.

డిఫెన్స్: అందుచేత ఆ గుమాస్తాగారు ఎలా చెప్తే మీరలా ప్రమాణం చెయ్యాలి.

సుశీల : సరేనండి.

నించి : దేముని ఎదుట....
సుశీల : దేముని ఎదుట
బెంచి : ప్రమాణం చేసి....
సుశీల : ప్రమాణం చేసి....
బెంచి : అంతా నిజం చెప్తాను.
సుశీల : అంతా నిజం చెప్తాను.
బెంచి : అబద్ధం చెప్పను.
సుశీల : అబద్ధం చెప్పను.
బెంచి : మీ పేరు ?
సుశీల : సుశీల.
జడ్జి : [డిఫెన్స్ లాయర్ని ఉద్దేశించి] ఎస్! కమాన్ ! ప్లీజ్ ప్రొసీడ్ !
డిఫెన్స్: చూడమ్మా ! ప్రమాణం చేసేవుకదా ? కోర్టుని చెప్పి మరేం భయ పడిపోకు. నే నడిగే ప్రశ్నలకి నిదానంగా, నెమ్మదిగా సమాధానం చెప్పు. నువ్వు చెప్పేది చూడు, అక్కడ జడ్జిగారికి వినిపించాలి. తరవాత చూడు. అక్కడ ఆ కుర్రవాడికి (సుశీల చూస్తుంది. ముద్దాయి చూడడు.) వినిపించాలి. తెలిసింది కదమ్మా ?
సుశీల : తెలిసిందండి.
డిఫెన్స్: చూడమ్మా ? ఆ కుర్రవాణ్ని మరొక్కసారి సరిగా చూడు.
సుశీల : [తలవంచుకొనే] చూసేనండి.
డిఫెన్స్: ఆ కుర్రవాణ్ని నీ వింతకు ముందెప్పుడైనా చూసేవమ్మా ?
సుశీల : [తల ఊపుతుంది]
డిఫెన్స్: చూసేవో లేదో నోటితో చెప్పాలి.
సుశీల : చూసేను.
డిఫెన్స్: ఎక్కడ చూసేవు ?
సుశీల : మా యింట్లో ఒక్కసారి చూసేను.
డిఫెన్స్: మీ ఇల్లంటే అదెవరిల్లమ్మా !
సుశీల : మా బా....సార్వభౌమరావు గారింట్లో చూసేను.
డిఫెన్స్: ఒకసారి చూసేనన్నావు కదమ్మా....
సుశీల : ఒక్కసారే చూసేను [అని తలదించుకొనే అంటుంది]

డిఫెన్స్: ఎన్నాళ్ళ కిందట ?
సుశీల : మూణ్నెల్లు పైనవుతుంది. నాలుగు నెల లవొచ్చు.
డిఫెన్స్: అంటే ఏ నెలలో ?
సుశీల : [ఆలోచించి] మే నెలలో అవుతుంది.
డిఫెన్స్: నువ్వు చదువుకున్నావా ?
సుశీల : సెకండు ఫారం పాసయేను.
డిఫెన్స్: ఏ తారీకున చూసేవో కొంచెం చెప్పమ్మా !
సుశీల : తారీకు జ్ఞాపకం లేదు.
డిఫెన్స్: కొంచెం జ్ఞాపకం తెచ్చుకో అమ్మా !
సుశీల : నెల ఆఖరి రోజుల్లో అవుతుంది.
డిఫెన్స్: పోనీ, ఏ వారమో చెప్పగలవా ?
సుశీల : శనివారమో, ఆదివారమో అవుతుంది.
డిఫెన్స్: అమ్మా కొంచెం బాగా గుర్తు తెచ్చుకో. తారీకు జ్ఞాపకం లేదన్నావు. ఫరవాలేదు. పోనీ ఏ వారమో తేల్చి చెప్పు. శనివారమో ఆదివారమో తేల్చిచెప్పు. నెలాఖరి రోజుల్లో ఆ వారం ఏ తారీకయినదీ కనుక్కోవచ్చు. ఇందులో తారీకూ, టైమూ ముఖ్యం. ఇతన్ని ఎన్ని గంటలకి ఆ రోజున మీ ఇంట్లో చూసేవు ?
సుశీల : పదకొండున్నర దాటింది.
డిఫెన్స్: పగలా ? రాత్రా ?
సుశీల : పగలు.
డిఫెన్స్: ఇతను మీ ఇంట్లో వుండగా చూసేనన్నావు. మీ ఇంట్లో ఎక్కడ ?
సుశీల : మా బా....సార్వభౌమరావుగారి గదిలో.
డిఫెన్స్: నువ్వు చూసేసరికి ఆ గదిలో ఎవరెవ రున్నారు ?
సుశీల : బా....సార్వభౌమరావుగా రున్నారు ?
డిఫెన్స్: ఇతను లేడా ?
సుశీల : ఉన్నాడు.
డిఫెన్స్: ఇతను మీ యింట్లోంచి వెళ్ళేడు కదమ్మా, ఆ తరువాత ?
సుశీల : వెళ్ళిపోయేడు: అంటే, తీసుకుపోయేరు ?
డిఫెన్స్: ఎవరు తీసుకువెళ్లేరు ?

సుశీల : పోలీసాయన తీసుకు వెళ్ళేరు.
డిఫెన్స్: ఆ రోజు మధ్యాహ్నమేనా ?
సుశీల : అవును.
డిఫెన్స్: ఎన్ని గంటలకి ?
సుశీల : పన్నెండు దాటేక.
డిఫెన్స్: ఆ రోజున ఇతణ్ని మీ ఇంట్లో మొదటిసారిగా మధ్యాహ్నం పన్నెండు గంటలకి చూసేవు, మీ ఇంట్లోంచి వెళ్ళడం మధ్యాహ్నం పన్నెండు దాటేక చూసేవు. మధ్య టైంలో ఎక్కడున్నాడితను ?
సుశీల : మా ఇంట్లోనే ! మరింక ఎక్కడుంటాడు ?
డిఫెన్స్: సరేలే అమ్మా ! పోలీసాయన్తో ఇతను కలిసే వెళ్ళేడన్నావు కదమ్మా ?
సుశీల : అవును. అతడు ఇతణ్ని తీసుకువెళ్ళేడు, ఇతడు మొదట రానన్నాడు. తరువాత, సరే, పదమన్నాడు.
డిఫెన్స్: ఆ పోలీసాయన్ని పోల్చగలవా ?
సుశీల : పోల్చగలనో లేదో సరిగా చెప్పలేను. ఆయన ముఖం నేను సరిగా చూళ్ళేదు.
జడ్జి : అతను పోలీసు మనిషని నీకెలా తెలుసును ?
సుశీల : (తల దించుకొని మాటాడుతున్న మనిషి, ప్రశ్న మరో దిక్కునుంచి రావడంతో తల ఎత్తి ఆ దిక్కుకి జడ్జి వైపు చూచి) మా బావగారు సార్వభౌమరావుగారు ఫోనుచేసి పిలిపించేరు. అంచేత పోలీసాయననే అనుకున్నాను.
జడ్జి : పోలీసువారు ఇతణ్ని ఎందుకు తీసుకు వెళ్ళేరు ?
సుశీల : దొంగేమోనని అనుమానించి తీసుకువెళ్ళేరు. నాచేత కాయితం కూడా రాయించేరు. (అని డిఫెన్స్ లాయరు వైపు తిరిగి) అన్నట్టు తారీకు కావాలన్నారు, ఆ కాయితంలో తారీకు ఉంటుందే ?
డిఫెన్స్: చూడమ్మా ! ఆ కాయితం ఇప్పుడులేదు. అంచేత, చూడమ్మా ఆ రోజు శనివారమో, ఆదివారమో జ్ఞాపకం చేసుకో. మరొక్కసారి ప్రయత్నం చెయ్యి. ఇది ఖూనీకేసు. మనిషి చావుబతుకులు నీ మాట మీద ఆధారపడవొచ్చు. అంచేత ప్రయత్నం చెయ్యి.

సుశీల : (తెల్లబోతుంది)

డిఫెన్స్: ఏమిటమ్మా? అలా చూస్తున్నావేం?

సుశీల : నాకు....నేను....నాకు—ఏమిటో అన్నారు మీరు,

డిఫెన్స్: ఇది ఖూనీకేసమ్మా! ముద్దాయికి శిక్ష వెయ్యడమో, మానడమో
నీ సాక్ష్యం మీద....

సుశీల : ఖూనీకేసా??

డిఫెన్స్: ఏం? నీకు తెలియదా?

సుశీల : నాకేం తెలీకుండా వుంది? ఖూనీ అంటే....అంటే....చంపడమేనా?

డిఫెన్స్: అవును, హత్య, నరహత్య.

సుశీల : ఖూనీ! హత్య! ఎవరు చేసేరు?

డిఫెన్స్: అదే తేలా లిప్పుడు?

సుశీల : అంటే....అంటే .. సుందరం . చేసేనా? అతను....దొంగ....
కాడు... దొంగతనాని కొచ్చేడని .... అనుమానం .... ఆయన....
ఆయన అనుమానించేరు, అంతే....దొంగతనం చెయ్యలేదు.

డిఫెన్స్: అయ్యో తల్లీ! ఇది చోర్రీ కేసనుకుంటున్నావా. ఏమిటి? !!

సుశీల : కాదా? మరేమిటి! ఈ కేసేమిటి??

డిఫెన్స్: ఇది ఖూనీకేసు. ఆ రోజు మధ్యాహ్నం సరిగా పన్నెండు గంటలకి

సుశీల : పన్నెండు గంటలకి?

డిఫెన్స్: నల్ల చెరు వవతల అడివిలో సత్యం అనే కుర్రవాణ్ని యీ
ముద్దాయి హత్య చేసేడని కేసు పెట్టేరు.

సుశీల : హత్యా??

డిఫెన్స్: అవునమ్మా? హత్య, అంటే ఖూనీ చేసేడని కేసు పెట్టేరు. కేసు
రుజువయితే ఉరిశిక్ష వేసినా వెయ్యొచ్చు.

సుశీల : ఖూనీయా ఉరిశిక్షా?? మధ్యానం పన్నెండు గంటలకా?
(అని అంతవరకూ నిస్సత్తుగా, నిద్రమత్తుగా వున్న మనిషి షాక్
తిని తెలివి తెచ్చుకున్నట్టుగా అవుతుంది)

డిఫెన్స్: అవును, మధ్యానం పన్నెండుకి సత్యం అనే స్టూడెంటుని ఇతను
ఖూనీ చేసే డంటున్నారు.

సుశీల : ఆ రోజా! మధ్యానం పన్నెండుకా? సత్యాన్నా? అతనెవరు?

అత నక్కడ లేదే! మా యింటికి రాలేదే! ఇతనే ఒచ్చేడు, మధ్యాహ్నం పన్నెండుకి మా ఇంట్లో వున్నాడు. నల్లచెరు వెక్కడ? అక్కడెక్కడే! పన్నెండుకి మా యింటికొచ్చేడు. దొంగేమోనని అనుమానపడి కాయితం రాయమన్నారు.

డిఫెన్స్: ఎవరు రాయమన్నారు?

సుశీల: మా బావగారు. మీ కాయన్ని తెలీదా? ఎంతో మంచివారు. పార్లమెంటుకి మెంబరు కూడా అయేరు. ఎంతో డబ్బు నష్టపడ్డారు కూడాను. డబ్బు పుచ్చుకుని వోట్లిస్తామని ఎంతో మంది దగా చేసేరు. అయినా నెగ్గేరు. దగా చేసిన వాళ్ళని పల్లెత్తుమాట అల్లేదాయన. అంతమంచివారు. వాళ్ళ పాపాన్నవాళ్ళే పోతారల్లేఅన్నారు. నే నేమిటి చెపున్నాను? మా బావగారి గురించా - కాదు, సుందరం గురించి. హత్య చేసేడన్నారు! ఎవరన్నారు ప్లీడరుగారూ? అంత అబద్ధం! మా బావగారే-సార్వభౌమరావుగారు, మీకు తెలీదూ?- ఆయన పోలీసుల్ని పిలిపించి అప్పచెప్పేరు. సుందరం రానన్నాడు. రౌడీ మాటలు మాటాడేడు. చివరి కెలాగో వెళ్ళేడు. ఖూనీ కేసేమిటి ప్లీడరుగారూ? అంతా అబద్ధం! ఘోరం! (అవి రెండుచేతుల్తోమా కళ్ళు మూసుకు బెక్కుతుంది. తరువాత చేతులు తీసి) అంతా అబద్ధం! అతను ఖూనీ చెయ్యలేదు. ఎలా చేస్తాడు? చేసేడని మీతో ఎవరో కిట్టని వాళ్ళు చెప్పుంటారు. కావలిస్తే మా బావగార్నడగండి, ఆయన అబద్ధం ఆడరు. సుందరం దొంగేమో అనుకున్నారు కాని దొంగ తనం చెయ్యలేదు సుందరం! "దొంగతనం చెయ్యలేదుకదా. చేసేడని ఎలా అంటాం? అంచేత యితను దొంగేమో అనుమానంగా వుంది" అని అంతమాత్రం రాయమన్నారు. ఆయన్నడగండి. ఆయన నిజం ఏమిటో చెప్తారు. ఆయన మంచివారు. ఎంతో మంచివారు. ఎంత మంచివారు కాకపోతే, ఇంతయ్యేక యింకా యిప్పటికీ యింత పనికిమాలినదాన్ని నన్నింకా వారింటో వుండనిచ్చి నాకింత అన్నం పెడతారు? కృతఘ్నురాల్ని నేను! అయినా నన్నుండ నిచ్చేరు. ఆయన్నడగండి. ఆయన నిజం చెప్తారు తప్పకుండా చెప్తారు (అవి మళ్ళీ కళ్ళు మూసుకొని ఏడుస్తుంది)

ప్రాసి : ఆయన్ని అడిగేరు. నిజ మేమిటో ఆయన చెప్పేరు కూడాను.

సుశీల : (ముఖం మీంచి చేతులు తీసి) అవును. ఆయన ధర్మరాజు. నిజం తప్ప అబద్ధం చెప్పరు. ధర్మరాజయినా చెప్పొచ్చు కాని ఆయన చెప్పరు. కాని నాకు తెలుసు. ఆయన కూడా ఆ రోజున అప్పుడే పన్నెండు గంటలకే వచ్చేరు. ఇంట్లో నౌక ర్లెవరూ లేరు. అంతా ఎక్కడ చచ్చేరని విసుక్కున్నారు కూడాను .. అన్నట్టు....ఏమండీ ప్లీడరుగారూ ! జ్ఞాపకం వచ్చింది. అమ్మ !!జ్ఞాపకం వచ్చింది. ఆవేళ ఆదివారం ! ఆ వేళ పండుగ ! కుంచాలమ్మ పండుగ. ఆదివారం ఆ పండుక్కి నౌకర్లంతా పండుక్కి పోయేరు. అందుకే ఆయన-మా బావ గారు - విసుక్కున్నా రు కూడాను. ప్లీడరు గారూ! వేగిరం చెప్పండి. ఆ వేళ ఆదివారమని కోర్టు జడ్జిగారితో వేగిరం చెప్పండి. ఆదివారం ! తారీకు ? తారీకెంత చెప్మా ? ఇరవై కాదు. ఇరవై ఒకటీ కాదు. రెండు కాదు. ఇరవై మూడు. ఆఁ ఇరవై మూడో తారీకు !! అది ఆ వేళ తారీకు. పాలమనిషి ఆ వేళ పొద్దున్నే డబ్బుల కోసం పేచి పెట్టింది. "ఇరవై మూడో తారీక్కి డబ్బిచ్చేమంటే ఎలా ? అయినా బాబు గారింకా రాలేదు. ఒచ్చేక అడుగుతాన్లే" అన్నాను. అది తెయ్యిమని గెంతి వెళ్ళిపోయింది [దాని కొడిక్కి మర్నాడు పెళ్ళిట "ఆడ పెళ్ళివారొచ్చి యింటి నిండా కూర్చున్నారు కదా. అవసరానికి యివ్వకపోతే డబ్బసలు యింకెందు కివ్వటం" అంటూ కేకలువేసి తిట్టింది. అప్పు డ్నాదగ్గిర ఇరవయ్యుంటే యిచ్చేను. దాని కొడుకు పెళ్ళి రోజుకి ముందురోజే అయింది. అది పెద్దింటి వాళ్ళ శుభలేఖలు అచ్చేయించింది కూడాను. అందులో తారీకు చూపండి. దానికి ముందు రోజే సుందరం మా యింటికి వచ్చేడు] ఆవేళ ఇరవై మూడు, కాదని అనుమానం వుందా? అయితే కుంచా లమ్మ పండుగ ఏ రోజో కనుక్కోండి అది ఏ రోజునైతే అదే రోజు ! మధ్యాన్నం పన్నెండుకి ! సుందరం ఆయన గదిలో దాగు న్నాడు. ఆయన బైటికి రమ్మన్నారు. అప్పుడే బుయ్యిమని మిల్లు బూర కూడా వూదేరు, ఊత్తుంటే పక్క గదిలోకి పారిపోయేడు. దాని కొకటే గుమ్మం. ఆ తలుపు బైట గడియ వేసేసేరు బావ

గారు. పేసేసి పోలీసువార్ని పిలిపించేరు. ఇనస్పెక్టరుగార్ని పిల్చేరు. కిష్టప్ప ! కిష్టప్ప ! పోలీసాయన పేరు కిష్టప్ప! అతన్ని అలాగే పేరు పెట్టి పిల్చేరు. (అని పోలీసు బట్టలో వున్న కిష్టప్పని చూసి) ఏమండీ కిష్టప్పని మీకు తెలుసా ? మీలాగే వుంటా రాయన. సరిగ్గా నేను చూళ్ళేదు. మీ మొహం కొంచెం అలానే వుంది. ఆ వేళ మామూలు బట్టల్లో వున్నారు. ఆయన మీరే నేమిటి ? కలెక్టరు పెళ్ళాం ఎలా వుంటుందంటే ఎవరో కాని మొగవాడు ఆడ వేషం వేసి నట్టుంటుందన్నారు. అంత ఏడుపులోనూ నాకు నవ్వొచ్చింది. పేరు కిష్టప్పేనా ? అదిగోనండీ ప్లీడరు గారు ! అయ న్నడగండి. ఆయన కిష్టప్పయితే ఆయన్నే మా బావ గారు పిల్చేరు. ఆయ న్నడగండి. ఆయన అబద్ధం చెప్పరు పెద్ద చదువు చదువుకు నుంటారు. పెద్ద ఉద్యోగం చేస్తున్నారు కదా ? ఆయన అబద్ధం ఆడతారా ? ఆడరు ! ఆయన్నడిగండి. సుందరం ఖూనీ చెయ్యలేదు చెప్పండి ప్లీడరు గారూ ! కోర్టు జడ్జి గారికి నిజం చెప్పండి. మీరు మంచివాళ్లా వున్నారు. మీరు చెప్తే ఆయన వింటారు. చెప్పండి వారితో నిజం, దయచేసి చెప్పండి! నా యందు దయ యుంచి చెప్పండి.

డిఫెన్స్: అమ్మా ! కోర్టు వారికి నేనంతా మనవి చేస్తాను. ఇప్పుడు వారు- ఆ ప్లీడరుగారు-మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు వేస్తారు. గాభరా పడక సరిగా సమాధానం చెప్పండి. నిజం చెప్పండి. (అని కూర్చుం టాడు)

సుశీల : నిజం చెప్తాను.

ప్రాసి : (లేచి) నీకు నిజం అంటే అర్థం తెలుసునా అమ్మాయ్ ?

సుశీల : (గాభరా పడుతూ) నిజమా ? నిజం అంటేనా ?....అంటే ?

ప్రాసి : నిజం అంటే అర్థం తెలుసా ?

సుశీల : అర్థవా?! .. అంటే ?

ప్రాసి : ఇదండి ఈ సాక్షి వరస! నిజం అంటే అర్థం తెలియదు, అర్థం అంటే అర్థం తెలియదు. చూడమ్మాయ్! సరిగా చూడు (ముద్దాయి వైపు సుశీల తల తిప్పగా, అందుకలా అంటాడు ప్రాసిక్యూటరు)

ఇలా చూడు! చూస్తే నా వైపు చూడు. లేకపోతే కోర్టువారి వైపు చూడు. సంజ్ఞల కోసం అటు వైపు చూస్తున్నావు. చూడాలంటే వాణ్ణి తరువాత చూద్దువుగాని సరిగా నిలబడు దిక్కులు చూడకు. అడిగిన్దానికి సమాధానం చెప్పు!

డిఫెన్స్: (సగం లేచి) మీరలా సాక్షిని గాభరా పెట్టడానికి వీల్లేదు. (అని కూర్చుంటాడు)

ప్రాసి : గాభరాపెడితే గాభరాపడే మనిషికాదీవిడ. మీరేం అలా భయపణ్ణక్కర్లేదు. జిల్లాకోర్టంతటినీ గాభరా పెట్టదగిన మనిషి తక్కువదేంకాదు. ఏడ్చేసి కళ్ళంట నీళ్ళు కార్చేసి, కల్లబొల్లి కబుర్లు చెప్పేస్తే నిజం చెప్తోందని నమ్మడానికి ఇక్కడంతటి వెర్రివాళ్ళెవరు? నిజం నిప్పు లాంటి దన్నారు. అంటే-కుంపట్లో తడి బొగ్గుల్ని ఉఫ్ఫూ ఉఫ్ఫూ ఊదూది చేసిన నిప్పులాంటిదికాదు. రెండు కళ్ళతోనూ ఉప్పునీళ్ళు కార్చేసి ఆర్పేయడానికి, అది పెట్రోలు మంట! అర్పడం ఆవిడ తరం కాదు.

జడ్జి : కమాన్ మిస్టర్ ప్రాసిక్యూటర్! కానీయండి. కేసు కానీయండి. ఆలస్యం చెయ్యొద్దు.

ప్రాసి : చిత్తం చిత్తం! అయామ్ వెరీ సారీ యువరానర్! వెరి వెరి సారి. క్షమించాలి తమరు.

జడ్జి : ప్లీజ్ ప్రొసీడ్! వేగిరం!

ప్రాసి : చిత్తం (అంటూ సుశీలవైపు తిరిగి) చూడు సుశీల! అన్నట్టు నీపేరు నిజంగా సుశీలేనా?

సుశీల : "సుశీల!" అని పిలుస్తారండి

ప్రాసి : ఎవరైన పిలిచినప్పుడు నీ పేరు 'సుశీలా?'

సుశీల : అవును

ప్రాసి : పిలవనప్పుడు? పిలవనప్పుడు నీ పేరేమిటి?

సుశీల : అమ్మా నాన్న పెట్టిన పేరు సుశీల కాదండీ. కొండమ్మ.

ప్రాసి : నీ అసలు పేరు కొండమ్మా?

సుశీల : అవునండి

ప్రాసి : ఓహోహూ! అయితే, పేర్లోనే పెద్దఅబద్ధం వుందన్న మాట!

సుశీల : అబద్ధం కాదండి. ఇలాగా అలాగా అని కూడా పిలుస్తారు. స్కూల్లో వేసినప్పుడు పేరు బాగోలేదని మా అమ్మే మార్చింది.

ప్రాసి : చూడు కొండమ్మా! నువ్వు సార్వభౌమరావుగారింట్లో వంట మనిషివేనా ?

సుశీల : అలాక్కాదండి

ప్రాసి : సార్వభౌమరావుగారు నీకేమైనా బంధువా ?

సుశీల : కాదండి

ప్రాసి : నీకాయన బావగారా ?

సుశీల : కాదండి ఆయన మంచివారు. నన్నలా చనువు మీద పిలవ స్తారు.

ప్రాసి : సార్వభౌమరావుగారు నీ బావగారన్నమాట నిజమా ? అబద్ధమా ?

సుశీల : నిజం కాదండి.

ప్రాసి : అబద్ధమేనా ?

సుశీల : అబద్ధమే నండి

ప్రాసి : సార్వభౌమరావు గారింట్లో నీ తల్లి వంట పని చేసేదా ?

సుశీల : చేసేదండి

ప్రాసి : అంటే నీ తల్లి వంట మనిషేనా ?

సుశీల : అవునండి.

ప్రాసి : సార్వభౌమరావుగా రింట్లో నువ్వు ఏం పని చేస్తుంటావు ?

సుశీల : ఏం చేస్తాను !.....

ప్రాసి : ఏమో నాకెల తెలుస్తుంది ? (అని నవ్వుతాడు)

సుశీల : ....ఆయన ఏం చెయ్యమంటే ఆ పని చేస్తాను.

ప్రాసి : వారింట్లో అంట్లు తోముతున్నావా ?

సుశీల : లేదు. పని మనుషులున్నారు.

ప్రాసి : ఇల్లు తుడుస్తావా ?

సుశీల : పనిమనుష లున్నారే

ప్రాసి : సార్వభౌమరావుగారికి భార్య ఉన్నదా?

సుశీల : ఎప్పుడో చనిపోయేరు.

ప్రాసి : ఇంట్లో ఇంకెవరైనా ఆడవారున్నారా?

సుశీల : లేరు. ఆడపిల్లలేరు, కొడుకు ఒక్కరే. బెంగుళూర్లోనో ఎక్కడో

పెద్ద ఉద్యోగం.

ప్రాసి : నల్లే నల్లే! వారి గొప్పలు నువ్వు చెప్పకో అక్కర్లేదు. నువ్వేం చేస్తావని ప్రశ్న. వంట చేస్తుంటావా!

సుశీల : నే నొండితేనే కాని ఆయన తినరు.

ప్రాసి : అయితే, వంట చేస్తావు ?

సుశీల : నేనే వండుతాను.

ప్రాసి : వారింట్లో వంటచేసే మనిషివి నువ్వేనా ?

సుశీల : అవును.

ప్రాసి : వారి వంటమనిషివి కావన్నా విందాట్లాను. ఆ మాట అబద్ధమేనా?

సుశీల : మీకు అబద్ధంలా తోస్తే అబద్ధమే సరి. [కాని నన్నాయన వంట మనిషిగా చూడ్డంలేదు.]

ప్రాసి : ఓహో ? అయితే నీ కాయన చాలా మర్యాద ఇస్తారా?

సుశీల : అవును.

ప్రాసి : అయితే నువ్వసలు వంట మనిషివే కాని, ఆయన యెక్కువ మర్యాద ఇచ్చేరు కాబట్టి ఎక్కువ దానిపై పోయే వంతేనా? ఇందాట్లా అడిగినప్పుడు "వంటమనిషిని కాను" అన్నావు. అబద్ధమేనా?

సుశీల : మీ ఇష్ట ప్రకారమే కానీయండి.

ప్రాసి : ఆ మాట అబద్ధమేనా.

సుశీల : అబద్ధమే?

ప్రాసి : చూడు కొండమ్మా! పోలీసువారికి నువ్వేదో కాయితం రాసేవు ఆ రోజున! అవునా?

సుశీల : అవును.

ప్రాసి : ఇప్పటికి ఇతని పేరు తెలియదనే రాసేవు. అవునా?

సుశీల : అవును.

ప్రాసి : చూడు, కొండమ్మా! ఇతని పేరు సుందరం అని ఎలా తెలుసు నీకు ?

సుశీల : తెలుసు.

ప్రాసి : ఎలా తెలుసు? ఎవరైనా చెప్పేరా ?

సుశీల : అతనే చెప్పేడు.

ప్రాసి : ఎప్పుడు చెప్పేడు ఆ రోజేనా?

సుశీల : కాదు.

ప్రాసి : ఆ తరువాతా?

సుశీల : కాదు.

ప్రాసి : అంతకుముందే చెప్పేడన్న మాట!

సుశీల : అవును.

ప్రాసి : మరైతే ఆ రోజుకి అతనెవరో నీకు తెలుసన్న మాట.

సుశీల : (దుఃఖం ఆపుకోలేకపోతూ) తెలుసు.

ప్రాసి : మరైతే. ఎవరు ఏమిటో తెలియదని పోలీసువారికి రిపోర్టెందుకు రాసేవు?

సుశీల : (ఏడుస్తుంది)

ప్రాసి : కోర్టులో ఏడవటానికి వీల్లేదు తెలుసా?

జడ్జి : చాలసేపు టాలరేట్ చేసేనమ్మాయ్ నిన్ను! ఇక్కడ ఏడుపులు గీడుపులూ పనికిరావు.

ప్రాసి : నాటకం అండి ఇదంతాను.

జడ్జి : నిజం ఏడుపులైనాసరే, నాటకం ఏడుపులైనాసరే, ఇక్కడ ఏ యేడుపులూ పనికిరావు.

ప్రాసి : చూడు కొండమ్మా! అతని పేరు తెలియదని ఆ వేళ రిపోర్టులో అబద్ధం ఎందుకు రాసేవు? నా ప్రశ్నకి ఏడ్చయినా జవాబు చెప్పు? లేదా, జవాబు చెప్పేకైనా ఏడువు!

జడ్జి : ఇక్కడ జవాబు చెప్పాలి కాని, ఏడవడానికి వీల్లేదు.

ప్రాసి : ఏడవడం అదో జవాబుకాదు.

జడ్జి : (బెంచి గుమస్తాతో) ఏడవొద్దని చెప్పు.

బెంచి : ఏవండమ్మా! ఇక్కడ ఏడవొద్దు.

సుశీల : (వెక్కి వెక్కి ఏడుస్తుంది)

జడ్జి : (విసుగుతో. కోపంతో) ఏడవొద్దని చెప్తుంటే నీకాదూ?!

ప్రాసి : నువ్వేం మనిషివా? పశువా?

సోమ : ఆవిడ మనిషే! మీరు మాత్రం కసాయివాళ్ళు.

సుశీల : నేనో పశువుకంటే కనిష్టం దాన్ని.

ప్రాసి : కాదుమరి. పశువులు అబద్ధాలాడవు.

సుశీల : అవున్నాయనా అవును. పశువులకంటే హీనమైనదాన్ని. నేను పాపిష్టిదాన్ని! ప్రభువుల్లారా ! తండ్రుల్లారా ! నన్ను క్షమించండి ! నేను తుచ్ఛురాల్నే. ఏ పాపం చేసుకున్నానో, ఈ పుట్టుక పుట్టేను. ఏ నిప్పుల పూజ ఎప్పుడు చేసుకున్నానో బాధ భరించలేక యిలా బతుకుతున్నాను. నా ...ల్లారా! నన్ను క్షమించండి.

డిఫెన్స్: (లేచి) అడ్డొస్తున్నందుకు కోర్టువారు క్షమించాలి. కాని, ప్రాసిక్యూటర్ వారు యింత నిర్దయంగా ప్రవర్తించడం చాలా అన్యాయమని మనవి చేసుకొంటున్నాను.

ప్రాసి : మీ మాటలకి నేను అబ్జెక్టు చేస్తున్నాను.

డిఫెన్స్: అబ్జె.. షన్ని అంవాకా అలా వుంచండి! ప్రహ్లాదుణ్ని హిరణ్యకశిపుడు....

ప్రాసి : ఐ అబ్జెక్ట్ !

డిఫెన్స్: గద్దించునట్టుగా సాక్షిని గద్దించటం వారికేం భావ్యంగాలేదు. ఆయన వేసిన ప్రశ్నలన్నింటికీ-మధ్య మధ్య ఏడుస్తున్నా- ఆవిడ జవాబు లిస్తోనే వుంది కదా!! ఒక్క క్షణం ఏడవనియ్యండి, ఏడిస్తే ఏమి పోయింది? క్షణంలో ఆగిపోయి సర్దుకొంటుంది.

ప్రాసి : ఆడమైనవాళ్ళు కోర్టుకువచ్చి ఏడవడం కోర్టు పనికి అంతరాయం ! అంతకుమించి, అది కోర్టువారి డిగ్నిటీకి భంగం!

డిఫెన్స్: కోర్టులో దుఃఖం ఒస్తే యింటికి వెళ్ళి ఏడవమంటారా?

జడ్జి : ఏడవటం కోర్టు పనికి అంతరాయం! అంతే! మీరు కూడా కోర్టు పనికి అడ్డొస్తున్నారు. మధ్యలో ఏడుస్తూ యిక్కడ పనికి ఆవిడ అడ్డు రాకూడదు. మీరు కూడా యిలా మధ్యలో మాటాడ్టానికి వీల్లేదు.

డిఫెన్స్: తమరు నన్ను మన్నించాలి. లోకంలో వున్న దౌర్భాగ్యు లందరికి ఏడవడానికి తప్ప మరో హక్కంటూ లేదు. అన్నీ తీసేసినా ఆ హక్కు తీసేడానికి మాత్రం భగవంతుడికూడా హక్కులేదు .అసలు ఏడవడం అనేది మనందరికీ పుట్టుకతో వచ్చిన విద్య, ప్రతిమనిషి,

పుట్టగానే చేసేసనే అది!

జడ్జి : మీరు అనవసర ప్రసంగం చేస్తున్నారు.

డిఫెన్స్: కోర్టులో ఏడవొద్దన్నారు కాబట్టి యింతా చెప్పవలసొచ్చింది. కోర్టు కొచ్చినవాళ్ళు యింటికెళ్ళి ఎలానూ ఏడుస్తారు.

ప్రాసి : అది వేరే సంగతి.

డిఫెన్స్: కాని, ఎవరి ఏడుపు వాళ్ళు చెప్పుకుందికే అందరూ కోర్టు కొస్తారు.

జడ్జి : మీరు మరింకేం చెప్పొద్దు!!

డిఫెన్స్: ఏదో పెద్ద ముండావాణ్ణి. చెప్పేను. ఆపై తమరి చిత్తం!

జడ్జి : (ప్రాసిక్యూటర్ని) ప్రొసీడ్!

ప్రాసి : చిత్తం! ప్రొసీడవడానికి నా అడ్డెం లేదండి, చూడు కొండమ్మా! ఏడుపయిందికద! ఇంక సరిగా జవాబు చెప్పు. ఈ సుందరాన్ని నీకు ఎన్నాళ్ళనించీ తెలుసు?

సుశీల : (కళ్ళు తుడుచుకొని) ఏడాదినించి.

ప్రాసి : ఏడాదినించీ యితణ్ని రోజూ చూస్తూ వున్నావు కదూ?

సుశీల : తరచు చూస్తున్నాను

ప్రాసి : ఇందాట్లా చెప్పినపుడు, అతన్ని ఒక్కసారే చూసేనన్నావు. ఆ మాట అబద్ధమేనా?

సుశీల : అబద్ధమే.

ప్రాసి : ప్రమాణం చేసి కూడా అబద్ధం చెప్పేవు అవునా?

సుశీల : అవును.

ప్రాసి : సార్వభౌమరావుగారితో కూడా ఇతనెవరో తెలియదని దబాయించేవా లేదా?

సుశీల : గదిలో నేనేం చూళ్ళేదన్నాను, వెంటనే....

ప్రాసి : తరువాత వప్పుకున్నావు.

సుశీల : అవును.

ప్రాసి : ముందు అబద్ధమే చెప్పేవు.

సుశీల : నిజం చెప్పడానికి ముందు భయపడ్డాను. తరవాత చెప్పేసేను.

ప్రాసి : ముందుమాట, అబద్ధమేనా?

సుశీల : అబద్ధమే.

ప్రాసి : తరవాత, చూడు! పోలీసు వారికి రిపోర్టు రాసేవు.

సుశీల : అవును.

ప్రాసి : ఇతణ్ని తెలియదని రాసేవవునా ?

సుశీల : అవును.

ప్రాసి : అదీ అబద్ధమే.

సుశీల : అవును.

ప్రాసి : ఎవర్రాసే రా కాయితం ? నువ్వే స్వయంగా రాసేవా ?

సుశీల : నేనే రాసేను.

ప్రాసి : ఇతను దొంగతనానికి వచ్చేడనే రాసేవా ?

సుశీల : దొంగేమో అనుమానంగా వుందని రాసేను (అని చేతుల్లో ముఖం కప్పుకొంటుంది)

ప్రాసి : రాసేవా ?

సుశీల : రాసేను.

ప్రాసి : అది కూడా అబద్ధమేనా ?

సుశీల : (ముఖంమీంచి తీసేసి) అబద్ధం! అబద్ధం! అబద్ధం! అబద్ధమే రాసేను. తండ్రీ ? నే నీ బాధ భరించలేను.

ప్రాసి : తెలిసి కూడా అబద్ధం రాసేవు, అవునా ?

సుశీల : తెలిసే, తెలిసే అన్ని పాపాలూ చేసేను. తెలిసే నన్ను నమ్మిన బావగారికి ద్రోహం తలపెట్టేను. పెంటకుప్ప మీద పొర్లుతూన్న దాన్ని చేరదీసి తిండిచ్చి, బట్టిచ్చి, ఆదరించి అభిమానించి దౌర్భాగ్యు రాల్ని అని తెలిసీ కూడా నన్ను ప్రేమించేరు. అంతటి మంచివారు నా అంతటి తుచ్ఛురాల్ని ప్రేమించారంటే పొంగిపోయేను. ఆయనే నా దేముడని నమ్మి నా యిష్టం మీదే ఆయనకి నా జీవితం అర్పించేను. బాల వితంతువుని, భ్రష్టురాల్ని, ముష్టిదాన్ని (ఈ పాపిష్టి దాన్ని తాళికట్టి తెచ్చుకున్న దానికంటే ఎక్కువగా చూసుకున్నారు. నన్ను పువ్వుల్లో పెట్టుకు పూజించుకున్నారు. అన్నం మొహం ఎరగని దాన్ని నాకు స్వర్గ సుఖాలు చూపించారు. నన్ను తన కంటిపాపలా కాపాడుకున్నారు. ప్రాణం, ధనం, ఆయన సర్వస్వం నా కర్పించారు. నన్ను నమ్మేరు. అటువంటాయనికి నేను ద్రోహంచేసేను.

తెలియకుండా చేసేనా? తెలిసే చేసేను. ఆ రోజు సాయంకాలం. నేను మర్చిపోలేను. పార్కులో నీరెండలో పొన్న చెట్టుకింద నిల్చున్నాడు. బొమ్మలో కృష్ణుళ్ళా వుంటే చూస్తూ వుండి పోయేను. ఎన్నాళ్ళనుంచో తెలిసున్న వాళ్ళా నవ్వుతూ దగ్గిర కొచ్చేసి "నా పేరు సుందరం" అన్నాడు. ఆ క్షణం నుంచీ పోయింది! ఎవరో మంత్రిస్తే పోయినట్టుగా నాకు మతిపోయింది. బావగారికి ద్రోహం. నన్ను నమ్మిన వారికి ద్రోహం చేస్తున్నానని తెలిసీ కూడా, ఆబిడ్లా లాడి బజారు కెళ్ళి ఎక్కడ కనిపిస్తాడా అని వెతుక్కువెళ్ళి చూడకుండా వుండలేక పోయేదాన్ని. అతను కనిపిస్తే చాలు-నాకు పెరట్లో చామంతులు, చంద్రకాంతులు, మల్లెలు, మందారాలు అన్నీ ఒక్కసారి పండువెన్నెల్లో చూచి నట్లుండేది. రంగుల సినిమాల్లోని కొండలు, కెరటాలు, కెంపుల పువ్వులు అన్నీ జ్ఞాపకం వచ్చేవి. నే నెప్పుడో విన్న పాటలన్నీ నా చెవుల్లో కితకితలు పెట్టేవి. బాబుల్లారా! నా మనసంతా బట్టబయలు చేసుకుమాటాడుతున్నాను. నన్ను క్షమించండి. నేను ఇతనికి లోబడి ఆయన యెడల అపచారం చేసేను. ఆయనకి భయపడి ఇతని యెడల అపచారం చేసేను. నే నందరికి ద్రోహం చేసేను. చనిపోయిన పెనిమిటి యెడల ద్రోహం చేసేను. చిన్నదాన్ని. తెలియదతనెవరో! కానీ, ద్రోహం చేసినట్టే లెక్క కదా! నన్ను ప్రాణంలా చూసుకున్న బావగార్ని నమ్మించి ద్రోహం చేసేను. నన్ను నమ్మిన సుందరాన్ని పోలీసులకు పట్టించి అతనికి ద్రోహం చేసేను. నేను చెయ్యరాని పాపాలు చాలా చేసేను. నాకు క్షమలేదు. నిష్కృతిలేదు. పాపాలు చెయ్యనే చెయ్యకూడదు. చేసి క్షమించ మనడం అదేం న్యాయం? అతన్ని సుందరాన్ని ఇప్పుడీ పరిస్థితికి తీసుకొచ్చి క్షమించమని అతన్ని నేనడగ్గలనా? అయ్యా! మీరు, మీరు, మీరు, మీరెవరూ నా పాపాలు క్షమించ కండి: [నా నేరాలు ఎంచకండా పోకండి. నన్ను రాళ్ళువేసి కొట్టి చంపండి. నన్ను కాకులకి గెద్దలకి వెయ్యండి. అంతేకాని నన్ను క్షమించకండి. పెద్దలు, పిన్నలు, ప్రభువులు ఏ ఒక్కరూ కూడా నాయెడల దయ తలచకండి. నన్ను కనికరించకండి. నన్ను క్షమించ కండి. ప్రభువు

ల్లారా! తండ్రుల్లారా! నన్ను క్షమించకండి] (అని ఏడుస్తుంది.)

ప్రాసి : (కొంతసేపు ఆగి) అయిందమ్మా ఏడుపు?

సుశీల : అవదన్నా ఈ యేడుపవదు!

జడ్జి : ప్లీజ్ ప్రొసీడ్!

ప్రాసి : చిత్తం! (అని సుశీలతో) చూడమ్మా. సార్వభౌమరావుగారి మెడల అబద్ధంగా ప్రవర్తించేవు కదూ!

సుశీల : (తలూపింది.)

జడ్జి : (అసహ్యించుకొంటూ) తలూపడం కాదు. జవాబు చెప్పాలి.

ప్రాసి : ఏమమ్మా! అబద్ధంగా ప్రవర్తించేవు! అవునా?

సుశీల : అవును.

ప్రాసి : ఇతను-ఈ ముద్దాయీ నీ ప్రియుడేనా?

సుశీల : అతనికి నే నపకారం చేసేను.

ప్రాసి : నీ ప్రియుడేనా?

సుశీల : అయ్యో! నా కిప్పుడు ప్రియులూ అప్రియులూ ఎవరూ లేరు. దైవం ఎదుట చెప్తున్నా మాట! నేను నిప్పుల్లోంచి నడుచు కొచ్చేను. నా కిప్పుడు రక్తీ విరక్తీ ఏవీ లేవు. అతను నా ప్రియుడా అని అడిగేరు. మీరు వారు అల్లవారు. లోకంలో ప్రజలంతా ఎంత ప్రియులో అంతే ప్రియుడు నాకతను. నే నబద్ధం ఆడ్డం లేదు.

ప్రాసి : ఓహో! ఈ రోజుకి సన్యాసం పుచ్చుకొని సత్యవ్రతం చేయదల్చు కున్నావా?

సుశీల : మరోప్పుడైతే, తండ్రీ నువ్విలా వెక్కిరించి నందుకు రోషంతో పొడుచుకు చచ్చి పోయుందును. వెక్కిరించండి మీ తనివితీరా. నే నేమీ అనుకోను.

ప్రాసి : సర్లే అమ్మా సర్లే! ఇప్పుడతను నీ ప్రియుడు కాదన్నావు. పోనీ అతను ఈ కేసులోంచి అతను బైట పడ్డం నీ కిష్టమేనా?

సుశీల : ఇష్టమే! అబద్ధంలోంచి ఎవరైనా బైటపడ్డం మీకు మాత్రం ఇష్టం ఉండదా బాబూ!

ప్రాసి : అతను బయట పడ్డం కోసం ఏమైనా చేస్తావా?

సుశీల : అన్యాయాన్ని తప్పించడానికి నా ప్రాణం యిచ్చేయమంటే ఈ

క్షణంలో యిచ్చేస్తాను బాబూ !

ప్రాసి : ప్రాణాలివ్వడం కష్టం ! అబద్ధాలాడ్డం సులభం ! అతన్ని రక్షించ డానికని చెప్పి, అతనా రోజున మధ్యాహ్నం పన్నెండు గంటలకి మీ ఇంట్లో ఉన్నట్టు అబద్ధం చెప్పేవంటున్నాను ?

సుశీల : లేదు నాయనా లేదు. అబద్ధం చెప్పటంలేదు. అబద్ధం చెపితే నా తల బద్దలు చేసేయండి.

ప్రాసి : ఆ పని భగవంతుడు చేయాలి (అంటూ కూర్చుంటాడు.)

జడ్జి : ంతేనా ?

ప్రాసి : ఇంకా ఎన్ని అబద్ధాలు చెప్పించ మంటారండి ? చాలు.

బెంచి : (సుశీలతో) మీరు దిగండి.

సుశీల : (దిగుతుంది. సంతకంచేసి వెళ్తుంది.)

సోమ : ఆవిడముందు ఇక్కడున్న వాళ్ళంతా ఒక సారి మోకరిల్లండి బాబూ మోకరిల్లండి. బియ్యేలూ, ఎమ్మేలూ మీ చదువులెందుకు ? మీ నల్ల కోటెందుకు ? మెళ్ళో మేక చెవులెందుకు ? మీ ఖాకీ బట్టలెందుకు బల్లలమీద, బీర్వాల్లోనూ అంతటా ఆ పుస్తకా లెందుకు ? గోడల్ని ఆ పటాలెందుకు ? సత్యమేవ జయతే అని ఆ మొహాలెందుకు ? ఆవిడ ముందొక్కసారి మోకరిల్లండి ! చాలు.

జడ్జి : షటప్ !

సోమ : సత్యాన్ని కిక్కడ షటప్పా గెటవుటూను ! అంతే.

ప్రాసి : యువర్ ఆనర్ మే లెట్ హిమ్ ఎలోన్ ! ఆర్గ్యుమెంట్స్ ఇప్పుడే వినేస్తారా ?

జడ్జి : జడ్జిమెంటు కూడా ఇప్పుడే చెప్పేస్తాను.

ప్రాసి : [తమరు మన్నిస్తే నేం ఇందులో పెద్ద ఇదిగా ఆర్గ్యుమెంటు చెప్ప దలచుకోలేదండి. సాక్ష్యం అంతా తమరి యెదటే వుంది. ఏ సాక్షి ఎటువంటి మనిషో తమరు స్వయంగా చూశారు. ఆ ఆనర్స్ ఇద్దరి కుర్రాళ్ళ ప్రమాణంమీద చెప్పిన సాక్ష్యం నమ్ముతారా? ఈముద్దాయీ మాట నమ్ముతారా ?— సార్వభౌమరావుగారి సాక్ష్యం నమ్ముతారా? పేరే అబద్ధంగా పెట్టుకున్న ఆ వంటపుట్టిమాట నమ్ముతారా? సార్వ భౌమరావుగారి సాక్ష్యం తమరు పరిశీలించి చూస్తే, మాకు వ్యతిరే

కంగా ఏమీలేదు. తమరు న్యాయమూర్తులు. తమరంతా యోచించి చూస్తారనడంలో సందేహం ఎంతమాత్రం లేదు. ముద్దాయి ప్రవర్తన యెటువంటిదో, అతను ఎంతలేసి మాట లంటున్నాడో తమరు చూశారు, విన్నారు. కాని కోర్టులో అతని యొక్క ప్రవర్తన బట్టి అతను చెడ్డవాడని గాని, ఈ నేరం చెయ్యగలిగిన మనిషని కాని నేననడం లేదు. అతని చెడు ప్రవర్తన కతణ్ని క్షమించేపచ్చు. ఈ కేసులో మేం చెప్పిన నేరం అతను చేసేడని రుజువయిందా! అతణ్ణి క్షమించడానికి వీల్లేదు] (అని కూర్చుంటాడు)

జడ్జి : (డిఫెన్సు లాయర్ని) మీరేమైనా చెప్తారా ?

డిఫెన్స్: కొద్దిగా చెప్పవలసి ఉందండి. (అంటూ నిలబడతాడు)

జడ్జి : చెప్పండి.

డిఫెన్స్: తమరు మన్నిస్తే ఒక్క యథార్థ విషయం ముందుగా తమరికి నేను మనవి చేసుకోవలసి ఉంది. నేను చాలాకాలం నుంచి ఏదో చిన్న కోర్టులో ఉండిపోయేను. తమరు ఆదేశించేరు కాబట్టి ఈకేసు డిఫెన్సు భారం నేను వహించవలసి వచ్చింది. ఇందులో నా పని ఎంత కష్టమైన పనో తమరు గుర్తించే వుంటారు. అజ్ఞానంలో ఉన్న ముద్దాయిని ఓపిక పట్టమనడం నాకు చాలా కష్టమయింది. తెలివి తక్కువ కొ్రవాణ్ని తమరు సులభంగా క్షమించ గలరని నాకు తెలుసు.

జడ్జి : కోర్టులో అతని ప్రవర్తన గురించి మీకేం చెప్పనక్కరలేదు.

డిఫెన్స్: మరింక కేసు గురించి! మే నెల ఇరవైమూడో తారీకు ఆదివారం మధ్యాహ్నం పన్నెండు గంటలకి ఈ ముద్దాయి నల్ల చెరువవతల ఉన్నాడా లేక సార్వభౌమరావుగారింట్లో ఉన్నాడా ? అనేదే ఇందులో ప్రశ్న. ఆ సమయంలో అతను సార్వభౌమరావు గారింట్లో ఉన్నాడని రుజువయిన పక్షాన్న సత్యాన్ని మరెవరో ఖూనీ చేసుండాలి. మొదటి ఇద్దరు సాక్షులు అబద్ధం చెప్పుండాలి.

జడ్జి : ఆ స్టూడెంట్ కుర్రాళ్ళ గురించి మీ వాదన చెప్పండి.

డిఫెన్స్: మా వాదన ప్రకారం వారిద్దరూ అబద్ధం పలికుండాలి.

జడ్జి : ఎందుకు అబద్ధం చెప్తున్నారంటారు ?

డిఫెన్స్: వారిద్దరూ ఏ కారణంచేత అబద్దం ఆడుతున్నారూ అంటే నేనేం చెప్పలేను. వారెవరో మాకు తెలియదు. వారు నిజంగా స్టూడెంట్లు అవునో కాదో తెలుసుకొందికి మాకు అవకాశంలేదు. ముద్దాయీ జెయిల్లో వున్నాడు. అతనికెవరూ లేరు. తలిదండ్రులు, చుట్టాలూ, స్నేహితులు-ఎవరూ లేరు. ఉన్నప్పటికీ, ముద్దాయి! డబ్బు శక్తిలేదు. ఈ కేసు గురించి. ఇందులోని సాక్షుల గురించి ఫోకస్ట్రా చేసి ప్రత్యేకంగా దర్యాప్తు చేయడానికి. నిజానిజాలు కనుక్కొందికి స్టేటుకే హక్కుంది. కాని ఏ వ్యక్తికీ ఆ హక్కు ఆ అధికారం లేదుకదా! అందుచేత పోలీసువారిపైన ప్రత్యేకమైన బాధ్యత వుంది. అందుచేత పోలీసువారు ఏ సాక్ష్యాన్ని తొక్కి పారేకుండా, అంత సాక్ష్యాన్నీ యీ కేసులో తమరి ఎదుట వుంచేరా అని చూడవలసి వున్నది.

జడ్జి : స్టూడెంట్స్ యిద్దరూ....

డిఫెన్స్: ఎందు కబద్దం ఆడేరంటారు! నేను చెప్పలేను. లోకంలో ఎవ రెవరే రహస్యమైన కారణాలచేత అబద్దం ఆడుతున్నారో ఇతరుల కెవరికైనాసరే తెలియడానికి అవకాశాలు తక్కువ కదా! తెలియా లంటే ఆ స్టూడెంట్స్ చరిత్రంతా మాకు తెలియాలి. వారి చరిత్ర మాకు తెలియదు. కాని వాటర్ బాటిల్ గురించి వారు నిజం చెప్పడం లేదు. అది ఎవరో కుర్రాళ్ళు ఎత్తుకు పోయారనడం చాలా అసందర్భం. ఇంత పెద్ద పోలీసు సిబ్బంది కళ్ళ ఎదుట చిన్న పిల్లలు దాన్ని ఎత్తుకుపోయారనడం, ఎత్తుకుపోతే వీరా పిల్లల్ని పట్టుకోలేక పోయారనడం చాలా హాస్యాస్పదం. అసలు నా అభి ప్రాయంలో అదంతా అబద్ధం. వాటర్‌బాటిల్ని, తుపాకినీ కూడా ప్రాసిక్యూషన్‌వారు తొక్కిపెట్టేసేరని అనుకొంటున్నాను నేను. వాటర్ బాటిల్‌మీద అసలు నేరస్థుడి పేరుండి వుండవచ్చు. లేదా అదొక స్పెషల్ బ్రాండ్ దవడంచేత దాన్నిబట్టి అసలు నేరస్తు డెవరో తెలిసి పోవడానికి అవకాశం వుంటి వుండవచ్చు. తుపాకి విషయంలో కూడా అంతే. తుపాకీని ముద్దాయీ తినేయలేదుకద! అది చిన్నదీ చితకదీ కాదుకద! అది ముద్దాయీ పట్టుకుపోతే

న్నారు. మరొక పన్నెనిమిది గంటల్లోపున ముద్దాయీ పోలీసువారికి పట్టు బడ్డాడుకదా! ఈలోగా అదెక్కడ దాచివుంచాడో కనుక్కోలేరా? అంతేకాదు యీ ముద్దాయికి తుపాకి ఎలా వచ్చింది. ఇతను తుపాకి ఎప్పుడయినా వుంచుకున్నట్టుగాని, ఎవరిదయినా అడిగినట్టుగాని ఎక్కడా సాక్ష్యం లేదు. తరువాత మరొక ముఖ్యమయిన విషయం. విస్కీ సీసాతో యీ ముద్దాయీ ఆ నత్యాన్ని కొట్టి చంపేసేడని ప్రాసిక్యూషన్‌వారు చెప్తున్నారు. నిజంగా ఈ ముద్దాయీనేకాని ఆ సీసాతో కొట్టినట్లయితే దాని పిడిమీద ముద్దాయీ వేలిముద్రలు వుండి తీరాలి. సీసా పిడి చూడండి. ఇప్పుడు దీన్ని (అని అది పట్టుకొని) ఇలా పట్టుకుంటే వేలిముద్రలు పడతాయి. కంటితో చూస్తే కనిపిస్తాయి. భూతద్దం వేసి చూడక్కర్లేదు.

జడ్జి : (చూడకుండా) అది బాగానే వుంది. కాని ముద్దాయీ వేలిముద్రలు ఎందుకు లేవో ప్రాసిక్యూషన్‌వారు చెప్పేరుకదా!

డిఫెన్స్: చెప్పేరు చెప్పేరు. ఎవరో పిల్లలు తీసి చూసుంటారు. అందుచేత లేవన్నారు. అయితే నాదొక్క మనవి. ఎవరో పిల్లలు తీసి ఈ సీసా పిడిని పట్టుకుంటే, కనీసంవారి వేలిముద్రలైనా వుండాలి కదా! అవీ లేవు దీనిమీద! దీనిమీద ఎవరి వేలిముద్రలూ కూడా లేవన్నారు ఇనస్పెక్టరుగారు, ఎందుచేత లేవు? ఎవరైనా చెరిపేశారనుకోవడానికక్కడా వీలులేదు, ఎందుచేతనంటారా? పిల్లలు దీన్ని పట్టుకున్నాక ఆ వెంటనే పోలీసులే వచ్చేరు. మరయితే ఈ సీసామీద వేలిముద్రలు లేకపోవడానికి కారణం ఏమిటి? తరువాత మరొక్క విషయం. నేనెప్పుడూ తాగుడు వ్యవహారం తెలుసుకున్నవాడినికాను. కాని తాగడానికి సోడా యుండాలి కదా! అవేవీ యిందులో కనిపించవు. సోడా సీసాలేవీ శవం దగ్గిర ఉన్నట్టుగా రికార్డులో లేవు. సోడాలు వాడలేదు అనుకుందాం, నీరు కలుపుకునే విస్కీ తాగేరనుకుందాం. కాని తాగడం దేనితో తాగేరు? గాజు గళాసుల్తో తాగారని మొదటిసాక్షి చెప్పేడు. అవేవి? ఏమయిపోయాయి,

జడ్జి : ఏమయ్యేయని ప్రాసిక్యూషన్‌వార్ని అడిగేరా ?

డిఫెన్స్: అడగ వలసిన అవసరం నాకులేదు. అవి ఉన్నాయని వారి సాక్షే చెప్పినప్పుడు అవి కోర్టు కెందుకు రాలేదో? కేసులో అవి ఎందుకు కనిపించడం లేదో చెప్పవలసిన బాధ్యత ప్రాసిక్యూషన్ వారిది. నాది కాదు.

జడ్జి : వాటర్ బాటిల్‌లాగే అవీ పోయి వుండవచ్చు.

డిఫెన్స్: పోయివుండవచ్చు—అని సందేహం మీద ఆధారపడ్డానికి వీల్లేదు కదా ? వాటిమీద కూడా అసలు నేరస్తుడి గుర్తులుండడంవల్లనే అవి పోలీసువారు దాచేసి వుండవచ్చును.

జడ్జి : సరేనండి !

డిఫెన్స్: ఈ విషయాలు చాలా చిన్నవిగా, కాలిన కమ్మరేకుల్లా కనిపించవచ్చును. కాని. అవి కాలి, గాలి కెగిరొచ్చిన కమ్మరేకులు ఇక్కెక్కడ కాలినాయో అవి రావడంబట్టి తెలుసు కోవచ్చు.

జడ్జి : సరేనండి ! ఇంకేమయినా చెప్తారా ?

డిఫెన్స్: మరింత డిఫెన్స్ సాక్ష్యం ఎలా వుంది? ముద్దాయి చెప్పిన స్టేటుమెంటుకి అనుగుణ్యంగానే వుంది. సార్వభౌమరావుగారి సాక్ష్యం నమ్ముతారా? నమ్మరా ? నమ్మితే తమరు సుశీల సాక్ష్యం కూడా నమ్మాలి ఎన్ని అబద్ధాలు చెప్పినా చివరి కావిడ సార్వభౌమరావు గారు చెప్పిన సంగతులే కదా చెప్పింది. అయితే చూచిన టైంలో కొంత తేడా వుంది. పన్నెండుకని సుశీల చెప్పింది. ఒంటి గంటా పదికని సార్వభౌమరావుగారు చెప్పేరు. ఆయన చెప్పిన టైము సరికాదనడానికి ఆధారం వుందా ? వుంది. మిల్లు కూత ఊదిన టైముకి-అది పదవనీయండి, పన్నెండవనీయండి-ఆ టైముకే హత్య జరిగిందని సాక్ష్యం వచ్చింది. ఆ టైముకే అంటే మిల్లు కూత టైముకే ముద్దాయి తమ ఇంట్లో ఉన్నట్టుగా సుశీల చెప్తూంది. అందుచేత సార్వభౌమరావుగారి గడియారం టైము తప్పు చూపించి వుండాలి.మిల్లుకూత టైముకి ముద్దాయి ఎక్కడున్నాడనేదే ప్రశ్న. ఆ ప్రశ్నకి సుశీల సమాధానం యిచ్చింది. ప్రాసిక్యూషన్‌వారు చక్కని పద్మవ్యూహమే పన్నేరని చెప్తున్నానేనను, లైట్లన్నీ

ఆర్పేసి అంతా చీకటి చేసిపారేసి అసలువాణ్ని పెరట్లోంచి పంపిం చేసి దిక్కులేని వాణ్నొకణ్ని తీసుకొచ్చి యిదుగో వీడే నేరస్థు డన్నారు. కాని సుశీలనే అమ్మాయున్నదని ప్రాసిక్యూషన్ వారు మర్చి పోయేరు. మీరు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి ఆవిడ చెప్పిన సాక్ష్యం అక్షరాలా నిజం అనేది అందులో ప్రతి అక్షరం ఘోషించి చెప్తోంది. తారీఖు, వారం, టైము-అవన్నీ కూడా ఆవిడ కెంత సహజంగా జ్ఞాపకం వచ్చాయో తమరు నోటీసు చేసేవుంటారు. కోర్టువారు నన్ను మన్నించాలి. నేను యింతకు మించి చెప్పవలసిన దేమీ లేదు. ఈ విషయాలను గురించి మరొక్క సంగతి. ఒకవేళ తమరు స్టూడెంటు కుర్రవాళ్ళ సాక్ష్యం నమ్మితే నమ్మి వుండవచ్చు. నమ్మినా, ముద్దాయి చేసేడన్న నేరం ఖూనీ కింద రాదని మనవి చేస్తున్నాను. సడన్ ఘర్షణలో జరిగిన సంగతది. రెండోది: సత్యం అనే కుర్రాడూ రెండోవాడూ కూడా తాగి వున్నారు. రెండో వాడికి సత్యాన్ని చంపాలనే వుంటే పక్కన తుపాకీ వుంది కద! తుపాకీ ఉపయోగించక సీసా ఎందుకు ఉపయోగించాలి? దాన్ని బట్టి అతనికి ఆ ఉద్దేశం లేదని తెలుస్తుంది. కొడదామనే ఉద్దేశం కనిపిస్తోంది కాని చంపాలనే ఉద్దేశం కనిపించడంలేదు, తాగివున్నాడు కాబట్టి కొట్టిన వాని కితను కొట్టే దెబ్బల వలన సత్యం చనిపోవచ్చునని, తెలియడానికి కూడా అతనికి అవకాశం లేదు. కాబట్టి యిది ఖూనీ నేరం కాజాలదు. మరేదయినా అవొచ్చునేమోకాని.

జడ్జి : ఇంకేమైనా చెప్తారా?

డిఫెన్స్: ఇంకే ముందండి! వెనకట కో ప్లీడరుగార్ని ఆర్గ్యుమెంటు చెప్పమంటే, "అయ్యా ఆర్గ్యుమెంటే ముందండి?? పార్టీ పేదవాడు, ప్లీడరు పిల్లలవాడు! కోర్టువారు కటాక్షించాలి" అన్నాట్ట. అలాగ్గ నే నింకేం చెప్పినా కూడా అపహాసెంచటానికి అవకాశం వుంటొచ్చు. నేను ఆఖరిసారిగా ముఖ్యంగా తమకి తెలియజేసే దేమంటే, ఇందులో ప్రాసిక్యూషన్ వారు తెచ్చిన వస్తువుల్లో నేరస్థుడి గుర్తులు

ఉండవలసినవీ, ఉన్నవీ ఏవీ లేవు. ఎవడు నేరస్తుడైతే వాడి గుర్తులు సీసామీద వుండాలి. అవీ లేవు. గుర్తులు గాజు గళాసుల మీద కూడా వుండాలి. అసలా గళాసులే కనిపించ కుండా చేసేరు. వాటర్ బాటిలు పోనే పోయిందన్నారు. డిస్ట్రిక్ట్ ప్రాసిక్యూషన్ వారు చెప్పిన కథ గురించి అది నిజమేనా అని చాలా అనుమాన పడవలసి వస్తోంది. డిఫెన్స్ సాక్ష్యం గురించి అటువంటి అను మానానికి అవకాశం లేదు. మా డిఫెన్సే కాని నిజమైతే, అందు లోనూ ముఖ్యంగా సుశీల సాక్ష్యమే నిజమైతే - అది నిజమనే నా నమ్మకం. నిజమనే నా వాదన! నిజం కాబట్టే ఆవిడ కళ్ళంట అన్ని రక్తపు చుక్కలు!-ఆవిడ చెప్పిన భోగట్టాలే నిజమైతే ప్రాసి క్యూషన్ సాక్షులు - ఒకటీ రెండూ నాలుగూ సాక్షులు - మధూ, క్రిష్టా, కిష్టప్పా, ముగ్గురూ కూడా కూడబలుక్కుని, అబద్ధం చెప్పే రన్న మాటేకదా! అలాగైతే-ఎమ్మేలూ ఆనర్సులూ చదివే యువ కులు. న్యాయాన్నీ, నిజాన్నీ కాపాడవలసిన ఆఫీసర్లు, పాపపుణ్యాల మంచి చెడ్డల, తేడాలూ, తారతమ్యాలూ తెలిసిన వాళ్ళు-భావి పౌరులే కాదు-నేటి పౌరులు, బాధ్యత తెలియ వలసిన విద్యార్థులు, నవ యువకులు, అధికార్లు, అన్యాయాన్నీ అధర్మాన్నీ అణచి పారేయ వలసిన వారు, న్యాయంకోసం ధర్మంకోసం ప్రాణాల్నయినా బలి చేయడానికి సిద్ధపడవలసిన వారు, నిజానికి సర్వదా నిలబడ వలసిన వారు, ఈ విధంగా బోనెక్కి భగవంతుడి యెదుట ప్రమాణంచేసి అబద్ధాలు ఇటువంటివీ అటువంటివీ కావు: సరదాకి గాలి కబుర్లు కావు, కుచ్చి టప్పాలు కావు; ప్రేమ సంభాషణలు కావు - పీకలు తెగిపోయే అబద్ధాలు పలికేస్తే ఇక సంఘం ఎక్కడ ? దేశం ఎక్కడ ? అమాయకపు ప్రజలు అనేకానేక కోట్ల వారెక్కడ ?.... క్షమించాలి. నేనింతకంటే చెప్పవలసిం దేమీ లేదు. (అని కూర్చుం టాడు.)

జడ్జి : (ఊడిగిలబడి కూర్చున్నాయన, సరిగా కూర్చొని) అయిందా ?

ప్రాసి : అయిందండి.

జడ్జి : అయితే, కాల్ ది షార్టుహాండ్ రైటర్ !

ప్రాసి : ఇప్పుడే చెప్పేస్తారా జడ్జిమెంటు ?

జడ్జి : మూణ్ణిమిషాలు.

బెంచ్రోతు: [వెళ్ళి షార్టుహాండ్ రైటర్ని తీసుకువస్తాడు]

షార్టు : [జడ్జిగారికి చేరువగా పెన్సిలూ నోటు పుస్తకం పట్టుకొని అతను చెప్పినది రాస్తుంటాడు]

జడ్జి : టేక్ డౌన్ !

షార్టు : ఎస్సర్ !

జడ్జి : మే నెల ఇరవై మూడో తారీకు ఆదివారం మధ్యాహ్నం పన్నెండు గంటలికి నల్లచెరువు అవతల అడవిలో సత్యనారాయణ ఉరఫ్ సత్యం అనే ఆసామిని విస్కీ సీసాతో నెత్తిపై కొట్టి చంపి ఇండియన్ పీనల్‌కోడు సెక్షన్ 302 లో చెప్పిన ఖూనీ నేరం ముద్దాయీ చేసినట్టుగా అయిదోటౌను పోలీసువారు రిపోర్టు చేసేరు. దిగువ కోర్టులో ఎంక్వయిరీ అయ్యేక ఆ సెక్షన్ క్రింద ముద్దాయీ ఛార్జీ ఫ్రేం చెయ్యడం జరిగింది. తను నేరం చెయ్యలేదనీ, ఆ సమయానికి తను వేరేచోట వున్నాననీ, ఛార్జీ చదివి వినిపించి బోధ పర్చగా, ముద్దాయీ జవాబు చెప్పేడు. మధు, క్రిష్ణ అనే ఇద్దరు ఆనర్స్ స్టూడెంట్స్ పాసిక్యూషన్ తరఫున చెప్పే దేమంటే ఆ రోజు పొద్దుటే కార్లో తామూ, ఈ ముద్దాయీ, సత్యం అనే లా స్టూడెంటూ పిక్‌నిక్ కని వెళ్ళేరు. గువ్వల వేటకి ముదాయీ తుపాకీ కూడా తెచ్చేడు. నల్లచెరువు అవతల అడవిలోకి వెళ్ళేరు. అక్కడ మధ్యాహ్నం అప్పుడు సత్యమూ ఈ ముద్దాయీ విస్కీ తాగి ఒక ఆడపిల్ల గురించి మాటా మాటా అనుకున్నారు. అనుకోడంలో ముద్దాయీ అతణ్ణి చంపుతా నన్నాడు, నీతో నాకు మాట లేమిటని సత్యం ఎడంగా పోయాడు. ముద్దాయీ కాసేపట్లో అతనికి వెనగ్గా వెళ్ళి చేతిలోవున్న విస్కీ సీసాతో నాలుగుసార్లు అతని తలమీద కొట్టి, పగిలిన సీసా పారేసి, పక్కనున్న తుపాకి తీసుకొని పారి పోయాడు. వాటర్ బాటిల్లో వున్న నీళ్ళు, పడిపోయిన సత్యం మొఖంమీద క్రిష్ణ పోశాడు. కాని, సత్యం వెంటనే చనిపోయాడు. క్రిష్ణా, మధూ కార్లో వచ్చి పోలీస్టేషన్‌కి వచ్చి రిపోర్టు చేశారు....

సబ్ ఇనస్పెక్టరు కిష్టప్ప చెప్పే దేమిటంటే, రిపోర్టు రిజిష్టరుచేసి, శవపంచాయితీ జరిపించి, పగిలిన సీసా, పగిలిన గాజు పెంకులు. రక్తపు మట్టి స్వాధీన పర్చుకొని, మర్నాడు ముద్దాయిని అరెస్టుచేసి కేసులో దర్యాప్తు ముగించి, ఛార్జిషీటు దాఖలు చేశాడు. రిపోర్టూ మధ్యవర్తి రిపోర్టూ, మిగతా వస్తువులూ సాక్ష్యంలో మార్కు, అయేయి. డాక్టరు శవ పంచాయతీ చేశాడు. అతని సాక్ష్యం ప్రకారం: గాయపడగా కలిగిన షాక్‌వల్ల సత్యం చనిపోయేడు. విస్కీ సీసాతో ఆ గాయాలు తగిలి వుండవచ్చు. శవంమీది బట్టలు పోలీసు వారికి పంపించేశాడు. అదీ అతని సాక్ష్యం. ఆ బట్టలు కూడా సాక్ష్యంలో మార్కె అయేయి. రక్త పరీక్ష చేయగా ఆ బట్టలమీద రక్తమూ, రక్తపు మట్టిలోని రక్తమూ, పగిలిన గాజు పెంకులమీద రక్తమూ ఒకే గ్రూపుకి చెందిన మనిషి రక్తం అని తేలింది. రక్తపరీక్ష రిపోర్టు కూడా సాక్ష్యంలో మార్కు అయింది.

ఈ సాక్ష్యం నిజమైతే ముద్దాయీమీద కేసు రుజువైనట్టే లెక్క. స్టూడెంట్ కుర్రవాళ్లు ఎందుకు అబద్ధం చెప్పాలో తనకి తెలియడం లేదన్నారు డిఫెన్స్ లాయరు. వాళ్ళెందుకు అబద్ధం చెప్పాలో కోర్టుకి కూడా తెలియడంలేదు. వాళ్ళకీ ఈ ముద్దాయికీ కావేషీ ఉన్నట్టుగా ఆరోపణా లేదు, రుజువూ లేదు. సత్యాన్ని కొట్టి చంపిన సీసామీద వేలిముద్రలు లేవన్నారు. లేవు నిజమే. ఎందుకు లేవో సాక్ష్యం చూస్తే తెలుస్తుంది. పిల్లలెవరో టాంపర్ చేసినందువల్ల లేవు. కనీసం ఆ పిల్లల వేలిగుర్తులయినా లేవుకదా అన్నారు డిఫెన్స్ లాయరు. పదిమంది పిల్లలు ముట్టుకోడంలో అవి కలిసిపోయి చెదిరిపోయుండొచ్చు. వాటర్ బాటిలూ, గాజుగళాసులూ కూడా సరదాగా ఆ పిల్లలే పట్టుకుపోయుండొచ్చు. మరో విషయం పన్నెండుకి నేరం జరిగింది. ఒంటిగంట దాటిన తరువాత పోలీసు వారు ఆ స్థలానికి వెళ్ళేరు. ఈ లోపున పిల్లలేనన్న మాటేమిటి? హడావిడిగా తుపాకి పట్టుకు పారిపోయిన ముద్దాయీనే అయిదు నిమిషాల తరవాత వెనక్కి వచ్చి పగిలిన సీసా తుడిచేసి వాటర్ బాటిలూ, గళాసులూ పట్టుకు పారిపోయుండొచ్చు. తుపాకి దాచేసి

నట్టుగానే మిగతా వస్తువులు కూడా దాచేసి వుండవచ్చు. కత్తితో మనిషిని పొడిచేసినప్పుడు కత్తి కనిపించకపోతే పొడవటం అబద్ధమై పోతుందంటున్నారు డిఫెన్స్‌లాయరు. ఆ వాదన చాలా అసందర్భం. ప్రాసిక్యూషన్ సాక్షులు చెప్పిన దాంట్లో చెప్పుకోదగ్గ తేడాలున్నాయా? భూతద్దం వేసి వెతికినా తేడాలు కనిపించవు. ఒక చిన్న తేడా వుందంటున్నారు. అదేమిటంటే కుర్రాళ్ళిద్దరూ కిష్టప్పతో కలిసి నేర స్థలానికి తిరిగి వెళ్ళినప్పుడు, అక్కడికి వెళ్ళే సరికి జనం లేరని మధూ అన్నాడు. జనం లేరనే క్రిష్ట కూడా చెప్పేడు. వీళ్ళని చూసి వాళ్ళు పారిపోయేరు. అందుచేత అక్కడికి దగ్గరగా వెళ్ళేసరికి జనం లేరు. కరెక్టే! ఇద్దరి సాక్ష్యానికి తేడా ఎంతమాత్రం లేదు. ఉన్నా నేరం భోగట్టాకి సంబంధించిన తేడా కాదది. ఈ తేడా గురించీ, ఆ వాటర్ బాటిలూ గళాసులూ వాటి గురించీ పెద్ద పెద్ద ఆటం బాంబులంత హడావిడి చేసేరు డిఫెన్స్ లాయరు. ఆ గొడవకి అసలకీ అధారం లేదు. అదంతా చాలా అనవసరం.

మరింక డిఫెన్సు: ముద్దాయీ తన పక్షాన్ని యిద్దర్ని విచారణ చేసేడు. ఒకరు పార్లమెంటు మెంబరు. రెండోమనిషి ఆ మెంబరుగారి వంటమనిషేను. ఆ వంటమనిషికి ఈ ముద్దాయీ ప్రియుడనే విషయం డిఫెన్స్ సాక్షులు దాదాపు వప్పుకొంటున్నారు. పార్లమెంటు మెంబరు రేమిటంటారంటే, ఈ ముద్దాయిని మే నెలాఖరి రోజుల్లో ఒక శనివారంనాడో ఆదివారంనాడో కాని మధ్యాహ్నం తన ఇంట్లో చూసినట్లుగా చెప్పేరు. దొంగ అని అనుమానించేరట. వంటమనిషి కోసం వచ్చేడంటే ఆవిణ్ణి అడిగేరట. ఆవిడ ఈ ముద్దాయీ ఎవరో తనకి తెలియదనీ, దొంగేమోననీ, మొదట దబాయించి, పోలీసులకి, ఆ విధంగా రిపోర్టు రాసి, ఆ తరువాత ముద్దాయీ దొంగ కాడనీ, తన కోసమే వచ్చేడని వప్పుకొందిట. ఈలోగా పోలీసు స్టేషన్కి ఫోన్ చేస్తే ఒక పోలీసుమనిషి వచ్చేడు. కాని అబద్ధం రిపోర్టు యివ్వడం ఇష్టంలేక పార్లమెంటు మెంబరు ఆ పోలీసువాణ్ని పంపించేసేరట. పోలీసు వాడికంటే ఓ క్షణం

ముందు ముద్దాయి వెళ్ళిపోయేట్ట. వంటమనిషి కూడా దాదాపు అదే సాక్ష్యం చెప్పింది. అయితే ఆవిడ తారీకూ, వారమూ కూడా స్పష్టంగా చెప్పింది. వచ్చిన పోలీసు మనిషి కిష్టప్పేనని అతనే ముద్దాయిని తీసుకుపోయాడనీ ఆవిడ అంటుంది. కిష్టప్ప అవునో కాదో చెప్పలేననీ, అతనికంటె కాస్త ముందుగానే ముద్దాయీ వెళ్ళి పోయేడనీ పార్లమెంటు మెంబ రంటున్నారు.

డిఫెన్స్ సాక్ష్యం నమ్మితే ప్రాసిక్యూషన్ సాక్ష్యం నమ్మ డానికి వీల్లేదని డిఫెన్స్ లాయరు అంటున్నారు. రెండు స్థలాల్లో ఒకే మనిషి ఒకే సమయంలో వుండటానికి వీల్లేందంటున్నారు ఆయన. అవును, ఒకే సమయంలో ఒకే మనిషి రెండు స్థలాల్లో వుండటానికి అవకాశం లేదు. అది తెలుసుకోవాలంటే ఐన్‌స్టీన్ కున్నంత తెలివితేటలుండక్కర్లేదు. ఆ భోగట్టా అందరికీ తెలుసు. ఏ మనిషికూడా ఒకే సమయంలో రెండుచోట్ల వుండలేడు. ఈ ముద్దాయీ కూడా అందర్లాంటి మనిషే. 'ఉప్మాకలోనూ,రామ తీరాల్లోనూ ఒక్కపాలే' అవుపించగలిగిన యోగ సిద్ధులు ఈ ముద్దాయీకి వున్నాయని ఎక్కడా రుజువులేదు. అందుచేత యితను నేరం జరిగిన సమయానికి సార్వభౌమరావుగారింట్లో వుంటే నేర స్థలంలో లేడన్నమాటే! అది నే నొప్పుకుంటాను.

అయితే, అతను సార్వభౌమరావుగారింట్లో ఆ సమయానికి. నిజంగా వున్నాడా? లేడు. ఆ తరవాత వున్నాడు. మధ్యాహ్నం ఒంటిగంటా పదినిమిషాలకి ఈ ముద్దాయీ తనింటికి రావడం చూసే నని పార్లమెంటు మెంబరు చెప్తున్నారు. టైము తనకి కచ్చితంగా ఎందుకు జ్ఞాపకం ఉందో కూడా ఆయన నమ్మకంగా, నమ్మడానికి వీలుగా చెప్పేరు. ఏ తారీకునో ఆయన చెప్పలేకపోయేరు. సుశీల చెప్పిన ప్రకారం ఆ రోజు వే ఇరవై మూడే అనుకున్నప్పటికీ, ఈ ముద్దాయీ నేరం జరిగిన గంట పదినిమిషాలకి సార్వభౌమరావు గారింటికి వెళ్ళాడు. ఈ మధ్య కాలంలో ఎక్కడున్నాడు? అడవి లోంచి వూళ్ళోకి అడ్డు దారుందని సాక్ష్యంలో తెలుస్తూంది. పన్నెం

డుకి వంటిగంట పది నిమిషాలకి మధ్య ఈ ముద్దాయీ ఆ అడ్డు దారంట పరుగెడుతూ వుండుంటాడు.

అయితే యితను సార్వభౌమరావింటికి ఎందు కొచ్చేడు? ప్రియురాల్ని కలుసుకొని సహా అడగడాని కొచ్చేడు అని నా నమ్మకం. ఆవిడై కల్పించుకొందికి యిద్దరూ కలిసి చిన్న ప్లాటు కూడా వేసినట్టుగా నాకు అనుమానంగా వుంది. ఏదేమైనా ఈ వంట మనిషి సాక్ష్యం నమ్మడానికి ఎంతమాత్రం అవకాశంలేదు. ముద్దాయీని రక్షించడానికి ఆవిడ ప్రాణాలైనా యిచ్చేస్తానంది. ప్రాణాలివ్వడం కష్టం. అబద్దాలాడ్డం సులభం-అన్నారు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు

ప్రాసి : చితం చితం. (అంటూ చాలా సంతోషిస్తాడు)

జడ్జి : గడియారం ముళ్ళు వెనక్కి తిప్పడం కూడా చాలా సులభమే.

ప్రాసి : చితం. చితం.

జడ్జి : ఆ పని చేసింది సుశీల. సార్వభౌమరావే కాని. టైము సరిగ్గా గుర్తుంచుకోకపోతే, ఈ కేసులో చాలాముప్పు సంభవించి వుండేది. సుశీల సాక్ష్యం ఎంతమాత్రం నమ్మడానికి వీల్లేదు. ఆవిడ కారక్టర్ గురించి ఎంత తక్కువ చెప్తే అంత మంచిది. ఆవిడ అబద్ధాలాడినట్టుగా, తెలిసీ అబద్దాలాడినట్టుగా ఆమెచేత ఒప్పించారు ప్రాసిక్యూటర్ గారు.

ప్రాసి : (చాలా సంతోషంగా వుంటాడు)

జడ్జి : "అబద్ధాలాడింది కాని, అబద్ధాలాడినట్టుగా మా సాక్షి ఒప్పేసుకుంది కదా? ఆహా! మా సాక్షి ఎంత మంచిది!" అంటున్నారు డిఫెన్స్ లాయరు. సరదాపడి ఒప్పుకుందా ఆవిడ? ఆవిడ ఒప్పుకోలేదు. ఆవిడచేత ఒప్పించారు ప్రాసిక్యూటర్‌గారు. ఇరకాటంలో పెడితే ఒప్పుకుంది, ఈ అబద్ధాల ఆడమనిషి. ఈ ముద్దాయిని ప్రేమిస్తోంది. ఏం చూసో తెలీదు? అయినా? అదావిడ సొంత గొడవ. దాన్తో మన కేం సంబంధం లేదు. ఆవి డతన్ని ప్రేమించిన కారణంచేతా, అబద్ధాలాడడానికి అలవాటుపడ్డ మనిషవడంచేత ఆవిడ చెప్పేమాట

నమ్మడానికి వీల్లేదు: నమ్మకూడదు. అస లీపిడ ప్రమాణం చెయ్యమంటే ఒకంతట చేసిందికాదు: చేసినా అబద్ధాలు చెప్పింది.

అయితే కిష్టప్ప ఈ ముద్దాయిని సార్వభౌమరావింట్లో అరెస్టు చేసి తీసుకువెళ్లేడా? వెళ్లంటాడు. సుశీల యితని గురించి ఏవేవో డిటేల్స్ చెప్పింది. సార్వభౌమరావుకి ఈ మనిషిని పర్టిక్యులర్‌గా జ్ఞాపకం వుండి వుండక పోవొచ్చును. ముద్దాయిని విడిచిపెట్టేసేరనే పార్లమెంటు మెంబరు అనుకొంటారు. కాని విడిచిపెడతారా? పాతవాడొకడు చిక్కేడు. ఎందుకైన మంచిది స్టేషన్లో ఉంచమని బెత్తాయించి వుంటాడు. అప్పటికి ఈ నేరం గురించి తెలియడానికి అవకాశం లేదు కిష్టప్పకి. తరువాత కొద్ది నిముషాల్లోనే తెలిసింది. మధూ, క్రిష్ణాల ద్వారా ముద్దాయిని కిష్టప్పే సార్వభౌమరావింట్లోంచి తీసుకు వెళ్ళినట్టుగా నేను నమ్ముతున్నాను. కాని స్టుపిడ్‌గా డినై చేసేడు. తీసుకువెళ్లేనని వప్పుకున్నా అతని కేసుకి థకరా వుండదు.

పై కారణాలచేత స్టూడెంటు కుర్రవాళ్ళ సాక్ష్యం నమ్ముతూ ఈ ముద్దాయీ సత్యాన్ని చంపేడని నమ్ముతున్నాను.

అయితే - ఈ ముద్దాయి ఖూనీనే చేసేడా ? లేక మరో తక్కువనేరం చేసేడా ? సుశీల గురించి యితనూ సత్యమూ దెబ్బలాడు కున్నారు. అంటే మాటా మాటా అనుకున్నారు. చంపుతానని యిత నన్నాడు. సత్యాన్ని చంపుతానన్న వెంటనే అతణ్ణి కొట్టేడా ? లేదు. అతణ్ణి వెళ్ళనిచ్చేడు. కొంచెం సేపు చూసేడు. వీలుకోసం ఆ కొంచం సేపూ చూసుంటాడు. కొట్టటమైనా ముఖాముఖీ పోట్లాటలో కొట్టలేదు. వెనకనించి దొంగదెబ్బ తీసేడు. "చంపాలంటే తుపాకితోటే చంపి వుండునుగదా" అన్నాడు డిఫెన్సు లాయరు. చెట్లమధ్య తుపాకి ప్రయోజనం వుండక పోవచ్చును. అయినా - కిందనున్న తుపాకికంటె చేతిలో వున్న బాటిల్ మెరుగు అనుకొంటాడు. తుపాకితీసి గురిచేసే లోపున దొంగదెబ్బ తియ్యడానికి వీలు వుండక పోవచ్చును. తుపాకి తీస్తే మాటా మాటా వారిద్దరూ అనుకొన్న మీదట-పక్కనున్న క్రిష్ణా, మధులు "ఏమిరా తుపాకి ఎందుకు తీసేవు ?" అని అడ్డురావొచ్చు. అందుచేత విస్కీ

సీసా ప్రయోగం జరిగింది. తాగివున్నాడు కదా అని కూడా వాద నొచ్చింది. అవును. తాగే వున్నాడు. ఎవరైనా యితన్ని మోసంచేసి తాగించేరా ? లేదు. తాగమని బతిమాలేరా ? లేదు ! తాక్కపోతే తంతా నన్నారా ? లేదు, కోరి తాగేడు. కోరి ఖూనీ చేసేడు. "అప్పుడు తాగి చంపేను. క్షమించండి. ఈసారి మరో ఛాన్సిప్పిస్తే తాక్కుండా చంపుతాను" అన్నట్టుంది ముద్దాయి వ్యవహారం. అయితే మరొకటుంది. తను కొట్టే దెబ్బలవల్ల సత్యం చనిపో వచ్చుననే జ్ఞానం లేనంతగా తాగి వున్నాడా ? అదికూడా చూడాలి. కాని, సాక్ష్యం చూస్తే ఆ సమయంలో ఆ జ్ఞానం లేనివాళ్లా లేడు ముద్దాయి. చంపుతానన్న తరవాత, వెంటనే చంపేడా ? లేదు. వీలు కోసం చూసుకున్నాడు. తాగుడు మైకంలో పూర్తిగా వుంటే-చంపుతా నన్న వెంటనే చంపేసును. కాని అలా చేయలేదితను. అవకాశం చిక్కేక చంపేడు. తాగుడు మైకంలో వుంటే - చంపేసేక, ఏం చేసేడో తెలియక అక్కడే వుండి పోయుండును. కాని అలా చెయ్యలేదితను. అక్కణ్నించి ఉడాయించేసేడు. ఎలా ఉన్నవాడు అలా వెళ్ళిపోయేడా ? లేదు. ఆనవాళ్లేకుండా తన తుపాకీ తీసుకొని వెళ్ళిపోయేడు. అందుచేత యితను ఆ సమయంలో యేం చేసు న్నదీ తెలియనంత మైకములో వున్నాడనటానికి అవకాశం లేదు. అందు వలన తేలేదేమిటి ? చంపుతానని అన్నాడు. ఆ ప్రకారం చంపేడు. మనం చేసిన పనులవల్ల ఏ ఫలితం అయితే కలుగు తుందో ఆ ఫలితం కలగడమే మన ఉద్దేశ్యం అనుకోవాలి. అది రూలు. ఈ ముద్దాయి చేసిన పనివల్ల ఒక మనిషి ప్రాణం పోయింది. ఆ మనిషి ప్రాణం పోవాలనే ఆ పని యితను చేసే డని భావించవలసి వుంది. ఈ కేసులో ఈ ముద్దాయి ఉద్దేశ్యం ఏమిటో ఆ విధంగా మనం ఊహించ నక్కర్లేదు కూడాను. ఎందు చేతనంటే తన ఉద్దేశాన్ని యితను ప్రకటించాడు కూడాను. చంపుతానని ప్రకటించి చావుదెబ్బలు కొట్టి మనిషి ప్రాణం తీసే డితను.

(తెర ఒకసారి పడి లేస్తుంది. జడ్జిగారు జడ్జిమెంటు చదువు తూంటారు. జనం హడావిడిగా కోర్టు హాల్లోకి చేరుతారు)

కాబట్టి ఈ ముద్దాయిపై ప్రాసిక్యూషన్‌వారి ఛార్జి పూర్తిగా రుజువయిందని భావిస్తూ ఇండియన్ పీనల్ కోడ్ 302 సెక్షన్‌లో చెప్పిన ఖూనీ నేరం యితను చేసేడనే నిశ్చయిస్తూ, ఆ నేరం గురించి యితణ్ని కన్‌విక్ట్ చేస్తున్నాను.

ఇక శిక్ష : ఇతనికి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించడానికి తగినంత కారణం కనిపించడంలేదు. సజ్జనుడు, సత్యశీలి, సాధు వర్తనుడూ కాడు. పాలుతాగే పిల్లాడూ కాడితడు. కాడు కాదని ఈ రికార్డంతా చెప్తుంది. "ప్రాణం అంటే కేరేజాట్ గాణ్ని నేను" అని స్టేటుమెంటులో తనకి తానే చెప్పుకున్నాడు. ప్రాణం అంటే ఇతను "కేర్స్ ఎ జాట్" కాబట్టే ప్రాణం తీసే డితను. కాబట్టి అన్ని విధాలా ఆలోచించి ఇతను చేసిన ఘోరమైన నర హత్యా నేరానికి ఇతనికి మరణశిక్ష విధిస్తున్నాను.

బెంచి : (సోమసుందరంతో) సత్యాన్ని హత్య చేసిన ఖూనీ నేరానికి నీకు కోర్టువారు ఉరిశిక్ష విధించారు.

(అని చెప్పిన వెంటనే దిగ్గున లేచి ఛాంబర్స్‌లోకి వెళ్ళిపోతాడు జడ్జిగారు. హాల్లోని జనం అంతా లేస్తారు. చాలా హడావిడిగా వుంటుంది. సోమసుందరాన్ని రిజర్వ్ పోలీసులు వరండాలోకి తీసుకు వస్తారు. అతనిచుట్టూ జనం మూగుతారు. వాళ్ళని పోలీసులు పొమ్మంటారు. కాసేపట్లో అతనూ పోలీసులే మిగుల్తారు. కోర్టు హాల్లో వంటరిగా కూర్చున్న డిఫెన్స్ లాయరు నెమ్మదిగా బైటికివచ్చి సోమసుందరం దగ్గరికి వస్తాడు)

డిఫెన్స్: ఇంత ఘోరం చేస్తాడనుకో లేదయ్యా, నాకేమిటో కడుపులో దేవేసినట్టుగా వుంది.

సోమ : భయం పడకయ్యా ప్లీడరు బాబూ ? మనుషు లలావుంటే, న్యాయం అలా వుంటే నువ్వూ నేనూ ఏం చేస్తాం ? నువ్వయినా నిలబడ్డం గట్టిగానే నిలబడ్డావు. సుశీల కూడా కరెక్టుగా చెప్పింది. మరింక నాకు విచారం ఏం లేదు. నే చస్తే యేడిచే వాళ్ళెవరూ లేరు, 'నా'

అన్నవాపొక్క-శ్శేడు నాకు. నన్నురితీస్తే నష్టం నాకూ లేదు. లోకా నికీ లేదు.

డిఫెన్స్: అలా అనకు! నష్టం ఎందుకు లేదూ! అన్యాయం నిలబడిపోతే అదెంత చిన్నదయినా ఏదో విధంగా అది లోకానికి దెబ్బతీస్తుంది. అన్యాయం నిలబడకూడదు! అదే నిలబడిన్నాడు, అన్యాయమే నిలబడి పోయిననాడు మరింక మే మెందుకు, ఈ కోర్టు లెందుకు, ఆ జడ్జీ లెందుకు, ఈ పోలీసు లెందుకు, పరిపాలనా, ప్రభుత్వం అంటూ అవెందుకు? అన్యాయమే నిలబడిననాడు అసలు భగ వంతుడే ఎందుకు?

సోమ : నువ్వు చెప్పినవన్నీ ఇప్పుడు లోకంలో వున్నాయి కదా?

డిఫెన్స్: లేవామరి!

సోమ : భగవంతుడు కూడా వున్నాడా?

డిఫెన్స్: ఎందుకు లేడూ?

సోమ : ఉండి కూడా చూస్తూ ఊరుకున్నాడా లేదా?

డిఫెన్స్: అలా మాటాడకురా అబ్బాయ్! అన్యాయం జరుగుతూంటే చూస్తూ వూరుకుంటాడా భగవంతుడు? ఊరుకో డూరుకోడు! మనం అపీలు చేదాం? చేసినా చెయ్యకపోయినా ఈ తీర్పు, ఈ శిక్ష హైకోర్టు వారు ఖాయప చందే యింకా ఏమీ జరగదు. అక్కడ హైకోర్ట్లో నీకు దేముడు సాయం చేసి తీరుతాడు. కనీసం శిక్షయినా తగ్గుతుంది. మరేం భయపడకు. మనకి దేముడు సాయం చెయ్యకపోడు!

సోమ : (కొంచెంగా నవ్వి) బాబూజీ! నువ్వు వెర్రివాడివి! నా కంటే చదువుకున్నావు. ప్రపంచం కొంత చూసేవు కూడాను. అయినా, ఇంకా పురటి తోవలోనే వున్నావు. భగవంతుడుంటే వుండవచ్చు. లేకపోతే లేపోవచ్చు. అతనితో ఇప్పుడు నాకేం సంబంధమూ లేదు. నాకేకాదు. అతనితో చాలామందికి సంబంధంలేదు. లోకంలో గోవులున్నాయి. వెర్రి గొర్రెలున్నాయి. పేద వాళ్ళున్నారు. కూలి వాళ్ళున్నారు. వాటికి వేటికీ, వాళ్ళెవరికీ కూడా అతనితో సంబం ధము లేదు. సంబంధం లేని జనం కోటానుకోట్లున్నారు. వాళ్ళ

కన్యాయం జరిగితే భగవంతు డెంత బలవంతుడైనా ఒచ్చి వాళ్ళకి అడ్డుపడడు. నా మట్టికి నేను అలాంటి అమాయకప్రజనా ్ని ఎంతో మందిని హింస పెట్టేను. ఎంతో మందిని. కొన్ని వందల మంది అమాయకులు నా చేతుల్లో బాధపడి ఏడ్చుకుపోయేరు. భగవంతుడు ఒక్కసారయినా వాళ్ళ కడ్డుపడ్డాడా ? పడితే ఒట్టు! మన ఈశ్వరుడి ఆలయం వుంది ఎరుగుదువా ? ఆలయంలోనే అక్కడ పువ్వుల తోటుంది చూసేవా ? అక్కడికి కోరోజున మా అమ్మతో వెళ్ళేను. పదిహేనేళ్ళ కిందటి సంగతి. అప్పుడు నాకు పదేళ్ళు. మా అమ్మ గుళ్ళో కెళ్ళింది. నేను పువ్వుల తోటలోకి వెళ్ళాను. అక్కడెలా వుందో తెల్సా ? పచ్చగా ఎండ, చల్లగా గాలి, బంగారంలా పువ్వులు ! చల్ల చల్లటి గాలికి, వెచ్చ వెచ్చటి ఎండకీ మొక్క లన్నీ ఊగుతూ ఊగుతూ మైకంలో పడిపోయేయి.అప్పుడక్కడ ఆ పువ్వుల మీద, చడీ చప్పుడూ లేకుండా, అంతఃపురంలో ఆడ పిల్లల్లా ఏం(వి(ఎగురుతున్నాయో తెలుసా ? రంగురంగుల సీతాకోక చిలుకలు ! వందలు వందలు, వేలువేలు ఎగురుతున్నాయి. అక్క డికి వెళ్ళి ఏమెరగనట్టులా నిల్చొని టప్పున పట్టేనో పచ్చ సీతాకోక చిలుకని. అది నా చేతిలో గిలగిల్లాడింది. వేళ్ళతో నొక్కేసి గట్టిగా పట్టుకున్నాను. అప్పుడది దేముడికి మనసులో వెయ్యి దండాలు పెట్టుకునీ వుంటుంది. గిలగిల్లాడిన కొద్దీ దాన్ని నొక్కి పెట్టేను. దాని రెక్కలికి-బంగారంలాంటి పూత-పూతుంటుంది. ఆ రెక్కలన్నీ లాగేను నెమ్మదిగా నెమ్మదిగా, అప్పుడది "రక్షించు తండ్రీ" అని కేకలేసి దేముణ్ని పిల్చేవుంటుంది. దాని సన్నసన్న కాళ్ళు తెంపి తెంపి లాగేను. దేవుణ్ణప్పుడది "రాబాబూ! రాబాబూ! రావా బాబూ ?" అని గోలపెట్టి ఏడ్చిరమ్మనే వుంటుంది. చివరికి దాని పచ్చని ప్రాణాన్ని నలిపి, తెంపి, తీసి పారేసేను. సీతాకాలపు ఎండ మెరుగు పెట్టిన వెన్నెల్లా వుంది. తోట్లో పువ్వుల మొక్క లన్నీ కెంపులు, పచ్చలు, రవ్వలు, బంగారు నగలు పెట్టుకున్న ట్టున్నాయి. మిగతా చిలకలన్నీ అప్సరసల్లా వున్నాయి. ఎత్తుగా ఈశ్వరుడి గుడుంది. చల్లగా గాలుంది. నిర్మలంగా ఆకాశం

వుంది. అక్కడ ఇక్కడ అంతటా దేముడున్నాడు. కాని ఆ సీతా కోక చిలక్కి, ఆ సన్న జీ కి మాత్రం దేవుళ్ళేడు. అప్పట్నించి లోకంలో చూస్తున్నాను. దీనులు, హీనులు, దౌర్భాగ్యులంటారే- వాళ్ళెవరికీ దేవుళ్ళేడు. ఉన్నా వాళ్ళ ఆపదలకి అడ్డుపడడు. ఏం బాబూ ? పెద్ద పెద్ద ఏనుగులకే కాని చిన్న చిన్న చిలకలకి అడ్డు పడకూడదా ? అలా కూడదన్చెప్పే పద్ధతేమైనా వుందా ? లేదుకదా! మరందుకే చెప్పేను. దేముడి మట్టుకు దేముడుంటాడు. అమాయ కులు వాళ్ళ మట్టుకు వాళ్లు బాధలు పడుతూంటారు. వాళ్ళని వాళ్ళ బాధలకలా విడిచి పెట్టేసినా, వాళ్ళని హింసపెట్టే వాళ్ళనిమాత్రం భగవంతుడు శిక్షిస్తాడంటావా? వీళ్ళని శిక్షిస్తే వాళ్ళబాధలుపోతాయా? పడ్డవి ఎలానూ పడ్డారు. నన్నెంత శిక్షిస్తే మాత్రం - ఆ పోయిన చిలక మళ్ళీ వస్తుందా ? భగవంతుడు అంతటా వున్నాడు. అన్నీ చూస్తున్నాడు. అన్ని పనులు చెయ్యగలడు. అటువంటి వాడు అమాయకుల్ని అన్ని బాధలనుండీ ముందే కాపాడ్డేం ? ముల్లోకా ల్లోనూ ఎక్కడ అడ్డంటూ లేనివాడుకదా ఆదినారాయణుడు! బల వంతుడు బలంలేని వాళ్ళనలా రాసిరంపాన పెడుతుంటే వాళ్ళగోల వినికూడా అతడు ఉలకడు పలకడేం ? ఉలకడు పలకడు. పోనీ వయ్యా పోనీ ! అదేపోనీ ! ఇప్పుడింకా వేళ కాలేదంటావా? పాపా లేసిన వాళ్ళకి శిక్ష వెయ్యకపోడన్నావు. సరే, అందు కొప్పు కున్నాను. కాని ఆ వేసే శిక్ష వెంటనే వెయ్యడేం? పాపం పండాలి: అప్పుడు శిక్ష వెయ్యాలి: శిశుపాలుళ్ళా నూరు తప్పులు చెయ్యాలి: అప్పుడు పీక తెగాలి-అంటావా ? సరే ఒప్పుకున్నాను. కాని శిశు పాలుణ్ని చంపినట్టు ఎదర నిలబడి చక్రం వేసి తలకాయ యెగర కొట్టడే ? ఏం ? ఎందుచేత ? చెప్పగలవా ? నాకీ రోజున పాపం పండింది. శిక్ష పడింది, సరే ! ఒప్పుకున్నాను. నాకు శిక్ష వెయ్య డానికి అసలు నేరం చేసినవాణ్ని విడిచిపెట్టాలి. వాడికి శిక్ష పడా లంటే వాడి పాపం పండాలంటావా ? సరే! దానికీ ఒప్పుకున్నాను. కాని నాకు శిక్ష పడాలంటే ఇంతమందిచేత యిన్ని అబద్దాలు పలికించడం ఎందుకు ? ఇంత పన్నాగం పన్నటం ఎందుకు ? చెడ్డ

వాణ్ని చెరపాలంటే అబద్ధంమీద నిలబడిగాని ఆ పని చేయలేడా భగవంతుడు? ప్లీడరు బాబు! నే నట్టే చదువుకోలేదు. పుస్తకం చదవలేను. కాయితం యిస్తే రాయలేను. జీవితాన్ని మట్టుకు కొంత మట్టుకు చదివేను. అంటే ఈ పాతికేళ్ళలోనూ నేను చాలాచూసేను. చూసినదాన్ని గురించి రోజూ కూర్చొని ఆలోచిస్తున్నాను. ఆలోచించి కళ్ళు మూసుకున్నప్పుడల్లా నా కా రోజున దేముడి గుడి, పువ్వులతోటా, వెన్నెలయెండా, అక్కడ నా చేతులో విలవిల్లాడి దేముణ్ణి పిల్చి పిల్చి చచ్చిపోయిన సీతాకోక చిలుకలా-ఆ దృశ్యం అదే నా కళ్ళముందు కదలాడతుంది. ఈ లోకంలో ఆ సన్న చిన్న జీవి గోల వినే వెవ్వర్లేవు. ఈ లోకంలో దాని పిలుపుకి మారు పలుకలేదు. యెక్కడా కనుచూపు మేరలో, ఈ లోకంలో దాన్ని కాపాడే శక్తి లేదు. భగవంతుడు లేడనడానికి దీనుల,పేదల బలహీనుల, బాధలే నిదర్శనం. భగవంతుడున్నా డన్నావు దిక్కు లేకుండా ఎందుకలా ఎంతోమందిని ఎంతో కాలం నుంచి ఎందుకలా విడిచి పెట్టేస్తున్నాడో, ఎప్పుడన్నా అతగాణ్ని అడిగిచూడు బాబూ! ఒక్కసారి అడుగు.

రిజర్వ్ పోలీసులు : దా బాబూ దా! ఇంకా వారంటు రాయించుకోవాల (రిజర్వు పోలీసులూ, సోమసుందరంమూ వెళతారు. డిఫెన్సు లాయరు అక్కడే రెండు క్షణాలు నిలబడి ఏదో ఆలోచించుకుంటూనే ఆ తర్వాత నెమ్మదిగా వెళతాడు)

# 5

సార్వభౌమరావింట్లో మేడ గది. సుశీల కుర్చీమీద కూర్చొనుంటుంది. కుర్చీ వీపుమీద తలపెట్టుకొని సార్వభౌమరావు సుఖమైన కుర్చీలో కూర్చున్నాడు. ఇద్దరూ ఏదో ఆలోచిస్తూ కూర్చున్నారు. అరగంట కొట్టింది, గోడమీద గడియారం. సుశీల తుళ్ళిపడలేదు. సార్వభౌమరావు ఉలిక్కిపడ్డాడు.

సార్వ : ఏం సుశీలా! ఏమిటాలోచిస్తున్నావు!

సుశీల : (నెమ్మదిగా) నాకు చచ్చిపోవాలనుంది.

సాఁ్వ : ఇదుగో, సుశీలా! ఒక్కమాట చెప్తున్నాను విను. అంత అన్యాయం, ఆ లోఫర్ వెధవతో కలిసి నువ్వు నాకు చేసినప్పటికీ నిన్ను క్షమించేను. గతాన్నంతా విస్మరించి నిన్ను ఎప్పట్లా గౌరవిస్తున్నాను. అయినా నువ్వింకా ఆ లోఫర్ వెధవ కేసు గురించే ఆలోచిస్తూ కూర్చున్నావంటే అందులో అర్థం ఏమిటి? వెధవ కేసు, ఏమిటవుతుంది మహా? ఓ యేడాదో ఆర్నెల్లో శిక్ష పడుతుంది. అదయిపోయేక, హైటకి యథాప్రకారం బేఫార్సుగా ఒచ్చేస్తాడు. దానికేముంది?....[వాడి పేరు మళ్ళీ నువ్వెత్తలేదనుకో! ఉన్నమాట చెప్పుకోవాలికదా? అయినా అంత నీచుడిమీద పెట్టిన కేసు ఏమవుతుందా అని ఆలోచిస్తూ కూర్చొని], వాడి గురించి నాకీ రకంగా జ్ఞాపకం చెయ్యడం, నీ కెలా వుందో కాని, నాకు మాత్రం చాలా అసహ్యంగా వుంది తెలుసా? (అని చాలా చిరాకుపడతాడు) మనవైనా ఏం చేసేం? ఏ దొంగతనాని కొచ్చేడో ఏమిటో మనకి తెలియదనే రిపోర్టిచ్చేం. అంతే కదా మనం చేసేం? మనం మంచివాళ్ళం కాబట్టే కదా అంత మాత్రవే చేసేం: మరోడైతే వాణ్ని ఖూనీ చేసేసి పెరట్లో పాతిపెట్టేసుండును.

సుశీల : అలా చేసినా అది యింత అన్యాయం కాదుకదా?

సాఁ్వ : ఊరుకొందూ? వెధవ యూస్‌లెస్ గొడవ! వాణ్ని కనికరించడం కూడా నా తప్పేనా? మరైతే వాణ్ని పోలీసుల కప్పజెప్పడం ఎందుకు? "మనమే ఏదో ఒకటి చేసేద్దాం" అని ఆవేళ చెప్పలేకపోయేవా? వెధవని పోలీసువాళ్ళకి అప్పచెప్తే ఏదో ట్రమ్మీ కేసు తగిలించి వదిలేస్తారు కదా? అనుకున్నాను. వాళ్ళు యింత ఘోరం చేస్తారని నాకేం తెలుసు? లోకం అలా వుంది. దీనికి మన వేం చేస్తాం? నువ్వెక్కడకీ కదలవు కాబట్టి నీకేం తెలీదు. లోకంలో ఎంతెంత దొంగ బద్మాషులున్నారో నీకెలా తెలుస్తుందీ? నన్నడుగు. నేను చెప్తాను....అయినా అన్నీ తెలిసి కూడా నమ్మేను చూడు. ఆ పోలీసువాణ్ని! వెధవ అంత అన్యాయం చేస్తాడనుకోలేదు. మనమైనా, వాడికి పీకపోతుందీ అంటే వెళ్ళి అడ్డుకొన్నామా లేదా?

ఇంక-మనం వెళ్ళి వాడి తరపున సాక్ష్యం యిచ్చినా, వాడి మీద కేసు కొట్టివెయ్యరూ అంటావా ? అది వాడి దురదృష్టం !

సుశీల : లోకంలో యింతలేసి ఘోరాలు జరుగుతున్నాయంటే నాకు భయం వేస్తుంది.

సార్వ : ఈపాటిదానికే అలా బెంబేలు పడిపోతే ఎలాగ ? ఇటువంటివన్నీ మనసుకి పట్టించుకొంటే మనం బతకనే బతకలేం! అలాంటి నీచప్పు వెధవ నా యింట్లో నా గదిలో కనిపించాడంటే, అందు గురించి నేనేం చేసేను ? మనసులో బాధపడిపోయి. కుమిలిపోయి బెంగ పెట్టేసుకున్నానా? ఏదో కేకలు వేసేసి నాల్రోజులు కొట్లో కూర్చుంటే అదే బుద్ధొస్తుందని నమ్మి చేసేం ? నీ మీదకూడా ఏదో కేకలేసేను. ఎగిరేను, అంతే ! ఎందుచేత, ఇలాంటి స్వల్ప విషయాలన్నింటినీ భూతద్దం పెట్టుకు చూసి మనం భయపడి పోకూడదు.

కృష్ణ : (పరుగెట్టు కొంటూ వస్తాడు, సుశీలని చూడకుండా సార్వభౌమ రావునే చూసి) అమ్మ ! థాంగ్గాడ్ వున్నారు !

సార్వ : (కోపంతో) వెధవా ! ఇక్కడి కెవడ్రమ్మన్నాడు ? పో ! పద ! బైటకి పో !

కృష్ణ : పొమ్మంటే ఎలాగ ? కొంప మునిగింది.

సార్వ : ఏం ఏమిటయింది ? మళ్ళీ నా కొంపమీదికి ఏం తెచ్చేవు? పదబైటకి పద ! (అంటూ లేస్తాడు కుర్చీలోంచి)

కృష్ణ : మధూగాడు మీదమీది కొచ్చేస్తున్నాడు !

సార్వ : వాడెవడు ? ఆ సాక్షిగా దేనిఁటి ? రానివ్వకు వెధవని !

కృష్ణ : వచ్చి పేడు.

మధు : ఏరీ ?? ఎక్కడున్నారు ! ఆఁ ఇరుగో !! (అంటూ గదిలోకి జబర్దస్తీగా వస్తాడు)

సార్వ : ఎవర్నువ్వు ? కిందకి పద ! కిందకి పద ! ఏం కావాలి ? పద పద! బైటకి పద ! మాటాడదాం !

కృష్ణ : (మధూని) కిందకి పదరా ! అక్కడ మాటాడుకుందాం !

మధు : వీల్లేదు, నేను కిందకి వెళ్ళను. మీదకీ వెళ్ళను. ఇక్కడే వుంటాను.

ఏడాదో రెండేళ్ళో జెయిలు వేయిస్తాం అన్నారు. ఎవరన్నారలాగ ?
మీరు ! మీరే మీ రే ! అన్నారు ? వాడి కిప్పుడు....వాడికిప్పుడు....

కృష్ణ : (మధూని గుమ్మం వైపు లాగుతాడు)

మధు : (విదిలించుకొంటూ) వాడి కిప్పుడు ...ఒదులు నన్నొదులు ...వాడి కిప్పుడు—ఒదుల్తావా ఒదలవా (అని బలంగా విడిపించేసుకుంటాడు) వాడి కిప్పుడు ఉరిశిక్ష వేసేరు !! ఏవికేం చెపుతా రిప్పుడు !!

సుశీల : (లేచి నిలబడుతుంది. గాభరా పడదు) ఎవరికి ఉరిశిక్ష ?

సార్వ : సుశీలా నువ్వు కిందకి పో ! పో కిందికి !

సుశీల : ఉరిశిక్ష ఎవరికి ?

సార్వ : నువ్వు కిందకి పోతావా ? పోవా ?

సుశీల : వెళ్ళను, ఎవరికి ఉరిశిక్ష ?

మధు : ఇంకెవరికి ?

సార్వ : ఒరే, క్రిష్ణా ! రాస్కెల్ అలా నిల్చుంటావేం ? వెళ్ళి పోలిపిల్లినీ, నూకరాజునీ పిలువు. వీణ్ణికట్టిపడేసి ముందు గెంటించి, వెళ్ళు వేగిరం ! ఊం.

మధు : నేను కదల్నికట్టిణ్ణించి ! కదల్నంటే కదల్ను !

సార్వ : (క్రిష్ణతో) సర్వెంట్సుని పిలవరా ఫూల్ !

సుశీల : ఉరిశిక్ష ఎవరికో నాకింకా తెలియదనే మీ నమ్మకమా ? మీరూ మీ సర్వెంట్సూ నిజాన్ని దాచలేరు. బావగారూ ? ఎంత గింజుకున్నా దాచలేరు ? నిజాన్ని మీ రింక దాచలేరు. ఉరిశిక్ష ఎవరికో నాకు తెలుసు ! (అని సడెన్‌గా ఏడుస్తుంది)

సార్వ : (సుశీలకి నిజం తెలియకముందు కంటే, ఆమెకి నిజం తెలిసిన తర్వాత ఎక్కువ రిలీఫ్‌తో వుంటాడు సార్వభౌమరావు. కాని చాల కోపంగా వుంటాడు) నా ఇంట్లో ఎవరూ ఏడవటానికి వీల్లేదు !!

మధు : ఇప్పుడు నా మాటేమిటి ? ?

సార్వ : నోర్ముయ్ ! చంపేస్తాను ఒరే క్రిష్ణా ! వీణ్ణా గదిలోకి-నెట్టు ! (అని సోమసుందరాన్ని మొదట్లో బంధించిన గది చూపిస్తాడు)

మధు : ఒరే క్రిష్ణా ! నువ్వు నా వొంటిమీద చెయ్యేసేవంటే చూడు వు రింక ! చంపేస్తాను ! (అంటూ బల్లమీద బ్రాంది సీసా తీసి పట్టుకొని,

గుమ్మానికి అడ్డుగా నిల్చొని) నన్నెవరూ ముట్టుకోవద్దు ! నే నిక్క-ణ్ణించి కదల్ను !

సార్వ : బొండి రాస్కెల్స్ ! ఇక్క-ణ్ణించి బొండి !

సుశీల : అర్థమయింది. నా కంతా అర్థమయింది. ఈ అన్యాయం, ఈ అదర్మం, ఈ అక్రమం యిదంతా ఎవరివల్ల ఎలా ఎందుకు జరిగిందో నా కంతా అర్థమైంది. ఇప్పుడిక భగవంతు డొచ్చినా నా కళ్ళు ముయ్యలే డతను. అదీ కారణం, ఇదీ ఫలితం-అనేది నా కర్థమయింది. ఏవి పాలు ఏది విషం - నాకు తెలుసు విప్పుడు. ఈ మాయ, ఈ బాధ, ఈ పన్నాగం, ఈ పాపం - అంతా నా కర్థమయిం దిప్పుడు. మీరు కట్టిన తెరలన్నీ తెగి పడిపోయేయి. మీరు కట్టిన కనుకట్టు యికముందు పని చెయ్యదు. మీ రింక నిజాన్ని దాచలేరు.

మధు : వాడికి ఏడాదో రెండేళ్ళో జెయిలు మాత్రం వేయిస్తానని ప్రామిస్ చేసి మాచేత అబద్ధం పలికించావు ఇప్పుడో అమాయకుడికి ఉరి శిక్ష పడింది. ఈ పాపం నాకు అంటుకొందిక వీల్లేదు ! నా అంతరాత్మ అందు కొప్పుకోదు. సత్యాన్ని నీ కొడుకే చంపేడు. నీకు యిష్టం లేని వాడిమీదికి నేరం తోసీసేవు ! నా అంతరాత్మ ఒప్పుకోదంటే ఒప్పుకోదు! ఇప్పుడు ఈ క్షణాన్న వెళ్ళి నే నందరికీ నిజం చెప్పేస్తాను ! తప్పకుండా నిజం చెప్పేస్తాను.

సార్వ : (కొంచెం నవ్వి) ఆలస్యం అమృతం విషం! ఇప్ప ణ్ణువ్వు నిజం చెప్తే నమే వాడెవడు ? - పోలీసువాడు తప్ప! అబద్ధం చెప్పి అమాయకుణ్ణి ఉరికంబం ఎక్కి-ంచి నందుకు ముందు నీకు బేడీలు తగిలిస్తారు. చెయ్యవలసిన పెళ్ళి ఆ తరువాత. అది కూడా చేస్తారు.

కృష్ణ : మరైతే మమ్మల్నిప్పుడు ఏం చెయ్యమంటారు ?

మధు : నే నేం చెయ్యడం ? రాస్కెల్స్! రాస్కెల్స్ ! నే నేం చెయ్యడం ?

సార్వ : వెళ్లి చావు !

మధు : (క్రిష్ణ వైపు) ఇదంతా నువ్వూ వాడూ కలిసి చేశారు ! ఇద్దరూ, మీ యిద్దరే చేసేరు. ఇప్ప ణ్ణా అంతరాత్మ నన్ను తినేస్తోంది. నన్నేం చెయ్య మంటావు ? చెప్పు !

కృష్ణ : షటప్ ! నాకేం తెలీదు. నువ్వేం చెయ్యాలో నాకేం తెలుసు ? ఏం చెయ్యాలో ఆయన్నడుగుతావా ? నన్నా ? నాదేం తప్పులేదిందులో.

మధు : వాడిదీ నీదీ కూడా తప్పుంది. ఈ పాపం అంతా మీదే ? నాది కాదు ! వెధవల్లారా, ఈ తప్పంతా మీది !

సార్వ : (గట్టిగా) నోరు ముయ్యండ్రా స్కౌండ్రల్స్ ! నోరు ముయ్యండి ! నువ్వు ! నువ్వు ! ఏయ్ ! నువ్వాను ! మీరంతా అలా నోళ్ళు మూసుకు పడుండండి ! మీరూ మీ న్యాయాలూ, సత్యాలూ, అంతరాత్మలూను నోరు మూసుకు పడుండండి ! లేకపోతే చావండి ! అంతటికీ నేనే కారణం అంటే మాత్రం మూతి పళ్ళు రాలగొడతాను. ముక్కలు ముక్కలు కింద నరికేస్తాను. ఖబడ్దార్ ! ఇదంతా చేసింది మీరా, నేనా ? మీరే చేసేరు. పాపిష్టి వెధవల్లారా ! మీరే అంతా చేసేరు.

కృష్ణ : మీరు చెయ్యమంటేనే కదా మేం చేశాం, మీ రిప్పుడిలా మాటాడ్డం మీ కేం న్యాయంగా లేదు.

మధు : ఈ పాపం అంతా నువ్వే చేయిస్తున్నావు !

సార్వ : చెయ్యమంటే చెయ్యమంటాను. చెయ్యమంటే మీ రెందుకు చెయ్యాల్రా వెధవల్లారా ? పాపప్పని చెయ్యండ్రా అంటే డీమని ఎందుకు చేసేరు ? మీ వయసులు, మీ చదువులు, మీ తెలివితేటలు, మీ వివేకం, మీ విజ్ఞానం అవన్నీ ఎక్కడికి పోయేయి ? స్కౌండ్రల్స్ ! నే నబద్ధం ఆడమంటే ఒట్టినే నా మీద దయతలచి నన్ను చూసి కనికరించి అబద్ధం ఆడేరా ! ప్రాణహత్య చేసి నానా కంగాళీ చేసి అది పైకి తవ్వుతా ననేసరికి, పీక తీసేసే అబద్ధమైనా ఆడేయడానికి తయారై పోయావు నువ్వు ! బద్మాష్ !...మరింక, ఒరే అంతరాత్మ వెధవా నువ్వు ! 'అమ్మో, అంత ఘోరమా ! అయ్య బాబో అంత అబద్ధమా ?' అని ఆ వేళ అన్ని ఏడ్పు లేడ్చావు ! అబద్ధం ఆడ్డానికి ఆఖరి కెందు కొప్పుకున్నావు ! అయ్యాని కొట్లో వేయిస్తా ననేసరికి, ప్రజల సొమ్ము తినేసిన ఆ వెధవని సేవ్ చెయ్యడం కోసం నీకు ముక్కూ మొహం తెలియనివాణ్ని, అమాయకుడని నీకు తప్పక తెలిసినవాణ్ణి - ఏడాది రెండేళ్ళపాటు జెయిలు

వేయించడానికి రెడీ అయిపోయేవు. పీక తీయించేదైనా, జెయిలు వేయించేదైనా - ఏదయినా అబద్ధం అయినప్పుడది అబద్ధమే! మీలాటి రాస్కెల్స్ ఎలకల్లా కొరికి చంపుతున్నారు మనుషుల్ని. (క్రిష్ణని వేలితో చూపిస్తూ) నిన్ను నువ్వు (అదే చూపుడు వేలితో మధూని చూపిస్తూ) నువ్వు మీ అయ్యనీ రక్షించుకొందు కన్చెప్పి ఎంత పాపానికైనా ఒడికట్టుకున్నప్పుడు, నా కొడుకుని నేను రక్షించు కొందికి పాటు పడితే అందులో తప్పేముంది? అది తప్పే అయినప్పటికీ, నా లోని ఆ తప్పు ఎంచడానికి ఎవడికైనా హక్కుండొచ్చు కాని, వెధవల్లారా, ఆ హక్కు మీకెలా ఒస్తుంది? సత్యమూ-ధర్మమూ, న్యాయమూ అంతరాత్మా అంటూ చెవికోసిన మేకలా అరుస్తున్నా రిప్పుడు! ఆ రోజున వాటికోసం ఎందుకు నిలబడ్లేదు మీరు? "నన్ను నడివీధిలో నిలవెట్టి, అణాకాటి కాంపౌండర్ ముండచేత నన్నల్లరి పెట్టించి, నా చదువుకి స్వస్తి చెప్పించి, నన్ను జెయిలుకి పంపిస్తే పంపించు. కాని, నేను మాత్రం అబద్ధం చెప్పను" అని రాస్కెల్ ఆ రోజున నువ్వెందు కన్లేదు? "మా అయ్య జెయిలుకి వెళ్ళి మా కుటుంబం సర్వనాశనం అయి పోయి, మేమంతా గతిలేక చెట్టుకొక పిట్టగా చెదిరిపోయి, అడుక్కు బతకవలసొచ్చినా సరే నేను నిజంతప్ప రెండోది పలకను" అని, ఒరే వెధవా, నువ్వెందు కనలేదు ఆ రోజు? ఆ రోజున కళ్ళు తెరుచుకుని అబద్ధం ఆడాలని గుర్తుంచుకొని అబద్ధం ఆడ్డానికి సిద్ధ పడ్డారు. మీరు అమాయకుణ్ణి అమాయకుడని తెలిసీ కూడా మీ లాభం కోసం వాణ్ణి గోతిలో తోయడానికి తయారైపోయేరు. సత్యానికీ-అసత్యానికీ, న్యాయానికీ-అన్యాయానికి తేడా తెలిసి కూడా కలేజా లేకనే అబద్ధానికీ, అన్యాయానికీ మొగ్గు చూపించేరు మీరు. మీలాంటి వెధవల్ని ముందు షూట్ చేస్తే దేశం బాగుపడుతుంది పొండి వెధవల్లారా. ఇక్కణ్నుంచి పొండి. మిమ్మల్ని చూస్తేనే పాపం. మీ సాయమే లేకపోతే యింత పాపం నే నొక్కణ్ణీ చెయ్యలేక పోయుందును.

మధు : (తల పట్టుకొని) నాది, నాది, నాదే తప్పు! అన్యాయం, అధర్మం. అసత్యం అన్నిటినీ తెలిసి కోరి వరించేను, భయపడుతూనే

ఘోరం, ఘోరం, ఘోరం చేసేను. వాడికి ఆ సుందరానికి దగ్గిరుండి చావుపెళ్లి చేయించేను (అంటూ చేతిలో వున్న బ్రాందీ బుడ్డిని నెమ్మదిగా జార్చేస్తాడు)

కృష్ణ : నువ్వేంట్రా బాబూ ! (అని మధూకి మనస్సు స్థిమితంగా లేదని సార్వభౌమరావుకి సంజ్ఞచేసి చూపెడతాడు. సార్వభౌమరావు తల దిప్పేసుకుంటాడు) అదికాదు పెదబాబూ ! వాడికేలాగైనా ఏడాదో-రెండేళ్ళో జెయిలు వేయించలేకపోయారా ? మీరు తల్చుకుంటే అదెంతపని ? ఏదో మాకేం చెయ్యాలో తెలియక మీ దగ్గరకొస్తే మీరు మమ్మల్ని కోప్పడి కొట్టి పారేస్తే ఎలా ?

సార్వ : నువ్వాట్టే మాటాడేవంటే తంతాను. ఏడాదీ రెండేళ్ళు వేసేసి ఉరి తప్పించేదానికి నేనేం జడ్జినా, దేవుణ్ణా, ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా'నా ! ఆ క్షుద్రపు వెధవకి ఉరిశిక్ష వేయిస్తే నాకేమైనా కలిసొస్తుందా ? వాణ్ణి తప్పించాలనే చూసేం. ఈలోపున ఆ నా బావమరిది మేనమామ వెధవకి బదిలీ అయిపోయి నెత్తురు తాగే హిట్లర్ తమ్ముడు కొత్త జడ్జిగా ఒస్తాడని నేనేం ముందుగా కలగనగలనా ? మొదటివాడుంటే వాణ్ణి పట్టుకు ఎలాగో తంటాలు పడుదువు. వాడికి బదిలీ అయిపోడం నా తప్పేంకాదు. ఈ కసాయి జడ్జీ ఇక్కడికి బదిలీ అవడం కూడా నా తప్పేం కాదు. అది ముద్దాయీ వెధవగాడి దురదృష్టం. సదా, వాడి పూర్వజన్మ కర్మ. దానికి నన్నేం చెయ్యమంటావు ?

కృష్ణ : అవున్రా మధూ ! వెంకట్రామయ్యగారికి బదిలీ అయిపోతుందని మనం ఎలా అనుకోగలంరా ? పెదబాబు కూడా నబువుగానే చాలా రీజన్‌బుల్‌గా చెప్పే రంతాను. అది ఆ ముద్దాయిగాడి 'ఫేట్'. దానికి మనం ఏం చేస్తాం ? పూర్వజన్మ కర్మన్నారు పెద్దలు. లాట్ ఆఫ్ ట్రూత్ ఇన్ ఇట్ ! అందులో చాలా సత్యం ఉంది.

మధు : కాదు కాదు కాదు, మనలో అసత్యం వుంది. నాలో అసత్యం వుంది. నీలో అసత్యం వుంది. వాడంత పెద్దమనిషున్నాడు. వాణ్నిండా అసత్యం వుంది. వాడు ఉరికంబం ఎక్కడానికి ముఖ్య కారణంగా మనం ముగ్గురం వున్నాం. కనిపించే కారణా లొదిలేసి,

కనిపించని కారణం చూస్తున్నారు మీరు. నిజాన్ని కప్పిపుచ్చి మాయని నిలబెడుతున్నారు మీరు. నేనొప్పుకోను నే నొప్పుకోను! ఈ అన్యాయం జరగడానికి నువ్వు. నేను, వాడు, మనం కారణం.

సుశీల : నాయనా! నే నొక కారణం.

మధు : నువ్వెవరో నాకు తెలియదు. నువ్వు కూడా (సార్వభౌమరావుని) (చూపిస్తూ) వీడి చేతిలో చిక్కుకున్నావా? వెళ్ళిపో వెళ్ళిపో వేగిరం వెళ్ళిపో! ఇప్పుడే వెళ్ళిపో! పట్టుకుంటే మరింక వదలడు వీడు. నువ్వు చాలా బాగున్నావు! నిన్ను వీడు పీల్చి పిప్పి చేసేసి అఖర్న అవతలకి తోసి పారేసి బూటు కిక్కిచ్చి అది నీ ఖర్మ పొమ్మం టాడు. అమ్మా! వీలు చేసుకొని నువెళ్ళిపో! వాడొక్కడే పరమ పాపాత్ముడని నేనంటం లేదుస్మా! నేనుకూడా పరమ పాపాత్ముణ్నే. కాని వాడు పాపానికి థీరీ చెప్పి అదంతా పుణ్యమే నంటున్నాడు! వాడు ఎంత దొంగ థీరీ చెప్తున్నాడో తెలుసా? న్యాయం జరగడమూ సబువే! అన్యాయం జరగడమూ సబువే! లోకంలో ఏదెలా జరిగినా అదంతా సబువే! అనీ వాడంటున్నది. కారణం లేకుండా ఏదీ జర గదు. అంచేత! కారణా లన్నింటికీ పూర్వజన్మల్ని వెతక మంటు న్నాడు వెతకడం నీ తరమా నా తరమా? చాలా అన్యాయాలకి వీడసలు చాలా పెద్ద కారణం. వీడివేపు మనం చూసినపుడల్లా "ముందు జన్మలు చూడు ముందు జన్మలు చూడు. నావైపు చూడకు నా వైపు చూడకు" అని దబాయించి పూర్వ జన్మని చూడ మని మనకి మెడలు తిప్పుతాడు వీడు. పూర్వజన్మలు వున్నాయో. చచ్చేయో అవి మనకి కనిపించవు. మెడలు తిప్పేసేడు కాబట్టి. వెనకని వీడు కనిపించడు. తెల్లకాకిని చూడు చూడన్చెప్పి నీ కంచంలోంచి కూర లాగేస్తాడు వీడు! అమ్మో, వీడు దుర్మార్గుడు. కాని....కాని... నేను....నేను.... దుర్మార్గుణ్ని....పాపాత్ముణ్ని.... అబ్బ! నా తల పేలిపోతోంది ఒరే క్రిష్ణా—

సార్వ : (క్రిష్ణతో) వాణ్ని తీసుకుపోరా బాబూ!

కృష్ణ : పదరా మధూ, పద పోదాం.

మధు : నా మెదళ్ళో....ఒరే బాబూ! ....నా మెదళ్ళో విస్కీసీసాలు పేల్తు

న్నాయి....నేనేం మాటాళ్ళేను....నేనేం చెప్పలేను....నామెదళ్లో ఓక్కొ బిడ్లు పేల్తున్నాయి. సత్యం, సుందరం పేర్లతో రెండు బిడ్లు....ఒరే క్రిష్ణా! ఒరే క్రిష్ణా....నా నుదుటికి రెండు పిస్తోళ్లు! గురి చేసుకొంటూ ఒస్తున్నాయిరా!....సత్యం ఒకటీ! సుందరం ఒకటీను! ఒరే నేను మాటాళ్ళేకుండా వున్నాను కదరా! నా నాలిక చీలిపోతుందిరా! ఒకటి సత్యం, మరోటి అసత్యమే! ఆఁ ఆఁఆఁఆ! నా నాలిక చీలిపోయిందిరా! నేనింక మధూగాణ్ని కాను. నాగుపాము విషంగాణ్ని! (అని నవ్వుతాడు) నేను చాపకింద నీరుగాణ్ని, చేత గాని హంతకుణ్ని ఒరే కృష్ణా నేను చాపకింద నీరుగాణ్ణి! నువ్వు జేబులో తేలుగాడివీను! మనిద్దరం చేతగాని హంతకులం తెలుసా? (అని క్రిష్ణదగ్గరకు వెళ్ళి నెమ్మదిగా మాటాడుతూ. సార్వభౌమరావుని చూపిస్తూ) వాణ్ణి చూసేవా? అడుగో వాడు! (అని గట్టిగా నవ్వుతూ) వాడి దగ్గర మనిద్దరం రెండు కుక్కలం! అదిరా బాబూ! మనిద్దర్నీ కుక్కల్ని చేశాడు వాడు. బలే బలే బలేగా చేశాడు, (అని నవ్వు తాడు) బలే బలే బలే (అని టక్కున ఆగి) ఇదేమి టిలా నవ్వు తున్నాను! చంపిన వాణ్ణి విడిచి పెట్టంచేసి, చంపనివాణ్ణి చంపిం చేస్తూ ఏడవ్వలసింది పోయి నవ్వుతున్నా నేమిటి? ఇలా నవ్వు తూంటే నన్ను తిట్టకుండా నా అంతరాత్మ యెక్కడకి పోయింది? (అని చేతుల్తో జేబులూ, గుండెలూ వెతుక్కుని) ఒరే క్రిష్ణా! నా అంతరాత్మ లేదురా! అంతరాత్మ లేనేలేదు. ఉందను కున్నా నిన్నా ళ్లూనూ! లేదురా! మన సత్యం నిజంగా చెప్పేడుస్మీ "ఒరే మధూ నీ అంతరాత్మ లేదురా వెధవా" అన్నాడు- అది తప్పు కదరా! అప్పుడు అంతరాత్మ నాకుండేది కదరా? ఇప్పు డెక్కడికి పోయిం దోన్రో? ఆవేళ కోర్టులో పోయుంటుంద్రా! లేక అప్పటికే పోయిందా (అని ఆలోచించి) ఆఁ! అదిరా! ఆవేళ మాలతి పిచ్చాసుపత్రికి వెళ్ళింది కదురా? ఆవేళ మాలతి కిచ్చేశాన్రా! నేనొస్తానూ, అందాకా దగ్గరుంచ మన్నాన్రా! అదిరా సంగతి, నేను వెళ్తాన్రా! అర్జెంటుగా మాలతి దగ్గర కెళ్ళాలిరా (అంటూ గబ గబా వెళ్ళిపోతాడు)

కృష్ణ : వాడంతరాత్మ వాడి కొంప తీసింది.

సార్వ : ఇప్పుడది ఊరంతా టాంటాం అవుతుంది. ఒరే క్రిష్టా ! వాణ్ణి మనం ఇమిడియేట్‌గా పట్టించి పిచ్చాసుపత్రిలో అడ్మిట్ చేయించాలి. పో, నువ్వు వేగిరం పో, పోయి అర్జంటుగా మీ ఫాదర్ని రమ్మను.

కృష్ణ : మా ఫాదరే నన్ను మీ దగ్గరికి పంపించేరు. ఇంతలో దార్లో మధూ తగులుకున్నాడు.

సార్వ : వాడి గురించి అర్జంటుగా ఏర్పాట్లు చేద్దాం. కాని మీ ఫాద రెందుకు నిన్ను పంపించేడు.

కృష్ణ : అర్జంటుగా రెండువందలు కావాలిట.

సార్వ : హుం! వెధవా! పో! పో యిక్కణ్నించి. కేసు ముందు పట్టికెళ్ళిన డబ్బు మీ ఫాదర్ కావాలన్నాడనే నా దగ్గర పట్టుకెళ్ళి నీ జూదం అప్పులు తీర్చుకున్నావు. మరింక నేను రాణీ యివ్వను. మరింక నా కంటికి కనబడకు, కుడికాలు పెడితే కులక్షయం. ఎడమకాలు పెడితే వంశ క్షయం ! మళ్ళీ నా గుమ్మం తొక్కావంటే వీధి గుమ్మానికి వేళ్ళాడ దీసేస్తాను. తెలిసిందా ? పోయి నీ బాబుని వేగిరం నిమిషాల మీద యిక్కడికి రమ్మను.

కృష్ణ : అదికాదు పెదబాబూ !

సార్వ : అట్టే మాట్లాడావంటే నుల్చున్న పాట్న పీక కత్తిరించేస్తాను. పో ? యిక్కణ్నించి !

కృష్ణ : మూడ్ బాగులేనప్పుడు అడగటం నాదే పొరపాటు. ఒస్తాను పెద బాబూ ! మధూ గురించి చూడాలి కదా ! ఒస్తాను. (అంటూ డిగ్నిఫైడ్‌గా నడవడానికి ప్రయత్నిస్తూ వెళ్ళాడు)

సుశీల : మీ దాహం తీరింది కద ! మీ కావేషీ అంతా తీర్చుకున్నారు కద!

సార్వ : నోర్ముయ్ ! ముయ్ నోరు ముందు ! పాపిష్టిదానా ! నీవల్లే వచ్చిందంతాను ! న్యాయం. అన్యాయం. నీతి అవినీతి అంటూ యిందాక్లా నుంచీ నువ్వూ పెద్ద పెద్ద కబుర్లు చెప్తున్నావు. నీ బతుకు నీతి బతుకవునో కాదో ఆలోచించుకొని ఆ తరవాత వాటి గురించి మాటాడు. అంత వరకూ వాటిగురించి మాట్లాడ్డానికి నీకు అధికారం లేదు. ఏడాది నించీ ఆ లోఫర్ వెధవని ఆ ముస్టాయీ వెధవని మరిగి నాతో అబద్దాలు చెప్పి నాకు తెలియకుండా యిక్కడికి అక్కడికీ

పోయి, నే లేనపుడు వాణ్ని నా ఇంట్లోకి నా గదిలోకి రప్పించు కొని అన్ని పాటలూ పాడి అన్ని డాన్సులు చేసేవు! ఏం!అన్నాళ్ళూ నాతో నిజం ఎందుకు చెప్పేవుకావు ? ఆడపశువులకి మొగపశువంటే యిష్టం లేకపోయిందంటే కొమ్ములతో పొడిచేసి, వెంటనే అవతలకి తోసేస్తుంది. నువ్వు నా ఎదర నిలబడి "ఇదిగో, సార్వభౌమరావ్! అలా పిలబడు: నా మాట మరింక విను. నువ్వంటే నాకు యిష్టం లేదు. ఇదిగో వీడు ఈ ముద్దాయీ వెధవ, వీడంటేనే నా కిష్టం" అని స్పష్టంగా నాతో చెప్పేసి నీకు నచ్చిన వాడితో అప్పుడే నాకు గుడ్ బై కొట్టేసి, ఎందుకు పోలేవు కావు ? సూటిగా ఆ పని చెయ్యకుండా, ఇన్నాళ్ళూ ఈ నాటకం ఎందుకు ? ఇంత కపటం ఎందుకు ? పశువు కున్న పాటి నీతి నిజాయితీ అయినా లేకపోయింది నీకు! లేకపోగా పైగా నీతి నియమాల గురించి శ్లోకాలు చదివి ఉపన్యాసాలిచ్చి ప్రశ్నార్థకాలూ, ఆశ్చర్యార్థకాలూ పలుకుతున్నావు. సిగ్గు లేకుండాను. ముయ్ నోర్ముయ్ ! ఇన్ని చేసి నన్నింత అన్యాయం చేసినా నిన్ను క్షమించి యింకా యింట్లో పెట్టుకున్నాను. నువ్వు కోర్టులో చేసిన రసాభాసకి నా బ్రతుకు నడివీధిలో పడి నవ్వుల పాలయినా, ఇంత పార్లమెంటు మెంబరూ కూడా ఆఖరికి వాడి పంటముండకే అక్కర్లేక పోయాడని దుర్మార్గపు వెధవలు నా విరోధస్తులంతా నన్ను వెటకారంచేసి వెక్కిరించి, అబద్ధపు కేసులు పెట్టిస్తున్నానని దుష్ప్రచారం చేసి, నామీద అన్నిరకాల కుట్రలూ పన్ని నాకు చావుదెబ్బ తియ్యాలని చూస్తున్నా. ఏది ఎవర్నీ లెక్క చెయ్యకుండా వెధవలందర్నీ నా తల వెంట్రుకలకంటే కనికిష్టంగా జమకట్టి అతి దేఖాతర్‌గా తిరుగుతున్నాను. ఎవరికోసం అని అ గుండె రాయి చేసుకుని తిరగ్గలుగుతున్నాను ? ఏది వున్నా, పోయినా నువ్వంటే చాలు ననుకొని నీ కోసం ! "ఏవి పాలు ? ఏది విషం" అంటూ మోరల్ పాటాలు చదివేవు ఇందులో విషం ఎవడు ? నువ్వా ? లేక నేనా? నువ్వా రోజున నీ నీతికీ, నిజాయితీకి నిలబడగలిగితే కథే లేకపోను, ఇంత అన్యాయం జరక్కనే పోను. వా డిప్పుడు ఉరికంబం ఎక్కేడూ అంటే ఆ ఘోరానికి నే నెంత

బాధ్యుణ్నో నువ్వూ అంత బాధ్యురాలివే! అందుచేత నీ నీతి శతకాలన్నీ, ధర్మ శాస్త్రాలన్నీ. కట్టకట్టి అటక మీద పెట్టుకున్నవి. అటక మీదనే పెట్టుకో! లేదూ అంటే వాటిని అక్కడ్నించి దించి, ధైర్యంగా నెత్తిన పెట్టకు తిరుగు! ధైర్యం వుంటే ఆ పని చెయ్యి. అంతేకాని కబుర్లు మాత్రం చెప్పకు. నా స్వార్థం కోసం నేను అన్యాయం చేశాను. నిజమే ఒప్పుకుంటాను. ఎంచేత చేసేను? నాకు స్వార్థం తప్ప మరో న్యాయం లేదు. నిస్వార్థంగా వుండాలనీ, న్యాయం చెయ్యాలని తెలిసి కూడా నువ్వా ప్రకారం చెయ్యడం లేదు. నా పాపం కంటే నీ దెక్కువ పాపం! ఆ సంగతి తెలుసుకో.

సుశీల : మీ ప్రకారం మీకు పాపమే లేదు. మీరేది చేసినా మీకు పాపంలేదు.

సార్వ : అందరు వెధవలూ అలాగే వున్నప్పుడు నేను మాత్రం అలావుంటే తప్పేమొచ్చింది? నువ్వు ఆ క్రిష్ణగాడు, ఆ మధూ వెధవ మీరు నా కంటే తేడాగా వున్నారా? కాని....మీ దృష్టిలో మాత్రం నేను నీచాతి నీచుణ్ని. నరరూప రాక్షసుణ్నిను. ఏం? (అంటూ అలసటగా కుర్చీలో కూర్చుంటాడు)

సుశీల : రాక్షసులు చాలా మందున్నారు. కాబట్టి? .... ఏమంటారు!

సార్వ : (నుదుట పట్టుకుని) నన్నే నన్నే! "యూ టూ బ్రూటస్" అన్నట్టుగా చెయ్యకు! ప్లీజ్ నా మనసేం బాగులేదు. సరే నువ్వన్నట్టే ఒప్పుకున్నాను. నేను రాక్షసంగానే ప్రవర్తించేను. కాని ఎందుకింత రాక్షసంగా ప్రవర్తించానో....నేను నా మనసులో ఎంత బాధపడి ఎలా కుమిలిపోతున్నానో....ఎవరికి తెలుసు....ఆ భగవంతుడికి తెలుసు సుశీలా! నువ్వుకూడా నన్ను అర్థం చేసుకోకుండావున్నావు. అర్థం చేసుకోవడం నీ కిష్టంలేదు సుశీలా! నీకు కోపం వచ్చింది. నాకు తెలుసు....వాడు అమాయకుడే అనుకో! నావల్ల పొరపాటే జరిగింది. కాని, ఇంత ఘోరం జరుగుతుందని ముందు అనుకోలేక పోయేను....సుశీలా, నా మనసులోకి చొచ్చుకు చూస్తే తెలుస్తుంది నీకు నా బాధ. ఏమిటి జీవితం అనిపిస్తోంది. విరక్తి పుట్టుకొస్తోంది. అలా ఎక్కడికైనా ఓసారి పోదామని వుంది. ఊళ్ళో వెధవలంతా తినేస్తున్నారు. అలా ఉత్తరాదికో యిలా దక్షిణాదికో పోయి

వచ్చేద్దాం రా! వన్లోపని-నాలుగు పుణ్యతీర్థాలూ చూసుకు రావచ్చు. అటునుంచి వచ్చాక ఈ వెధవ పాలిటిక్స్‌కి ఇంక స్వస్తిచెప్పేస్తాను. మన బిజినెస్ చూసుకుంటే మనకి చాలదా ? మన తోటలో ఓ పర్ణ శాల వేస్తాను. అక్కడికి పోదాం. హాయిగా వుందాం. ఈ పేద మున్సిపాల్టీవాళ్ళు ఆడ పిల్లల స్కూల్ కోసం అడుగు తున్నారు కూడాను. ఎంతకో కొంతకి ఇచ్చి పారేద్దాం. పర్ణశాలకి పోదాం. పర్ణశాలంటే కమ్మల గుడిసె కాదుస్మా ! అంతా చక్కగా ఇంగ్లీషు వాళ్ళ "కాటేజ్ లా" తయారు చేస్తా కదూ ! అక్కడికి పోయి నిశ్చింతగా వుందాం. నాకింక ఈ లిటిక్సూ వల్లకాడూ ఈ రకం జీవితం, ఇదేం వొద్దు నేనింక మారిపోతాను. నాకిదో పెద్ద గుణ పాఠం. నేను మరింక పూర్వంలా చస్తే వుండను. మారిపోతాను. అన్నట్టు సుశీలా, నే నిలా మారడానికే నాకో గుణపాఠం నేర్పడానికి భగవంతుడిలా ఇదంతా చేయించాడేమో !! ఎవడు చెప్పగలడు ? అలా ఎందుక్కాకూడదు. అంతా భగవంతుడి లీల కదా ! ఇదంతా భగవంతుడి లీలే ! ఇదంతా జరగడానికి మరో కారణం కనిపించదు.

సుశీల : అవును ఇదంతా భగవంతుడి లీలే ! అతనెలా ఆడిస్తూ వుంటే మనం అలా ఆడుతూ వుంటాం. అందుచేత, మీది. నాది. ఆ క్రిష్ణది, ఆ మధూది ! - మనవల్ల ఎవరిదీ కూడా ఇందులో తప్పు లేదు ! ఎన్ని అన్యాయాలు మనం చేసినా అవన్నీ తన లీలకోసం భగవంతుడు చేయించినవే ! మనకి ఇంక ఏ శాస్త్రాలూ ఏ ఏ ధర్మ సూత్రాలూ, ఏ న్యాయ స్థానాలూ, ఏ సాక్ష్యాలూ, ఏ తీర్పులూ ఉండక్కర్లేదు ఉంటే అది భగవంతుడి లీల ! ఉండక పోవటం అది కూడా భగవంతుడి లీలే ! భగవంతుడి లీల అదేమిటో గాని వీలయినన్ని సుఖాలూ, వాలు కుర్చీలూ మీవి ! అష్టకష్టాలూ అన్ని బాధలూ మరొకరివీను !

సార్వ : ఏమిటా మాటలు ? ? చాలించు ! ?

సుశీల : సార్వభౌమారావుగారూ ! సెలవు ! (అని చాలా బాధతో, నెమ్మ దిగా అంటుంది)

సార్వ : అదేమిటి ?

సుశీల : నాకింక సెలవిప్పించండి నేను పోతాను.

సార్వ : సుశీలా ! ఏఁవిఁటీ మాటలు ? : (అని నిశ్చేష్టుడైపోయి అలా కూర్చునే వుండిపోతాడు)

సుశీల : మీరీరోజున నా కళ్ళు తెరిచారు. మీకు నా కృతజ్ఞత! నీతి శతకాలూ, ధర్మశాస్త్రాలూ, అటక మీద పెట్టుకు పూటావొద్దన్నారు. ధైర్యం వుంటే వాటిని తలమీద పెట్టుకునీ వాటిని పాటించవచ్చున్నారు. ఇన్నాళ్ళూ నాకా ధైర్యం లేకనే అంతా యింత దురవస్థకి తీసుకొచ్చేను. ఆ ధైర్యం నాకుందో లేదో తెలుసుకుంటాను. వెళ్తాను.

సార్వ : ఎక్కడికి వెళ్తానంటావు ?!

సుశీల : (అక్కడే నిల్చొని వుంటుంది) ఎక్కడికైనా వెళ్తాను. పృథ్విలో యింత చిన్న ప్రాణికి చోటే దొరక్క పోతుందా !

సార్వ : (ఆమెద చెయ్యి పట్టుకొని) సుశీలా! నా మాట విను ? నువ్వు లేక పోతే నేనెలా వుండగలను ? నువ్వే చెప్పు ! నేనీ క్షణం నించీ నువ్వు కోరిన మంచిదారికి మారిపోతాను. నన్ను క్షమించు.

సుశీల : మిమ్మల్ని క్షమించటానికి నా కధికారంలేదు నన్నుకూడా ఎవ్వరూ క్షమించటానికి వీల్లేదు.

సార్వ : ఏఁవిఁటీ పిచ్చి మాటలు సుశీలా ! నువ్వెక్కడికీ వెళ్ళొద్దు నేను రాక్షసుణ్నే వప్పుకుంటాను. కాని మారిపోతాను సుశీలా ! నువ్వే చూద్దువుగాని ! ఎక్కడికీ వెళ్ళకు ! నేను మంచికి మారిపోతానని మాటిస్తున్నాను. నా మాట విను !

సుశీల : (నెమ్మదిగా చెయ్యి విడిపించుకుని నెమ్మదిగా నాలుగడుగులు వేసి నిలబడి) మీరు మంచికి మారుతానంటారా ? సార్వభౌమరావు గారూ ! క్షమించండి మీ మీద ద్వేషంతో నేనేం మాట్లాడ్డంలేదు. కానీ మీరు మారుతారని నాకు నమ్మకం లేదు. మీ మాటలు నేను విశ్వసించను. విశ్వసించ డానికి మీరెక్కడా అవకాశం ఎవ్వరికీ యివ్వలేదు మీరు మరింక మారరు. ఎందుకు మారరో తెలుసా ? మీరెంత ఘోరమైనా చేసేసి దాన్ని ఎలాగైనా, ఏవిధంగానైనా సమర్థించేసుకుంటారు. వెనుకటికి చేసినట్టే యికముందు కూడా

యింకెన్నో మోరాలు చెయ్యగలరు. మీరు చేసే ఆ ఘోరాల న్నింటిని వెనకటి కంటే నేర్పుగా యింకెన్నో విధాల సమర్థించేసు కోగలరు. నీతి నియమాలకు కట్టుబడిన మనుషులు తెలిసో, తెలియకో పాపాలు చేసినా వాటిని వాళ్ళు సమర్థించుకోరు-శిక్షననుభ విస్తారు ? బాధపడి చస్తారు. మీరలా కాదు. మీకు నీతి నియమా ల్లేవా అంటే, అవి మీకున్నాయి, లేకపోలేదు. కాని, మీరు వాటికి లోబడరు. అవే మీకు లోబడి వున్నాయి. లోకానికి నిప్పుపెట్టేసి, అది లోకం మంచికేనని శాస్త్రాల్లోంచి సూత్రాలు చదవగలరు మీరు; దేన్నికావలిస్తే దానికి పనికొచ్చేటట్టు మీక్కావలసినట్టు నీతి శాస్త్రాన్ని తయారుచేసి అందరి నెత్తినీ దాన్ని రుద్దగలరు మీరు. మీరింక, ! సార్వభౌమరావుగారూ, మీరింక మారరు మారరుకాక మారరు! కాదు మారుతానంటారా ? ఎప్పుడో బాణం పట్టుకు ఏ శ్రీరాముడో, నాగలి పట్టుకు ఏ బలరాముడో, గొడ్డలిపట్టుకు ఏ పరశురాముడో వస్తే మీరు మారాలేమో కాని, మీరు మరింక మారరు మీరేగాని మారితే, భగవంతుడున్నాడనే లెక్క; మిమ్మల్ని మంచికి మార్చగల వారెవరైనా వుంటే, వారు భగవంతునితో సమానమనే లెక్క ! మరింక నేనొస్తాను (అని రివ్వున వెళ్ళి పోతుంది)

సార్వ : (ఒక్క క్షణం అలా వుండిపోయిన పిమ్మట) సుశీలా ! ఒద్దు ! వెళ్ళొద్దు ! పట్టుకోండి పట్టుకోండి ! పోలిపిల్లి ! నూకరాజూ ! ! (అంటూ లేచి పక్కనున్న బల్లమీద రాక్షసంగా గుద్దుతాడు. బల్ల మీది బ్రాందీ గ్లాసులు గజగజ లాడతాయి ) ఎక్కడ చచ్చేర్రా రాస్కెల్స్ ! ! పట్టుకోండి, పట్టుకోండి. పిట్ట పారిపోతోందర్రా రాస్కెల్స్ !! పరుగెత్తండి, పట్టుకోండి (అంటూ భీకరంగా అరుస్తూ బైటకి వెళ్తాడు)

## 6

సెంట్రల్ జైల్లో ఓ గది. తెల్లవారుఝామున అయిదు గంటలు దగ్గర అవుతూ వుంటుంది. జెయిలు సూపరెంటూ, జిల్లా మెడికల్ ఆఫీసరూ, జెయిలు

డాక్టరూ, మేజిస్ట్రేటూ వుంటారు. ఎదురుగా కిటికీలోంచి మసక మసగ్గా ఉరిత్రాడు కనబడుతుంది. ఇద్దరు వార్డర్లు సోమసుందరాన్ని తీసుకు వస్తారు. అతను జైలు దుస్తుల్లో వుంటాడు. ఆఫీసరు అతణ్ని మర్యాదగానే చూస్తాడు.

సూపరెంటు : వెంటారావ్ సోమసుందరానివి నువ్వేనా ?

సోమ : నేనే, సుందరం అని కూడా అంటారు.

సూప : గుర్తులు చూడండోయ్ ! (అని చేతిలో కాయితాలు చూస్తాడు)

వార్డరొకడు : చిత్తం.

సూప : ఎడమ అరచేతిలో పుట్టుమచ్చ.

వార్డరు : (చూసి) ఉంది.

సూప : నుదుటిమీద చిన్న దెబ్బమచ్చ - ఎడంపక్క చూడు.

వార్డరు : (చూసి) ఉంది.

సూప : మెడమీద ఎడమప్రక్క నొక గంటు.

వార్డరు : (చూసి) ఉంది.

సూప : గుండెలమధ్య కాల్చిన మచ్చ.

వార్డరు : (చూసి) ఉంది.

(పై గుర్తులన్ని సూపరెంటు కూడా స్వయంగా చూసుకుంటాడు)

సూప : (మేజిస్ట్రేటును ఉద్దేశించి) చెప్పండి.

మేజిస్ట్రేటు : చూడు, సోమసుందరరావ్ ! నేను ఈ పట్టణానికి మేజిస్ట్రేట్ని.

సోమ : చెప్పండి.

మేజి : నీవు హైకోర్టు వారికి జెయిల్ ద్వారా అప్పీలు పెట్టుకున్నావు.

సోమ : పెట్టుకున్నాను.

మేజి : (కాయితం చదువుతూ) సదరు సోమసుందరరావు పెట్టుకున్న అప్పీలును ఇందుమూలంగా డిస్మిస్ చేస్తూ దిగువ కోర్టు విధించిన శిక్షను ఇందు మూలంగా ఖాయపరుస్తున్నాము అని (కాయితం చదివి) ఇందుమూలంగా నీకు తెలియజేయడమైనది. తెలిసిందా ?

సోమ : తెలుసుకున్నాను.

సూప : నిన్ను .... నిన్ను ఉరితీయమని కోర్టువారు పంపించిన వారంటు మేం అయిదు గంటలకల్లా అమలుచేయవలసి ఉంది.

సోమ : తెలుసుకున్నాను.

సూప : మరింక....నీవు....నీకు....నీకేదైనా ఆఖరి కోరిక వుంటే నీవు మాతో చెప్పుకోవొచ్చు. అది న్యాయసమ్మతమైనదీ, మేం తీర్చ దానికి వీలయినదీ అయితే, తీర్చడానికి ప్రయత్నం చేస్తాం.

సోమ : (ఒక్క క్షణం ఊరుకొని) ఆఖరి కోరికా ?

సూప : అవును.

సోమ : చెప్పమంటారా ?

సూప : చెప్పుకోవచ్చు.

సోమ : ఏక చెప్పమంటా రన్నల్లారా ! చెప్పటానికి అట్టే టైము కూడా ఉన్నట్టులేదు. ఈ నేరం నేను చెయ్యలేదు. మీకు తెలుసుకదా ! చేసినవారెవరో ఈ పాటికి యింకా నిద్రపోతూ వుంటా రను కుంటాను. వారు లేచేసరికి నేను పడుక్కొనుంటాను. ఈ నేరం చేసినవారెవరో కాని వారు ముందుకి ఏ పాపమూ మరింక చేయ కుండా వుంటే చాలు, నాకది చాలా సంతోషం. వారి నలా విడిచి పెట్టండి. నే నిప్పుడింక పోతున్నా. పోతున్నాను. నాకేం భయం లేదు, బెంగాలేదు. నేను చాలా పాపాలు చేసేను. నా పాపం విచా రించే వారెవరూ వుండరు. నేను పోయేనంటే సంఘానికి తీరని లోటంటూ ఏమీలేదు. నేను పాపాత్ముణ్ణి. కాని అందరూ నాలాటి వాళ్లే కారుకదా ? ! లోకంలో ఎక్కువమంది అమాయకులున్నారు. నిజం నిలబడక పోతే ఆ నష్టాలు ఆ బాధలు-అవన్నీ వారే అనుభ వించవలసొస్తుంది. అమాయకులే లేకపోతే లోకమే లేదు. మాయ గాళ్లు పెరిగారంటే అమాయకులు చస్తారు. అమాయకలోకమే అసలైన లోకం. కాని మాయాలోకం కాదుకదా ! అందుచేత నిజ

మైన లోకం నిలబడాలంటే నిజం నిలబడాలి. సూపరెంటుగారూ ! లోకం అంతా నిజం పలకాలనేది నా ఆఖరి కోరిక ! కాని లోకం అంతటి చేతా మీరెలాగూ నిజం పలికించలేరు. అందుచేత....(అని జిల్లా మెడికల్ ఆఫీసర్ని చూపించి) వారెవరు ?

సూప : జిల్లా మెడికల్ ఆఫీసర్‌గారాయన.

సోమ : బాగుంది. వారు, మీరు అరుగో మా జెయిల్ డాక్టరుగారు! ఇరుగో మేజిస్ట్రేటుగారు వీరిద్దరు వార్డర్లు - కనీసం ఇక్కడున్న వారంతా మీ మీ జీవితాల్లో ఇకముందెల్లప్పుడూ నిజానికి నిలబడతామని నాకో చిన్న వాగ్దానం మీకు వీలయితే చేయండి. ఏ ఒక్కరైనా చేయండి. చేస్తే చాలు నేను హాయిగా ప్రాణం విడుస్తా.

(అందరూ ముఖ ముఖాలు చూసుకొంటారు)

సోమ : (జవాబొస్తుందేమోనని ఒక్క క్షణం ఊరుకొని) సూపరెంట్ బాబూ ! నన్ను మన్నించండి. నన్నిక్కడిన్నాళ్ళించింక లేసుకురాండి. దైవము తోంది మరింక నేను కోరేదీ, చెప్పేదీ యింకేముంది ? ! నేనిక్కడ కులాసాగానే వున్నాను. అక్కడ పెద్దలందరికీ దండాలు, చిన్న లందరికీ దీవెనలు. పిల్లలందరికీ ముద్దులు మీరంతా అంటే నాకు చాలా ఇష్టం చాలా తప్పులు నేను చేసేను. నన్ను మన్నించండి. నే వెళ్తాను. సెలవ్ !

(జెయిలు వార్డర్ల మధ్యగా నడిచి వెళ్తాడు. అతని వెనక ఆఫీసర్లు వెళ్తారు)



# నిజం

రాచకొండ విశ్వనాథశాస్త్రి



